# విశ్వదాభిరామ వినురవేమ తందాన తాన వంటిది కాదు కాముక వైరాగ్య దశలు రెంటికీ సరిపడగల యర్థమున్నట్టిదే

అపండితుడుగా కానవచ్చిన వేమన తన ఆట వెలదికి కూర్చిన మకుటానికి అర్థ నిర్ణయం మన పండిత షరాబులకు వల్ల దప్పిన విషయమై శతాబ్దులుగా వుండి పోయింది. ఎందరో ప్రయత్నించారు; పాండిత్యమంతా వెచ్చించి చాలా అర్థాలు తీశారు. ఏ సంస్కృతాంధ్ర లాక్షణిక మహాకవి పద్యపంక్తికీ కుదరనన్ని అర్థాలు ప్రయాసపడి సాధించి యిచ్చారు.

'విశ్వదాభిరామ వినురవేమ' అన్నదే మకుటుంగా తీసుకొని చెప్పిన అర్థాలు లెక్కకిప్పటికి అష్టాదశ సంఖ్యకు చేరుకొన్నాయి; మించినై. యీ మకుటానికి పాఠభేదాలు మరో నాలుగున్నాయి:

'విశ్వతాభిరామ వినురవేమ' - 'విశ్వతోభిరామ వినురవేమ' - 'విశ్వథాభి రామ వినురవేమ' - 'విశ్వతాభిరామ వివరివేమ' అంటూ కొన్ని వ్రాతప్రతుల్లో - చిన్న ప్రతుల్లో - కనిపించుతున్నాయి. ఇందులో 'విశ్వతాభిరామ వినురవేమ' అన్నది విశ్వదాభిరామ కన్నా కూడా బాగున్నదని గ్రహించి అర్థం చెప్పిన రాళ్ళపల్లి వారున్నారు. కాని తక్కిన మూడూ అర్థవంతాలని, వ్యాకరణ శుద్ధాలనీ భావించలేదనుకొంటాను వారుకూడా. వానికేమైన అర్థగతి కలిగించవచ్చు ననుకొంటే మాత్రం అర్థం చెప్పకుండా వదిలేవారు కాదనుకొంటాను. అర్థవైచిత్రిని సాధించటం మన పండితులకొక క్రీడ, వినోదం గదా! వినోదమయితే మనం కూడా ఎందుకు వదలాలి. వాటికీ అర్థం రాబట్టుదాం - ఆ చోద్యమూ చూద్దాంమరి.

ముమ్ముందుగా 'విశ్వదాభిరామ వినురవేమ'కు చెప్పిన అర్థ జాలాన్ని వేడుకగా చూడవచ్చు .

1. Listen O vema! Dear to the Lord of all
   సర్వేశ్వరునకిష్టుడైనవాడా! వేమా! వినుము. (సి.పి.బ్రౌన్)
   తిరుగుబోతుగా? నున్నప్పుడు కూడానా?

2. O Vemana! the beloved of the gods.
   వైశ్యాలోలుడగా వున్నప్పుడు, తిరుగుబోతుగానున్నప్పటి దశలో కూడా
   దేవ ప్రియుడా! వేమా! విను. దేవతలకు ఇష్టుడైనవాడా! వేమా! విను.

(పిశుపాటి కృష్ణమూర్తి)

# వేమన దర్శనం -
# విరసం వేరిటి వక్రభాష్యం



త్రిపురనేని వెంకటేశ్వరరావు



వే మ న వి కా స కేం ద్రం
మొగల్రాజపురం : : విజయవాడ-10

ప్రచురణ నెం 3.
మే, 1982.

వెల : రు. 6-00


ప్రతులకు :
వేమన వికాసకేంద్రం
36-12-6, మొగల్రాజపురం,
విజయవాడ-520 010.
Phone : 76588.

ముద్రణ :
గాయత్రీ ప్రెస్
సత్యనారాయణపురం, విజయవాడ.
శ్రీ వెంకటరమణ ప్రింటర్సు
కార్మికపురం, విజయవాడ-2.

# విషయసూచిక

వుంది. అందుచేత యీ పుస్తకాన్ని వీరి పేరుమీదగానే పిలవాల్సి వచ్చింది. అన్నిటా ఆర్భాటం ఉద్వేజకతా పెరిగి విషయనష్టి జరుగుతున్నట్టే వీరి పరిస్థితీ దీగనాసేనవి నిరూపించుతున్నారు. ఉరుములు మెరుముల సంరంభమేగాని చినుకులు రేలేదిలేదు. ఉష్ణోగ్రత పెంపేగాని కాంతి ప్రసరణలేదు. ఎంతైనా పాతతరం మార్క్సిస్టు విజ్ఞ వర్గమే వ్రాతకైనా వాదానికైనా నయం నాణ్యం అని యీ చర్చ రుజువిస్తున్నది.

అందులో బలరామ్మూర్తిగారింకొంత నయం. వేమనలో ఆర్థిక భావాలున్నై యని సమీక్షలో ఒప్పుకొన్నారు. తర్వాత మరికొంత మారి, ఆ వెంటనే చేసిన రేడియో ప్రసంగంలో వేమన ఆర్థిక సమానత్వం బోధించారని ఏకంగా చెప్పగల్గారు. అంతమాట నే ననలేదు, అనలేను. కొల్లా వెంకయ్యగారు తమ పుస్తకంలో వ్రాసిన దానికన్నా, మా వేమన సాంస్కృతికోత్సవాల వేదిక నుంచి చేసిన ప్రసంగంలో మరింతగాను, ఆ తర్వాత వ్రాసి పంపిన వ్యాసంలో ఇంకెంతో అధికంగానూ వేమనను ఆర్థిక చింతకునిగా, విప్లవ వైతాళికునిగా గుర్తించి ఉగ్గడించారు. సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు మార్క్సిస్టులు అయిన యం. పట్టాభిరామిరెడ్డిగారు యీ వాదోపవాదా లన్నీ విని, మార్క్సిస్టు సాంస్కృతిక వర్గాల్లో కలిగిన 'భయాందోళనలు' తెలుసు కొని మరీ నాతో ఏకీభావాన్ని తెలుపుతూ వ్రాశారు. వేమన మన తొలి విప్లవకవి - మన విజ్ఞాన వికాసోద్యమ మూలమూర్తి అని వ్రాశారు.

ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర రెండో సంపుటం వెలువరించి, మిత్రులు కంభంపాటి సత్యనారాయణగారు నన్ను ఆశ్చర్యపరచారు. "వేమన ఆర్థిక అసమాన తలను నిరసించాడు ...ధనికులకు బీదలకు మధ్య పెరుగుతున్న అగాధాన్ని చూడడమేకాదు, కులము కలుగువారు గోత్రంబుగలవారు పసిడిగలుగువారి బానిస కొడుకులో అంటూ వర్ణాల ప్రాభవంపోయి, వర్గ ప్రాభవం ఏర్పడటాన్ని గమనించిన మొదటి తెలుగు కవి" (పేజీ 244) అని స్పష్టంగా వ్రాశారు. ఆర్థికాంశంగల యిన్నూరు మున్నూరు ఆట వెలదులను ముందు బెట్టుకొని వాని అర్థం తెమల్చుకొనే ఓపిక ఉంటే యీ అభిప్రాయాలకు రాక తప్పదు. వేమన విజయయాత్ర యిలా సాగక తప్పదు.

మార్క్సిస్టులతో చర్చలో చారిత్రక భౌతికవాద ప్రసక్తి రాక తప్పదు. వేమనవంటి ఒక పెద్ద సామాజికార్థిక చింతకునిపై చర్చలో అది తలెత్తక తప్పదు. ఈ మిత్రు లందరూ వేమనపరంగా అతని భావాలకు, నాటి చారిత్రక నేపథ్యానికి, అతని జీవితానికీ దాన్ని అన్వయించబోయినవారే. ఆ అన్వయం తీరుతో నాకు భేదం వుంది. దాన్నొక ఆర్థికనియతివాదంగా అన్వయిస్తున్నారని అవాస్తవమనిపించింది. అలా అన్వయించిన తావుల్లో కొన్ని గుర్తుప్రశ్నలుంచాను. 'ద్రౌపది నవ్వునక్కా, వీపుమీద

దురదకూ'చారిత్రకభౌతికవాదంసమాధానంచెప్పదన్నారిందులో ఒకరుగుడివాడ సభలో.
ఈ ప్రశ్నలు అటువంటివి, కావమకుంచేనే ప్రశ్నలు

సరుకుల ఉత్పత్తి పెరిగి, అంగళ్ళు ఏర్పడి, క్రయ విక్రయాలతో వాణిజ్యం పెరిగినందున కులం అడ్డుగోడలు సడలక తప్పని పరిస్థితి ఏర్పడగా కులభేదం వదలాలనే భావాలు కలిగాయని, వేమన కుల నిర్మూలనోద్యమానికి ఆ చారిత్ర కావశ్యకత ఉత్పత్తిఅవసరంఅలాగేఏర్పడిందని అతనిఆభావాలకుప్రేరణప్రధానంగా వర్తకవర్గమంటూ సూత్రించడాన్ని కాదని, అటువంటి భావాలు ఈ సరుకు,అంగడి, వర్తక విస్తృతికి సంబంధం లేకుండానే, ఆ పరిస్థితికిముందే తలెత్తినవని, విజృంభించినవని—ఈ ఆర్థిక కారణం ఎక్కువగా వున్న తీరంలో కులంతో పొత్తుబాయలేని మతోద్యమాలు, యీ కారణం లోపించిన దేశంలోతట్టుసీమలో కులాన్ని కాల్చమన్న మతోద్యమాలు లేచినవని చూపించవలసి వచ్చింది. సరుకులు-అంగళ్ళు-పర్యాటక జీవితంవల్ల కులవ్యవస్థకు వ్యతిరేకాభిప్రాయాలు కలగటానికి వీల్లేదనికాదు, అవిలేకుండా కూడా అవి కలుగగలవని కలిగినవని చెప్పడమే ఉద్దేశం. ఈ చారిత్రకార్థిక కారణమే కారణమైతే, వేమననాడు కులనిర్మూలనోద్యమం భారతదేశ చరిత్రలోకెల్ల బలమైనదై యుండాల్సింది. అంతగా వాణిజ్యంపెరిగిన సందర్భమది. కాని అందుకు విరుద్ధంగా చాలా బలహీనంగా వున్న కాలమది.

కులవ్యవస్థ వర్తకాభివృద్ధిని అరికట్టిందనే భావాన్ని వ్యతిరేకించి రొలామీ థాపర్ మీ వాదానికి బలాన్ని చేకూర్చుతున్నారంటూ ఆయమ్మ వ్రాసిన గతాన్ని గురించిన అపోహలు (తెలుగు) పుస్తకాన్ని తెచ్చి చదివి వినిపించారొత మిత్రులు. "ప్రాచీన భారతీయ సమాజాన్ని స్వేచ్ఛాసమాజం అనిగానీ, స్తబ్దమయిన సమాజం అనిగానీ అనలేము (పేజీ 26)

"మతంగాని, కులంగాని భారతదేశంలో ఆర్థిక కృషికి ఆటంకమయిందనడానికి అవకాశం లేదు. ప్రాచీన వాణిజ్య చరిత్రమధ్యాసియా, ఆగ్నేయాసియాలోభారతవర్తక స్థావరాలు ఆరోగ్యకరమైన అర్జనాశక్తికి నిదర్శనాలు...." పేజీ-39అనివ్రాసినట్లువినిపించారు. వర్తకులు ప్రాధాన్యం వహించిన జైన బౌద్ధాలు క్రమేణా కులవ్యవస్థకు తలొగ్గటం కూడా దాన్నే సూచిస్తుందన్నాను. అది విన్న తర్వాత ఇంకా యిక్కడ ఇస్లాంలో వర్తక కులాలు ఏర్పడి వాణిజ్యాభివృద్ధిని అమోఘంగా సాధించడమెుక

టున్నదనాలి. షియా శాఖలో బొహ్రా ఖ్వాజా కులాలు. అవేగదా గుజరాతుతీరంలో వేమన కాలంనాటికి ఆధిక్యంలో వున్నాయి.

## 6వ పేజీ మొదటి పేరా తర్వాత

అంతేకాదు. ఈ చర్చలో బట్టల పరిశ్రమాభివృద్ధినేదో అంటరానితనం ఆడగించిందన్న వాదనమాట వచ్చింది. పంచమకులాలు చేనేత కులాలుగావుండేవి. చేనేత మాలల ప్రధానవృత్తి. మాలనేత అన్నది స్రామెతకెక్కినమాట కాపునూలు కమ్మనూలుతోపాటు మాలనూలు మాదిగనూలుకూడా వుండేది నూలు తయారీలో కూడా పంచములున్నారని ఇవి తెల్పుతాయి. అసలు తెలుగు, తమిళ, కర్నాటకాలలో పంచములు వ ర్తకంలో వున్నట్టు ఇంగ్లీషు రికార్డుఉంది ఆంధ్ర, ఒరిస్సా సరిహద్దుల్లో శ్రీకాకుళం కోరాపుట్టి గంజాము జిల్లాల్లో పైడీలు(పాణోలు, డోంబులు అనికూడా వీరినంటారు) వ ర్తకంలోనే గాకుండా నేతపనిలో యిప్పటికీ వున్నారు. పైడిదుప్పటి మన్నికకు పేరు. అందరూ కొని వాడుకొంటారు. ఆ పైడీలపంచములు. ముదుగు నూలు, ముదుగుబట్టలోనేగాకుండా సిల్కు చేనేతపనిలో మాలలెక్కువగావుండేవారు. 18వ శతాబ్దంలో ఇంగ్లీషువాళ్ళ లెక్కప్రకారం సిల్కుచేనేతలో మూడోవంతుమగ్గం మాలమగ్గమని తేలి ది. పంచములను అంటరానివారినిచేసిన హిందూసంఘం పంచములు తయారుచేసిన వస్తుసముదాయాన్ని అంటరానిదాన్ని, వాడరానిదాన్ని చెయ్యలేదు. చేతివృత్తుల్లో వారున్నారు. వారిచేవస్తువులు అగ్రకులాల వాడకంలో వున్నై. చేతివృత్తుల అభివృద్ధికి అస్పృశ్యత ఎప్పుడూ అడ్డుకాలేదు.

నట్లిదిగా తీసుకొని సమాధానం అన్వేషించడం కరణీయం, కర్తవ్యం. సత్యాన్వేషణ సగంలో ముగించక అప్రియమైనా కొసకంటా వెళ్ళాలనుకొనే మాటుంటే మార్క్సిజాన్ని ఆర్థిక నియతి గాకుండా కొంత అర్థం చేసుకునే మాటుంటే ఈ ప్రశ్నలు ఆలోచిస్తారని తలుస్తాను. గతి తర్కాన్ని ముఖ్యంగా మనిషి గుర్తుగొన్నదే భావ ప్రపంచంలో నన్న గ్రహణ వుంటే, భావాలకు కొంత సొంతగతి అంటూకూడా ఉంటుందని గ్రహించడం మాత్రం అవసరం. ఆ స్ఫురణతోనే ఈ ప్రశ్నలు.

ప్రాచీన భారతదేశ చరిత్ర తగినంత సమాచారం పోగుకాక, లేక, చరిత్రకారుల చేతిలో అదొక మైనపుముద్దగా తయారయినదనవచ్చు. మార్క్సిస్టులు సైతం

ఎవరికివారు తమతమ సులుసూత్రపు మార్క్సిస్టు భాష్యం కోరకు దాన్ని అటువంటి మైనపు ముద్దగానే వాడుకోకుండటాన్ని లక్షించవలసే వున్నారనుకొంటాను.

## వేమన - అతని నేపథ్యం

16, 17 శతాబ్దాలలో చేతి పరిశ్రమలతో ఇండియా ప్రపంచ కార్ఖానా అన దగివున్నది. పోర్చుగీసు, ఇంగ్లీషు, డచ్చి, ఫ్రెంచివాళ్ళంతా పోటా పోటీలుపడి ఇండియన్ వస్తువులు ఖరీదు చేసుకొని ఐరోపా అంగళ్ళలో అధిక ధరలకు అమ్ముకొనడమే లక్ష్యమయింది. పెద్ద పెద్ద ఓడల్లో మందుగుండుతో వారు దిగినప్పటికీ, మనకు అమ్మదగిన సరుకుతో వారు ఇండియాకు రాలేదు. యూరోపియన్ వ్యాపార వర్గంకన్నా ఇండియన్ వర్తక వర్గమే ధనవంతమైనది. తెల్లజాతి వర్తకులు జాయింటు స్టాకు కంపెనీలు కట్టి యిక్కడకు వస్తే, ఆ కంపెనీల వద్దలేని ద్రవ్య నిధులు గల వర్తక ప్రముఖులెందరో వ్యక్తులుగా మనకున్నారు. పోర్చుగీసువాళ్ళు దిగి యాభయ్యేళ్ళయ్యేసరికి దేశి వర్తకులను ముఖ్య వాటాదార్లుగా తీసుకొని (66%) వ్యాపారం నడుపుకోవలసి వచ్చింది. ఇంగ్లీషువారికి అప్పుపెట్టే బలవంతులున్నారు. యూరోపియన్ ఫ్యూడలిజంలో వున్న నిర్బంధాలు యిక్కడలేవు. ఫ్యూడల్ ప్రభువర్గంవర్తకవర్గాన్నితొక్కిపెట్టటంవారిమధ్యపెద్దవైరుధ్యవుండటమూనిజంకాదు. వేమన ముందు వెనుకలుగల ఈకాలంలోపరస్పరం పోటీపడేనాలుగునిదేశీవ్యాపారసంస్థలవల్ల మన వస్తువులకు గిరాకీ పెరిగి అవి సప్లయి చేసే దేశీవర్తకులకు దళారులకూ గిరాకీ పెరిగిందిగాని యిబ్బందులు పెరగలేదు.

16వ శతాబ్దిలో చేతిపరిశ్రమలకు వర్తకానికి అపూర్వఅపారావకాశాలిలా పారదెరచుకోగా, ఇండియన్ రాజకీయ వ్యవస్థ 17వ శతాబ్దం నడిచే కొలదీ కలిసి రానిదైపోయింది, కొరగానిదయింది, వంచించిందనవచ్చు. తళ్ళికోటతో చావుదెబ్బ తిన్న హంపీరాజ్య భాగాలను పోటీపడి బీజపూరు, గోల్కొండలు కలుపుకొనే దండయాత్రలతోనూ, ఈ రెండింటినీ లొంగదీసుకుని క్రమంగా కబళించడానికి మొగల్‌షాహీ పూనుకోవడంతోనూ, ఈలోగా తలెత్తిన మరాటాక్షాత్రం ఆ మొగల్ షాహీకిప్రతిద్వంద్వి కావడంతోనూ ముఖ్యంగా దక్షిణదేశమంతాఎడతెగనిరణరంగంగా మారింది. విజేతలు కూడా దుర్బలులుగా బయటపడ్డారు. రాజులుఅప్పులపాలయ్యారు.

సైన్యం ప్రజను దోచుకొని బ్రతకడంగా మారింది. ఆర్థిక వ్యవస్థ మొయ్యలేని యుద్ధ వ్యవస్థను పాలకవర్గాలు సృష్టించాయి. రాజ్యవ్యవస్థా వైఫల్యమిది: మన చరిత్రలో విషాద పరిణామమిది.

ఈ కాలంలో కులభేదాలను కాల్చిమనడంతో ఆగకుండా పూజారులు, వర్తక పాలక వర్గాలను రెండింటినీ ఏవగించుకొని ధనిక దరిద్ర వ్యత్యాసాలను తగ్గించాలని మధ్యతరగతి వ్యవస్థ సంఘానికీ వ్యక్తికీ ఆరోగ్యప్రదమని ఆర్థిక ఉద్బోధతో ముందుకు వచ్చిన ఏకైక వ్యక్తి వేమన. సంసార సన్యాస ప్రపంచాలు రెండింటి లోతూ చూచిన వేమన, రెండింటా మౌలికమయిన మార్పుల్ని చెప్పాడు. భక్తి ఉద్యమంలోనూ, బైరాగుల సంస్కృతిలోనూ పట్టేవాడు ఇమిడేవాడుకాడు వేమన. యూరోపులోరినేజాన్సుచేసినవిజ్ఞానప్రబోధం, హేతువాదం,మానవతాదృష్టితోపాటుగా అందులో అప్పట్లో ద్యోతకంకాని ఆర్థిక వ్యత్యాసాలు తగ్గించాలనేదృష్టినికూడాజోడిం చుకొన్న విశిష్ట వ్యక్తిత్వం వేమనది. విజ్ఞాన వికాసానికి ఆర్థిక సాంఘిక విప్లవచేత నకు ఉభయానికీ మూలమూర్తివేమన.

రాజ్యవ్యవస్థ ఆర్థికాభ్యుదయాన్ని వంచించి భారతదేశాన్ని పారిశ్రామిక యుగంలో స్వయంగా అడుగిడ నియ్యకుండా నిలుపుచేసింది. వేమన భావ సరళి అవ్యాహతంగా కొనసాగకపోయింది. భావతంతువుమధ్యలో తెగిపోయినట్లుంది. తెల్లవాళ్ళ క్రింద తెల్లవాళ్ళ ప్రభావంతో మరో రినేజాన్సు కేవలం రినేజాన్సు గానే తలచూపవలసి వచ్చింది. రామ్మోహనరాయ్‌తో ఆరంభించి, ఆ తర్వాత ఆంధ్రలో వీరేశలింగంగారి పేరిట చెప్పుకొంటున్న వికాసోద్యమం పరిమిత ప్రమా ణంలో రూపొందవలసి వచ్చింది. ఇదీ నా అవగాహన. ఇక యీ చర్చ మంచిచెడ్డలు విజ్ఞులే వివేకిస్తారు.

—త్రిపురనేని వెంకటేశ్వరరావు.
[విజయవాడ]

# నేటికాలానికి వేమన అవసరం?

— జ్వాలాముఖి

12-00 A. M. 31-5-1981 ప్రసంగపాఠం టేపు ఆధారంగా

మొట్టమొదట వేమనను వెలుగులోకి తెచ్చిన సి. పి. బ్రౌను స్వభావాన్ని, అతనువచ్చిన సందర్భాన్ని, అతడు చేస్తున్న వృత్తిని మరచి మనం అతనియొక్క నిర్ణయాన్ని, లేదా, అతని ప్రచారాన్ని గుర్తించుకోనక్కరలేదు. అతడు సామ్రాజ్య వాది. వలసాధిపత్యాన్ని భారతదేశంలో సుస్థిరం చెయ్యడానికివచ్చిన అనేకానేక బ్రిటిషు అధికారులలో అతడొకడు. కాబట్టి వలసాధిపత్యాన్ని సుస్థిరం చేయడానికోసమని ప్రజల్లో ముఖ్యంగా క్రిందివర్గాల్లో అనగా శ్రమజీవుల్లో బాగా వేళ్ళూను కొనేటట్టు వాళ్ళు చేరాలి. అప్పటికే ప్రజలు తమయొక్క అవసరాలమేరకు కొన్ని సంస్కరణల్ని కోరుతున్నారు. కొన్ని మార్పుల్ని కోరుతున్నారు. వలసవాదులకు సంస్కరణల నేవి రాజకీయావసరం. అవి మనకు యిష్టమున్నా లేకపోయినా వారికి రాజకీయంగా చాలా తప్పనిసరి.

ఇక సాంఘిక నేపథ్యంనుంచి చూస్తే అభివృద్ధిచెందుతున్న సమాజంలో సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా అభివృద్ధి చెందుతూ వుంటుంది సమాజం మన కిష్టమున్నా, లేకున్నా. అప్పుడు అభివృద్ధిచెందుతున్న శక్తులు కొన్ని మార్పుల్నికోరుతాయి. మార్పుల్ని అనివార్యం చేస్తాయి సమాజంలో.

అవి తాత్విక చింతనలో కానీయండి, మిగతా విషయాల్లో కానీయండి, ఏతాత్విక చింతనా, ఏ సంస్కృతీ, ఏ భాషా చివరకు జానుతెనుగు కూడా నాటి సమాజావసరానికి భిన్నంగా రాదు. అందుకు తిక్కనే ఉదాహరణ. సమాజావసరం తీరాక అదే

ఆ రూపంలోనే వుండజాలదు. ఇందుకుకూడా తిక్కనే ఉదాహరణ. కాబట్టి ఆనాటి సమాజంలో అభివృద్ధిచెందుచున్నట్టి శక్తులు స్పష్టంగా మార్పును కోరుతున్న సందర్భంలో వచ్చినటువంటివాడు వేమన. వేమన తనకు యిష్టంగానటువంటి, చేతగా తటస్థపడినటువంటి తన జీవితంలో తాను వ్యక్తిగా వైఫల్యం చెందినటువంటి సందర్భాల్లో - మరీ నేనింకా Coin చేయాలంటే - ఒక సృజనాత్మకమైన అరాజకవాది. అనార్కిస్టు Basically

దానివల్ల ఏర్పడినటువంటి వైఫల్యాలవల్ల అతను సమాజంలో కొన్ని స్థిరపడిన విలువలముందు కొన్ని ప్రశ్న గుర్తులు పెట్టాడు. అంతవరకు మనం వేమనను అంగీకరించడానికి భేదాభిప్రాయంలేదు; విప్రతిపత్తి లేదు.

కాని అతను చెప్పిన సమాధానాల విషయంలోమాత్రం మనకు పూర్తిగా భేదాభిప్రాయంవుంది. వుండాలికూడా. అతను తెల్సుకొన్న సమాధానాలు సమాజం కోరుతున్న సమాధానాలుకావు. అతడు మొట్టమొదట మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా, యజ్ఞయాగాదులకు వ్యతిరేకంగా, కర్మకాండలకు వ్యతిరేకంగా, పురోహితవర్గానికి వ్యతిరేకంగాపెట్టిన ప్రశ్నగుర్తులు చివరకు రాజయోగంలోకి అచలయోగంలోకివచ్చి చేరాయి. ఇది Development in reverse. ఇది వేమన పాపమా ? ఇది వేమన బలహీనతా? కాదు. ఆనాటి యుగంలో వున్నటువంటి స్వభావం. అయితే ఎవర్నయినా మనం వెలకట్టేటప్పుడు ఒకానొక అంశంలోనే మనం గుర్తించి మిగతా మొత్తం అంశాలన్నింటిని గుర్తించకపోతే, అతనిగుర్తింపుకు అపచారం అవుతుందనేటటువంటి పీకులాట మనకుండగూడదు. అది పెటీ బూర్జువామనస్తత్వం. వేమన మూఢనమ్మకాలకు ఎదురుగా ప్రశ్నగుర్తులుపెట్టి, చివరకు శివయోగం గురించి, రాజయోగం గురించి, అచల యోగంగురించి అంతగా పాదాక్రాంతం కావలసిన అవసరం అసలు లేదు. అంటే Basically అతను మౌలికమైనటువంటి Thinker కాడు.

బాహ్యాచారాలమీద చేసినటువంటి దాడి, ఆ బాహ్యాచారాలు ఆవిధంగా రావడానికి కలిగినటువంటి సాంఘికమైన కారణాలేవి? రాజకీయమైన నేపథ్యం ఏమిటి? ముఖ్యంగా ఉత్పత్తి సంబంధాల్లో వున్నటువంటి మార్పు దశలు ఏమిటి? అన్నది వేమన గుర్తించలేదు. ఇంతకంటే మహామేధావిగా కనిపించినటువంటి కబీరుకూడా గుర్తించలేదు.

అందువల్ల సరుకులు ఉత్పత్తి అవుతున్నకొద్దీ కులీన సమాజం బీటలు వారక తప్పలేదు. సరుకులకు అంగళ్ళురాక తప్పలేదు. అంగళ్ళవల్ల పర్యాటక జీవితం అనివార్యమయ్యింది. పర్యాటక జీవితంవల్ల జీవితానుభవం పెరిగింది. జీవితానుభవం పెరగడంవల్ల, స్థిరమైన విలువలయొక్క కూడలి మొత్తం బద్దలవుతూపోయింది.

ఈ విధంగా బద్ధలుకావడంవల్ల వాళ్ళందరూ అంతవరకూ బాహ్యచారాలమీద దాడిచేశారు. తిరిగి మళ్ళీ దెబ్బతిన్నటువంటి కులీన వర్గమంతా కూడా మౌలికంగా శివతత్వం మంచిదే, మౌలికంగా అద్వైతం మంచిదే, దాన్ని ఆచరించే వాళ్ళ పొరపాట్లవల్ల దాన్ని పొరపాటనడానికి వీల్లేదు అనే దశదాకా ఉపయోగపడడానికి వేమన ఆస్కారం కలిగించాడు. ఇక్కడ మనం భేదించక తప్పదు. వేమన చిత్తశుద్ధి గొప్పదే కావచ్చు. వేమన నిర్వహించిన పాత్రకూడా గొప్పదేకావచ్చు. కాని అది సమగ్రంకాదు. ఎంతక్రమంలో అభివృద్ధిచెందాలో అంతక్రమంలో అభివృద్ధి చెందలేదు. ఇదీ వేమన సారం.

మరీ ముఖ్యంగా అభ్యంతరకరమైనది : వేమన నారీద్వేషా? నారీదూషా? అన్నది. ఇది Academic చర్చ. Basical గా స్త్రీని ఆనాటి కవులు రచయితలు తాత్వికులు ఏ విధంగా చూశారు ? స్త్రీని వినిమయ పదార్థంగా చూశేటువంటి క్రమం నుంచి వేమన తనను తాను విముక్తం చేసుకోలేదు. వేశ్యను పొందివుండాల్సిన ఆస్తిగా తాను ఇష్టంవచ్చినట్టు అనుభవించవచ్చు. ఆ వేశ్య తన అనుభవం తర్వాత కోరేటువంటి శ్రమఫలితాన్ని గురించి అతనికి మళ్లీ భేదంవున్నది.

జాగ్రత్తలకు సంబంధించిన విషయంలో, వేమనలాంటి ఉదారుడికికూడా విస్తృతి లేదు. ఔదార్యం వ్యాప్తికాలేదు. ఇక్కడ Basical గా వేమనయొక్క intellect ను మనం Question చేస్తాం. వేమనయొక్క ఔదార్యంకూడ పరిమితులు దాటలేదు. అన్నిటికంటే నేను చాలా ప్రశ్నార్థకంగా భావించినటువంటి విషయమేమిటంటే ఉన్నవాళ్ళను దానాలు చెయ్యమనటం. అది ఈనాటి గాంధీగారి ధర్మకర్తృత్వ సిద్ధాంతంగా నాకు కనపడింది - (Trusteeship Theory) "ఇచ్చేయండి. ఇంతకంటే పరిమితికి మించినటువంటి ఆస్తి ధనవంతులు ఉంచుకోవటానికి వీల్లేదు. ఇంతకు దాటి వెళ్ళడానికి వీల్లేదు." ఇలా ఎన్నెన్నో ఎన్నెన్నో వేమన చెప్పాడు. ఆ దానంకూడా నాటి సాంఘిక చట్రం వల్ల బ్రాహ్మడికే ఇస్తారు. బ్రాహ్మడు కానివానికి దానమిచ్చే సందర్భాలు చాలతక్కువ. ఏదోచిన్నవాడికి ఎంగిలికూడు వేస్తాడు. భారతీయసంస్కృతి యొక్క బాధఎంతటిది అంటే, గెలిచిన జాతులయొక్క తెగలయొక్క జీవితవిధానమే భారతీయ సంస్కృతిగా మధ్యయుగాలద్వారా ప్రచారమయింది. మానవజాతికి, భారతీయ శ్రమజీవులకు శంకరాచార్యుడు తీరని క్రూరమైన అపచారం చేశాడు. అతడు Number 1 - enemy of the people. బుద్ధునియొక్క భౌతిక దృక్పథాన్నీ, చార్వాకులయొక్క భౌతికమైన అంశాన్ని నిర్ధూమధామం చేసినటువంటి శంకరుడు, ఆ తరువాత వచ్చిన అతడి అనుచరులు భారతదేశం యొక్క క్రమాన్ని, వికాసాన్నికూడా మంటగలిపారు. ఈ మధ్యయుగాలకాలంలో ఏదైతే Medieval period అంటున్నామో, దాదాపు 4, 4 శతాబ్దాలనుంచి 11 వ

శతాబ్దంయొక్క మధ్యకాలం, పన్నెండవ శతాబ్దకాలందాకా యీ భౌతికవాదాన్ని పరాస్తం చెయ్యడానికి పడరానిపాట్లు, చెయ్యరాని కిరాతకాలు చేశారు. వెళ్ళి అమరావతిలో చూడండి. ఇరవై అడుగుల స్తూపాన్ని 5 అడుగులదాకా పైనవుంచి దాన్ని శివలింగం చేసిపారేశారు. మన త్రిలింగంలోని ద్రాక్షారా న్ని దాక్షారంగా మిగిల్చిపారేశారు. Systematic conspiracy. దళితజాతులు, పేదలు, శ్రమజీవులు వాళ్ళకు సంబంధించినటువంటి సమాజపరమైనటువంటి క్రింద తరగతులవాళ్ళు, ఉత్పత్తి చేశేటివాళ్ళు పర్యాటక జీవితంవల్ల అంగళ్ళవల్ల వాళ్ళకు ఉండేటువంటి చింతనాధారం వుంది.

ఇక్కడొక విషయం. పీడనకు గురిఅయ్యేవాళ్ళు,దోపిడికి గురయ్యేవాళ్ళు వాళ్ళలో మార్పుకు సంబంధించిన ఉత్కంఠ వుండొచ్చు. కాని వాళ్ళు బలంగా శక్తిగా పుంజుకోనంతకాలం, పైవర్గాలయొక్క ప్రభావం వారిమీద వుండే తీరుతుంది. అందువల్ల పోరాడేవాడు తనలో తాను పోరాడుతోనే, చుట్టూవుండే సమాజంతో పోరాడాలి. ఆ విషయంలో వేమన తనలో తాను పోరాడాడుగాని, చుట్టూవుండే సమాజంతో ఎంతగా పోరాడాలో అంతగా పోరాడలేదు. ఎంత స్పష్టంగా పోరాడాలో అంత స్పష్టంగా పోరాడలేదు.

దానధర్మాలగురించి బాగా వ్యాప్తిప్రచారం చేసినటువంటి వేమన ఆ దానం దొరకనటువంటి దుఃఖితులు, దీనులు దారి దోపిడీలు చేస్తే అభ్యంతరం (objection) అన్నాడు. ఇది మనం సహించరాని విషయం. This can not be tolerated. దారి దోపిడీలు చేయడమనేది వారికుండేటువంటి నైసర్గికహక్కు. చట్టం ఒప్పుకోకపోవచ్చు. లేనివాళ్ళను వేమన యీసడించాడుకూడా. ఇది వేమన ఔదార్యానికి మంచిదికాదు. వేమనయొక్కవ్యక్తిత్వానికి మంచిదికాదు. ఏవ్యక్తిత్వాన్నయితే చూడాలనుకొంటున్నామో ఆ వ్యక్తిత్వానికి మంచిదికాదు. Basical గా వేమన వ్యక్తి ఆస్తిలో మార్పును కోరలేదు. ఉన్నవాడు ఉంచుకోండి. బిర్లాగారూ ప్రతిఏటా అభివృద్ధి చేసుకొంటున్న కోట్లాది ధనంలో అప్పుడప్పుడు మీరు హైద్రాబాదులో బిర్లా మందిరాలు కట్టించండి. కావలిస్తే కలకత్తాలో పారిశ్రామిక వాడలు మూయించండి.

కాబట్టి యీ దృక్పథానికి దగ్గరగా కనపడేవాటి ఛాయలు - ఎందుకీమాటలంటున్నానంటే - ప్రభుత్వంకూడా వేమనను Nationalise చేయడానికి సిద్ధపడుతుంది. స్వయానా చెన్నారెడ్డిగారే దాన్నొక పాతాళ విగ్రహంగా తయారుచేయడానికి సిద్ధపడ్డాడు.

వేమనను మనం Basic గా యోగిగా గుర్తించుదామా ? కవిగా గుర్తించుదామా? కవిలో చిత్తశుద్ధివుంది. కవిలో ప్రజలను చేరాలని తపనవుంది. యోగిలో

Mysticism వుంది. Not Acceptable. we will reject it. అంగీకారం కాదు. మనం దాన్ని తిరస్కరిద్దాం. యోగి చేరిన దశతో మనకు అభిప్రాయ భేదంవుంది. కవిగా అతను ఆరంభదశకు స్వాగతం. దానిలో Honesty (నిజాయితీ) వుంది. కాబట్టి ఈనాడు ఉండేటటువంటి దశలో విశ్వవిద్యాలయాలు మనకు తెచ్చినటు వంటి మరొక చెరుపు ఏమిటీఅంటే - - ఈ పరిశోధన అనేటువంటి అంశాన్ని ఏవిధంగా చేశారంటే, మొత్తంలోంచి వేరుచేసి, Isolated Factగా ప్రజలముందుంచా లనేవాదాన్ని తీసుకువచ్చారు. They don't value the things from their entirety. మొత్తంలో ఒక భాగంగా చూడరు. మావో thought ఏదోవుంటే మావో యొక్క బుద్ధివిశేషంగా చెప్తారుగాని చైనాయొక్క గతితార్కిక వికాసంగా, పోరాటం వికాసంగాచెప్పరు. శ్రీకాకుళంగిరిజనోద్యమంమీద ఢిల్లీలోనో మిగతా యూనివర్శిటీల్లోనో గానీండి, ఏదో వెంపటాపుసత్యంయొక్క అద్భుతంగా చెప్తారుగాని గిరిజనోద్యమ వికాసంగా చెప్పరు. - - - - విశ్వవిద్యాలయాల యీ దృక్పధానికి ఆద్యుడుగా కన్పించేటువంటి మెకాలే వగైరాలనలా వుంచినా ..... ముఖ్యంగా బ్రౌను మనల్ని దారితప్పించాడు. ఏ విధంగా అంటే ఈ Socio-economic development (సాంఘిక - ఆర్థిక అభివృద్ధి) ముఖ్యంగా వేమన కాలంలో - 16, 17 శతాబ్దికాలంలో ఆనాటి మతసంఘటనలుకాదు; అవి అసలు జరగటానికి కావలసినటువంటి ఆర్థికమైన పునాదులు ఏమిటి? రాజకీయమైన కారణాలేమిటి? ఈ విషయాన్ని వివేచించడంలో తను చెయ్యాలిసినంత ప్రయత్నం బ్రౌను చెయ్యలేదు. అతని డ్యూటీ అది కాదని మీరనవచ్చు. వేమన పద్యాలు సేకరించడంకూడా అతని (బ్రౌను) డ్యూటీ కాదు. కాబట్టి వలసాధిపత్యానికి ఏ మేరకు ఏది అవసరమో బ్రౌను ఆపనిని ఆమేరకు చేయించుకు వెళ్ళాడు. ఆవరసలో వున్నటువంటి కట్టమంచిరామలింగారెడ్డి ఆయన కొలువును పూరించాడు. పసిడిగలవాని బానిసకొడుకులో లాగా పనిచేశాడు. చాలా Damaging అనుకోవచ్చు. చదివితే మీకే కనిపిస్తుంది. మార్క్స్ ఒకసారి హెచ్చరించాడు. Intelligentia of the world - if they are not concious, they are the statesmen of the rich అన్నాడు. తమకు తాము మేధావులనుకొనేవాళ్ళు హృదయంలో చైతన్యవంతులు కాకపోతే వారు సంపన్నవర్గాల బానిసలుగా పని చేస్తారు - గుమాస్తాలుగా పనిచేస్తారు.

వేమన పునర్మూల్యానికి సిద్ధపడుతున్నాం. ఎవరినైనాసరే బేరీజు వేసేటప్పుడు సాంఘిక, ఆర్థిక, రాజకీయాల వృద్ధిక్రమంలో చూడాలి. మన ఇష్టానిష్టాలక్రమంలో గాదు. ఇటువంటిది మార్క్సిజం కాబట్టి నాకు ఆ చట్రంలోకి రావడానికి ఇష్టం లేదే అంటే యిష్టం లేకపోయినా ఆ చట్రాన్ని కాదనటానికి మీకు హక్కు లేదు. ఎందు

కంటే Socio - economic development ఏదైతే వుందో అది Reality-Fact. దాన్ని చూచి కళ్లుమూసుకుంటానంటే మీ చిత్తశుద్ధిని శంకించాల్సివస్తుంది. కాబట్టి యీ సోషియో ఎకనమిక్ అభివృద్ధి ఏదైతేవుందో దానిక్రమంలో అంతర్నిహితంగా కని పించే వర్గపోరాటంలో నుంచి చూడాలి. ఆ విధంగా చూచినట్లయితే వేమనను సరిగ్గా విలువకట్టడంలో కృత కృత్యులం కాగలం. వేమనకు సరిగా విలువ కట్టినట్టయితే ఒకమేరకు Reject (తిరస్కారింపు) చేస్తాం – ఒకమేరకు Accept (అంగీకారం) చేస్తాం. ప్రశ్నసుర్తులు పెట్టినకవిగా అతని అభిప్రాయాల్ని యింకా ప్రజలముందుకు తీసుకువెళ్ళాల్సివుంది. రాజకీయలక్ష్యాలతో ప్రజాపోరాట దిశలో ప్రజలకు చెప్తూన్నప్పుడు ఎన్నోవిషయాలు చెప్తాం. రేపు అంజయ్యగారుకూడా చెప్తారు. 20 పాయింట్ల ప్రోగ్రాం క్రింద వేమన పెట్టివద్దన్నాడయ్యా అని బోర్డు కట్టిస్తాడు పంచాయితీ ఆఫీసులో – దొంగలు ఊళ్ళుపంచేసుకొంటున్నారు – అక్కడ కట్టేస్తాడు – వేమన సూక్తులు.

అజాతశత్రువు ఎవడైతే వుంటాడో వాడే భారతీయ చరిత్రలో చాలా ప్రమాద కారి. అందరికీ రిఫరెన్సుకు పనికివచ్చే వాని విషయంలో జాగ్రత్తగా అంచనాలు కట్టాలి. అటు బిర్లా Quoteచేస్తే, ఇటు మనం కోట్ చేస్తే, ఇక మనం మిగలం. బిర్లాకు ప్రయోజనం ఉంటుంది. ఈ దృష్ట్యా నేను కొంచెం పరుషంగా ఉద్రేకంగా మాట్లాడినా, ఎవరుపండించిన పంటల్ని మనం భోజనం చేస్తున్నామో, ఎవరు కట్టిన భవనంలో ఈ సమావేశం జరుపుకొంటున్నామో, ఎవరు తయారుచేసిన మైకుముందు మాట్లాడు తున్నామో.... వారికి అన్యాయం చేస్తాము.

## ప్రశ్నలు – సమాధానాలు

ఆరుద్ర . వేమన అరాజకవాది, సరే సృజనాత్మక అరాజకవాది అన్నారు. దానికి నాకు సమాధానమున్నది. నేను చదవబోయే వ్యాసంలో సమాధానముంటుంది – వినండి (ఈ సమాధానాన్ని వేమన వికాసకేంద్రం వారు ప్రచురించబోయే పుస్త కంలో చూడండి – సం॥) కాని వస్తూత్పత్తి సంబంధాలను గూర్చి వేమన లోతుగా వెళ్ళలేదన్నారు. మనమే వెళ్ళలేదేమో! ఆయన లోతుగానే వెళ్ళారు. అదీ నా వ్యాసంలో చెప్పాను. నా ప్రసంగం వేమన – అవైదికదర్శనాలు. అవైదిక దర్శనాల్లో ఆర్థిక కోణంవుంది. అక్కడవినండి. మార్క్సిజానికి ప్రధానమయింది శ్రామిక పక్షపాతం గదా ! ఆ శ్రామిక పక్షపాతం వేమ నకు చాలావుంది. ఈ పద్యాల కేమంటారు :

ఒకలకొరకు భూమినొరసెకువారును, అవనిపతికి పత్త్యైలెనవారు, పాలవంటివారు పన్నుబెట్టెడువారు, వాకెరుగని కాపువారు వేము ! ! శ్రమము లోన బుట్టు సర్వంబు తానౌను - - - వీనికేంచెబుతారు ?

జ్వాలాముఖి : వస్తూత్పత్తి సంబంధాన్ని గూర్చి బ్రౌన్ని పేర్కొన్నాను మొదట. బ్రౌను వేమనమీదవేసిన అంచనా ఏదైతేవుందో, అది వుత్పత్తి సంబంధాల దృష్ట్యా, Socio-economic Development క్రమంలో వేసిందికాదు. వేమననొక సంఘటనగా, ఒక అద్భుతంగా తీసుకొని ఒక సంస్కరణగా తీసుకొని సమాజం ముందుకుతెచ్చాడు. అది Incomplete అది వలస వాదుల ప్రయోజనంకోసం వచ్చింది. ఆ వరవడిలోనే ఫ్యూడల్ భావాలు గలిగి నటువంటి రాళ్ళపల్లి వగైరా వగైరా - కట్టమంచిదాకా, విశ్వవిద్యాలయాల వాళ్ళందరూ కూడా కొనసాగించారు.

ఇక పన్నుపెట్టడమనే భూమిసమస్య అంటారా అది ఉత్పత్తి సంబంధం కాదు. అతనే అన్నాడు పన్నుగట్టనటువంటి వాళ్ళను దూషించడం జరిగింది. దొంగతనాలను గురించి. అయితే దొంగతనాలు చేసేవాణ్ణి సమర్థిస్తారా అంటే దానంచేసేవాణ్ణి సమర్థిద్దామా? ఆస్తులు కూడగట్టుకొనేవాణ్ణి సమర్థిద్దామా? ఇవన్నీ లోతుగావెళ్ళాల్సిన అంశాలు. నాదగ్గర రాసినటువంటి ఇరవైపేజీల నోట్సులో, ముఖ్యంగా శ్రమనుండి బుట్టు సర్వంబు అనేదగ్గర మనకు అభిప్రాయ భేదం లేదు. కాని దాన్ని ఆనాడు ఏ context లో వాడాడు అనేదాన్ని మరిచిపోరాదు.

శ్రామికుల గూర్చి చెప్పడంవేరు. శ్రామికవర్గంయొక్క అంతిమ విజయం కోసం వాదించడం వేరు. ఈనాడు ఇందిరాగాంధీకూడా గరీబీ హటావో అని చెప్తూవున్నది. కార్మికవాడలు, హరిజనులకు గుడిసెలు కట్టించ డానికి ప్రయత్నం చేస్తున్నది. అదే శ్రామికులపక్షాన నిలవడంకాదు. Basicగా నేనన్నాను ఏమిటంటే, సంస్కరణవాది వేమన అని. విప్లవాన్ని, సమూల మైన మార్పున్ని కోరలేదు అని.

వ్యక్తిగత జీవితంలో - వేమనకు తను చూచినటువంటి సంఘటనల్లో కొన్ని చేదు నిజాలు ఎదురయ్యాయి. జీవితాన్ని అనుభవించటం అనేదానిలో చాలా చొచ్చు కొని పోయాడు. చేదు నిజాలు ఎదురయ్యాయి. వ్యక్తిగతంగానే రియాక్టయ్యాడు- వ్యాఖ్యానించాడు. సమాజపరంగా వ్యాఖ్యానించివుంటే ఇంకా మంచి ప్రయోజ

నాలు కలిగేవి. ఆది భౌతికకవి అయ్యేవాడు. అందువల్ల హేతువాదకవి కంప్లీట్ భౌతికవాదకవి కాడు. కాలేడు. నా అభిప్రాయన్ని మార్చుకోవలసిన అంశం ఏమీలేదని భావిస్తున్నాను.

శ్రీ పరకాల పట్టాభిగారు :

మార్క్స్ చెప్పినట్టు చెప్పాడా లేదా అని చూడడం న్యాయమైనదా ? మార్క్సిజానికి అనుగుణమైనదా ? లేక ఆయన నివసించినకాలంలో, ఆనాటి సామాజిక పరిస్థితులమీద ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాల అభివృద్ధికర స్వభావాన్ని రెలిటీవ్‌గా చూడటం మార్క్సిజమా ? ( 10వ పేజీ 4వ పేరా దృష్ట్యా ఈప్రశ్న)

జ్వాలాముఖి :

ఆ - - 17 వ శతాబ్దంలోని పరిస్థితులను ఆధారంగా తీసుకొని చూడటం సరైనదా, ఏపిటీ యని అడుగుతున్నారు. మార్క్సిజం ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి క్రమాన్నిబట్టి చెప్పమంటుంది. అలా చెప్పడం ఇటీవల స్థిరపడినా, మనం గత చరిత్ర మొత్తాన్ని ఏబేసిస్ మీద పరిశీలిస్తున్నాం - చారిత్రక భౌతిక వాదం బేసిస్ మీద పరిశీలిస్తున్నాము. ఆనాటి మార్క్సియ సూత్రాలు లేకపోవచ్చునుగాని వానికి దగ్గరగా స్థిరపడినటువంటి దార్శనికమైన చార్వాకాభిప్రాయాలున్నాయి. బౌద్ధజైనాలు ఉన్నాయి. అతడు వానికి దగ్గరగా వెళ్ళాడా, దూరంగా వెళ్ళాడా అని చూస్తాం. దానికి దగ్గరగా వెళ్ళినట్టయితే - అద్వైతం, అచలము, రాజయోగం దగ్గరకు వెళ్ళాల్సివుండేదికాదు. అతనిలో ప్రారంభమైన భౌతికవాద ఉత్కంఠ ఏదైతే వుందో, అది కేవలం బాహ్యాచారాల్ని ఖండించటంమట్టుకే సీమితమైపోయివుంది. బాహ్యాచారాలకు కారణభుతమైన మతంయొక్క స్వభావం, దానికుండే సామాజికస్థితి - ఆ విషయాల్లో అతనింకా లోతుకు వెళ్ళలేదు. అనే విషయం చెప్పడానికే ఉత్పత్తి సంబంధాలను పేర్కొన్నాను. అది మార్క్సేతరమయిందికాదు.

* — *

# విశ్వదాభిరామ వినురవేమ

# పుస్తకావిష్కరణ సభలో జ్వాలాముఖి

8_30 P. M. 31-5-1981 ప్రసంగపాఠం టేపు ఆధారంగా

---

నన్ను త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు క్షమించాలి. నేవచ్చే నిర్ణయాల్లో నా అంచనాల్లో తప్పులుండవచ్చు. (వారి పుస్తకంమీద) నాకు కొన్ని అభ్యంతరాలున్నాయి. మొదట ఈ పుస్తకం అట్టమీదవున్న బొమ్మ – నాగార్జునుడి చేతిలోవున్న ఆ కలశం, ఆ రసవాదంయొక్క గుర్తు. అది వుంటే – వేమనను మళ్ళీ మనం రసవాదంపైపు తీసుకుపెళ్దామా ? వేమన రసవాదిగానే లోకానికి పరిచితుడా ? స్వర్ణకార విద్యతోనే పరిచితుడా? ఇది నాలాంటివారికి కొంచెం సందేహంగానూ, బాధగానూ ఉంది. అర్థం చేసుకోవటంలో నా పొరపాటేమో చెప్పలేను. "వేమన అంతరాంతరాల్లోకి" అన్న ఉపశీర్షిక పెట్టారు. అంతరాంతరాల్లోకి చేరితే అంటే, ఆయన గమ్యమేమిటి ? బంగారం చేయడమా ? దిగంబరం కావడమా ?

వేమన ప్రధానంగా ఆనాడు యుగసంధిలో యుగవాణిగా ప్రజలముందుకు తెచ్చిన విషయమేమంటే, ఆచారాలముందు, విలువలముందు తిరుగులేని ప్రశ్నగుర్తులు పెట్టటం. ఆ ప్రశ్నగుర్తులు కొడవళ్లుగా మన మనస్సుల్లో నిల్చిపోయిన శాశ్వతమైన ముద్ర శిష్టులకు అంగీకారం కాకపోయినందువల్ల వేమనను యోగిచెయ్యడానికి ప్రయత్నం జరిగింది. భౌతిక వాదాన్ని ముందుకుతెచ్చిన ఆ బుద్ధుణ్నే దశావతారాల్లో చేర్చినటువంటి ఘనాఘనసుందరులు మన తాత్త్వికలోకంలో వున్నారు. కాబట్టి వేమనను యోగిని చెయ్యగలరనే విషయం చాలా మామూలు విషయం. ఈనాడు వేమనను

ప్రజలముందుకు తెస్తున్నప్పుడు, అతన్ని భౌతికవాదిగా తేవాలా? కర్మయోగిగా తేవాలా? మార్మికవాదిగా తేవాలా ? అనే అంశం ప్రధానంగా ఆలోచించాల్సిన అంశం.

ఇక రెండవది : ఈ గ్రంథరచయిత తనకు పూర్వమున్నటువంటి పరిచయం వలన, పూర్వముండేటి తపనవల్ల, పూర్వసహజాతంవల్ల, వారు తమ పాతమిత్రు లందరికీకూడా యీ పుస్తకాన్ని అంకితం చేశారు. వారి చిత్తశుద్ధిని నేను శంకించడం లేదు. దీనికి స్వాగతం చెప్తున్నాను. సలాములుకూడా పెడుతున్నాను.

కాని పరిధిలో లేని అంశాలలోకి వెళ్ళి, దానిమీద స్థాలీపులాక న్యాయంగా ఒక విమర్శ వేసేవరకు వెళ్ళడం కొంచెం రాజకీయాలవేపు మొగ్గు గల్గిన మాకు, కొంచెం బాధాకరంగా వుంటుంది. వారు అంకితపద్యంలో ఏమన్నారంటే

తూర్పుతొవరు తిరగకముందే
తొందరపడి త్రోవతప్ప శ్రీకాకుళం కొండల్లో
కూలిపోయిన తమ్ములు తామై
ఒలికి ఒలికించిన నెత్తురులమ నేపథ్యమైన
మంగళకర మానవతాస్పందనకు.........

తొందరపడి త్రోవతప్ప అన్నమాటలు కొంచెం రాజకీయంగా అతివ్యాప్తి కలిగిన మాటలు. అనగా, అసలానికి ఇందులో ఆస్కారం లేనటువంటి మాటలు. ఇవి హేతువాద పరిధిని దాటినటువంటిమాటలు. ఎవరిదగ్గరికి పోయినా, హేతువాదం ఒకానొక ఉద్యమానికి భిన్నంగా, వ్యతిరేకంగా వుంటుందా అనే అనుమానం కలగటానికి ఆస్కారం వుంటుంది.

(3) ఆధునికంగా అన్వయించబోయి సెక్యులరిజం విషయంలో over-stress చేశారు. వేమనలో సర్వమత సమ్మానం వుంది. అన్ని మతాలను సమానంగా చూసే గుణం వుంది. ఇది ఎంత గొప్ప సెక్యులరిజం అయినా ఎవరూ గుర్తించడం లేదు- అనేటట్లు ప్రస్తావనకు దెచ్చారు.

అసలు రాజ్యానికి కావాల్సింది అన్ని మతాలను సమానంగా చూడడమా ? అలా చూడడమే సెక్యులరిజమా ? లేక, రాజ్యవ్యవహారాలలో మత ప్రసక్తి లేకుండా చెయ్యటమే సెక్యులరిజమా ?

ఇది చాలా ప్రధానమైనటువంటి అంశం. తత్వాన్వేషకులుగా వున్నటువంటి వెంకటేశ్వరరావుగారు ముఖ్యంగా నేటి అవసరాలను దృష్టిలోపెట్టుకొని, దాన్ని (గ్రంథకర్త) వివరించివుంటే బాగుండేది.

(1) ఇప్పటివరకు వేమనమీద వెలువడిన గ్రంథాలలో జైన చార్వాకాల ప్రస్తావనలేదు. కాని ఈ గ్రంథంలో దిసమొల జైనం, చార్వాకాలయొక్క ప్రస్తావన బాగా తీసుకురావడం జరిగింది.

ఇక వేమన జీవితాంశాల విషయంవున్నది. వేమనమీద కథలున్నై. గోపీవ్రాసిన వేమన పుస్తకంలో ఆ కథలన్నీ గాథలన్నీ యిచ్చాడు. శ్రీనాధుడిమీద, తెనాలిరామ లింగడిమీద వేమనమీద అలాంటి గాధలల్లుకొని వున్నాయి. ఆ కథలెందుకు పుట్టు తాయో చర్చించాలి. చర్చచేస్తూ చేస్తూ ఈ గ్రంథకర్త వదిలేశారు.

అచలంవైపు మొగ్గుచూపడానికి ప్రయత్నం చేసినటువంటి అంశాలిందులో వున్నాయి. శాస్త్రం ఏమిచెప్తుంది అంటే సమస్తమైనది చలనంలో వున్నది. ఏదీ అచ లంగా వుండటానికి వీల్లేదు. కాని దానివేపు మొగ్గటం యింకా ఎవరికైనా మంచిదేమో గాని త్రిపురనేని వెంకటేశ్వరరావుగారికి, వేమన వికాసకేంద్రానికి మాత్రం ఆరోగ్య ప్రదం మాత్రం కాదని మనవిచేస్తున్నాను.

రాళ్ళపల్లిని, తదితర వేమన పరిశోధక పండితుల్ని చాలా బలంగా శక్తి వంతంగా కాదన్నారు వెంకటేశ్వరరావుగారు. తమ వాదాన్ని కూడా శక్తివంతంగా చెప్పారు. కాని, వ్యాపారస్తులకవి వేమన అన్నందుకు అంతవిరుచుకుపడవలసిందికాదు.

ఆయన భౌతికవాదిగా మొదలై, అచలవాదిగా ముగుస్తున్నాడా ? ఆరుద్రగారు ఇది అంగీకరిస్తారో లేదో ? లేక - ఆయన రకరకాలైన మిస్టిసిజానికి లోనై చివరకు భౌతికవాదిగా ముగుస్తున్నాడు అనే అంశాన్ని కచ్చితంగా ప్రతిపాదించారు ఆరుద్ర - స్వాగతమే. అదే చివరి నిర్ణయంగా వచ్చినట్లయితే చాలామంచిది. ఏదోవిషయాన్ని ప్రజలముందు సాధికారంగా సోపపత్తికంగా పెట్టాల్సిమాత్రం వుంది. స్వర్ణకార విద్యను గూర్చి అభిప్రాయం స్పష్టంగా ప్రకటించాల్సివుంది.

—o0o—

# ఏనుగూ, ఏడుగురు గుడ్డివాళ్ళకథ కాకూడదని......

—త్రిపురనేని వెంకటేశ్వరరావు
(విజయవాడ)

[నా "విశ్వదాభిరామ వినురవేమ" పుస్తకావిష్కరణ సందర్భంలో జ్వాలాముఖి అన్యాయమైన ప్రసంగం చెయ్యగా, వెంటనే ముగ్గురు యువకులు లేచి శ్రీకాకుళం గిరిజనపోరాటం వర్ధిల్లాలని రెండునినాదాలుచేసి, అంకితంలో "తొందరపడిత్రోవతప్పి" అన్నమాటలు తీసివేయాలని చీటీఒకటి నాకుపంపించారు. విరసం కార్యవర్గం తమ సభ్యులను యీ సభల్లో పాల్గొనవద్దని నిషేధించింది. నాఉపసంహారోపన్యాసంలో యీ విషయాలన్నిటినీ ప్రస్తావించి కొంతవరకు అతిధ్యరీత్యా కొన్ని పరిమితులు విధించుకొని వెంటనే సమాధానించినందున మిత్రులు నాఉపన్యాసాన్ని ముద్రించమని సూచించారు. టేపు ఆధారంగా కూర్చిన అలనాటి ఉపన్యాసపాఠం ఇది ]

నాకిక్కడ వివిధపాత్రలు. "ఈ సంస్థను–అనగా, వేమన వికాసకేంద్రాన్ని ప్రకటించి, దీని తరపున రసయోగంనుంచి, అంటే బంగారంచేసే విద్యనుంచి–యోగం నుంచి, అచలంనుంచి, మార్క్సిజంవరకు, ఆపైన మానవతావాదంవరకూవున్న అన్ని కోణాలను ఒక్కచోట మోహరింపజేసి ఒకరితోఒకరికి ఏనిరమైన ఏకీభావంలేకుండా పైగాఒకరినిగూర్చిఒకరికి అనుమానాలుండటంతో అనేకానేకవ్యక్తులకు ఉద్యమాలకు అవకాశంయిచ్చి, వేమన అనేవ్యక్తి, వేమన అనేసంస్థ, వేమనఅనేఒకఉద్యమం, ఒక చింతనగూర్చి ఇక్కడ సమావేశం జరిపి ఒక వేదికమీదకెక్కించి వారందరిద్వారా వేమనవిశ్వతోముఖమైన వ్యక్తిత్వాన్ని పూర్ణంగా ఆవిష్కరింపజేయాలని ఒకప్రయత్నం చేశాను.

ఈ ప్రయత్నంలో మీకు స్వాగతం చెప్పి మిమ్మల్ని మరియాదచేసి, మన్నన చేసి, మీరు యేవిమర్శ చేసినా యింకొకటి ఏదన్నప్పటికీ కూడా యీరోజున మాట్లాడటానికి వీలులేనటువంటి పాత్రను నేను తీసుకున్నాను. నాకున్న బాధ్యత నాకున్నది. ఈ పుస్తకం రచయితగానే కాకుండా ఈ సంస్థను నిర్వహణం చేసినప్పుడు వేమన దగ్గరకువచ్చి కలిసేటువంటి వేమన అనే మహాసముద్రంలో వచ్చిపడే వాహినులన్నిటినీ ఇమిడించుకోడానికి వేమనను మనకు కావలసినతీరులో మలచుకోవాలనే ప్రయత్నంగా కాకుండా ఇంతవైవిధ్యం ఇన్నిరంగులవర్ణపట్టకం(Spectrum) వున్నదే దీన్నంటినీ పరస్పరం అర్థంచేసుకోవలసిన అవసరం వున్నదనుకొంటున్నాను. ఆయనలోవున్న ఒక ఆర్థికకోణాన్ని, ఒకహేతువాదకోణాన్ని, కవిత్వకోణాన్ని, యోగాన్ని బంగారుయోగాన్ని అలా ఒక్కొక్క రొక్కొక్కదాన్ని పుచ్చుకొని ఎవరి దారిన వారు చెప్పుకొనిపోవడం కాకుండా ఆ అన్నింటికి ఒక సమన్వయం దొరకుతుందా ? ఇందులోవేమన-1981లోవున్నమనకు కావలసినట్టుగా అన్నివిషయాల్లోనూమనండిమాండు చేసినట్టుగా అన్నిటికీ Yes అనేస్థితిలో అతడున్నాడా, మరిఅతనిలో లోటుపాట్లు, మనం అంగీకరించలేనివేమైనా ఉన్నయ్యా? అని వివేకించడంకోసం, విచారణచెయ్యడంకోసం పులినీ మేకనీకూడా ఒకేరేవున త్రాగించేయత్నం ఇలాచేశాను. నాయీప్రయత్నాన్ని ఆంధ్ర జనులర్థంచేసుకోవాలని మనవిచేస్తున్నాను. ఇప్పటికే ఎవరెవరినో, రసయోగంవారిని అచలంవారినీ,etc తెచ్చినందుకు అపార్థంచేసుకొనేవారు చేసుకొని నేనేఅందులోకి వెళుతున్నానని మొగ్గుతున్నాననీ అన్నవారు అంటుండగా, నేననుకొంటున్నాను.... ఇందులో ఇంకా కొన్ని లోపాలు చేశానని - జంగాలనుండి ఒక్కరిని రావించలేకపోయానని, ఆయనలోగల వైద్యకోణాన్ని గూర్చి చెప్పేవారిలో ఒకరిని దొరికించుకోలేకపోయానని, తంత్రశాస్త్రంతో అతనికిగల సంబంధాన్ని చెప్పడానికొకర్ని పట్టుకోలేకపోయానని అనుకొంటున్నాను. వేమనయొక్క మొత్తం వ్యక్తిత్వాన్ని ఇక్కడ ఆవిష్కారం చెయ్యాలన్న ప్రయత్నం మాత్రం చేశాను. నా పుస్తకంలోకూడా అదే చేశాను. వేమన మీద చివరివాక్యం నేను చెప్పానని అనుకోవడంలేదు నేను స్పష్టంగా వ్రాశాను పీఠికలో, National Debate కోసం వ్రాస్తున్నానని 'ఒక కొత్త ప్రతిపాదనగా చర్చించండి' అని శీర్షికపెట్టి అదే చెప్పాను. (78వ పేజీలో)

నేను వ్రాస్తున్న సందర్భం : యునెస్కో ఒక ప్రణాళిక వేసుకుని పన్నెండు వందల పద్యాలను ఆయననుండి ఎన్నికచేసి, ఒక అమెరికన్ కవినీ, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో తత్వాచార్యుడైన ఒక తెలుగువారినీ కలిపి - ఇంగ్లీషు నుడికారం కొరకు అమెరికన్‌కవినీ, భావంకొరకు తెలుగువాణ్నీ జోడించి ప్రణాళిక చేసినప్పుడు మనదేశపు ఎల్లలు దాటకున్న వేమనను విశ్వవేదికమీద కూర్చుండనిచ్చే సమయంలో, ప్రపంచపు

పెద్దభాష లన్నిటిలోకీ అనువర్తనం కాబోయే సమయంలో యీ చర్చనారంభిస్తున్నాననే ఇందుస్ఫురణతో యీ పని తలపెట్టాను.

హిందీ భాషాపండితులైన తెలుగువారు ముగ్గురు ఈ సభల్లో పాల్గొన్నారు. ఒకరు దక్షిణ భారత హిందీ ప్రచారసభలో మంచిస్థానంలో వున్నారు మరొకరు ఆంధ్ర విశ్వవిద్యాలయ హిందీ విభాగంలో రీడరుగా వున్నారు. వీరికి విజ్ఞప్తి చెయ్యదగ్గ దొకటున్నది. ఇప్పటిదాకా కబీరును చాలాచాలా పెద్దవాణ్ణిగా చూశారు. రాయ్‌దాస్, లాల్‌దాస్, ధర్మదాస్ యింకా యింకా భక్తులు అనేకులు మార్మికవిప్లవం ( Mystic Revolution ) ఛాయావిప్లవం ( Mirror Revolution ) చేశారని ఆ ఛాయావిప్ల వాన్ని కీర్తించే స్థితిలో వద్దారు. అందులో కంచుకాగడావేసి వెదకినా ఆర్థికవిప్లవం అనే అంశం కనిపించదు. ఈ మహాభక్తులు యోగులు ఇంతెసరో అనే వీరిలో ఎవరిలోనూ లేని ఆర్థికకోణం వేమనలో వుంది; ఒక్క మన వేమనలోనే వుంది. అదికూడా, అట్టడుగున ఉన్నవారియందు ఇతడికి జాలి ఎక్కువ. కలిగినవాడు లేనివాడిపట్ల ఉదార బుద్ధితో భిక్షాపకీరుల పాత్రలో మెతుకువిదల్చమని చెప్పేపాటిదే కాకుండా- కలిమి లేముల మన్యఘర్షణ కులఘర్షణకన్న ప్రమాదకరమైనది, దాన్ని పరిహరించాలని పరిష్కరించాలని చెప్పినవాడు వేమన ఒక్కడే. సమాజంలో సంపద పునర్విభజన జరగాలన్నటువంటి అభిప్రాయం వేమనే చెప్పివున్నాడు. ఇది అఖిలభారతంలో కొన్ని వందలమంది సంత్‌లనీ సాధువులనీ, భక్తులనీ, దాసులనీ అనేక రూపాల్లో వచ్చిన భక్తివుద్యమాల్లో వున్నారు. వాళ్ళందరూకూడా దేవుని దృష్టిలో అంతా సమానులే అని, అందరుదేవునిబిడ్డలే అని చెప్పడంతో ఆగిపోతే, ఆవాక్యాల్ని దాటిపోయి, వేమనమాత్రం ఆర్థిక దృష్టి వహించి, ఆర్థికవర్గాలున్నవని, వర్గద్వేషం వున్నదని, పేదకూ పేదకూ మధ్య సౌభ్రాత్రం వున్నదనీ, ఇది దావానలం, సంఘాన్ని కాల్చుతుందని చెప్పి, చూపి అనేక ఆర్థిక సంస్కరణలు చెప్పాడని భారతదేశంలో పూర్వం యిదెవ్వరూ చెయ్య లేదని హిందీలో వేమనను గూర్చి చెప్పండి. ఆర్థిక పునర్వ్యవస్థీకరణ భావము వున్న దనే వేమనను నేను చేపట్టాను. అందుకే వేమనను గూర్చి వ్రాయవలసివచ్చింది నాకు. ఆ ప్రయత్నంకూడా అర్థంగాకపోతే, నేను వారికి చెప్పగలిగిందీ, చెయ్యగలిగిందీ ఏమీ లేదు. ఇది భారతదేశంలో ఏ ఒక్కరివద్దరా లేదని చెప్పేసి, వేమన ఒక్కడి వద్దనే దొరికే సరుకని పుస్తకంలో నిరూపించాను. ఆర్థిక వ్యత్యాసాలను గురించే వేమనలోని అసలు తపన అని, అదే అతని జీవితంలోని వివిధ పరిణామదశలకు, ఆ దశలన్నింటికి కీలకము, మూలకారణమని అనుకోకపోయినట్లయితే- కేవలం అతనిలో వున్న పెద్దవిషయం నాగార్జునులు చెప్పిన శూన్యవాదం, స్వభావశూన్యతా వాదం- అంతవరకే అయితేమట్టుకు- ఆ Intellectual gymnasium లో రెండు

ఫీట్సు చేసేసి చిన్న వ్యాసాలు రెండు వ్రాసి ముగించేసేవుండేవాణ్ని. ఇంత పెద్దపుస్తకం వ్రాసేవాణ్ని కాను. వేమన వికాస కేంద్రం అనే ఈసంస్థను నేను పెట్టివుండేవాణ్నిగాను.

వేమన ఒక విశిష్టమైన ఆర్థిక వ్యవస్థాద్రష్ట అనే అంశాన్నే దట్టించి మీ గుండెలకంటా ఎక్కించడానికే నా ప్రయత్నమంతా. ఏ ప్రవక్తకన్నా, ఏ భక్తిమార్గ స్థుడికన్నా కూడా వేమన విశిష్టంగా, పోలికలేని విధంగా యీ విషయంలోనే అధికుడు. కబీరులో అసలులేకపోయి మన వేమనలోవున్న విశిష్టతే ఇది. తత్వంలో కబీరుకన్నా మన వేమన్న అధికుడనడమేకాదు- అది నిజానికి నిజంకూడా— అసలు వేమనలో గొప్ప ఆర్థిక విచారంకలదు. భారతదేశంలో వేమనను మించిన తత్వవిచారకుడు, ఆర్థిక విచారకుడు, సాంఘిక విచారకుడు, నీతివిచారకుడు లేడు అంటున్నాను. కనక, ఆంధ్ర దేశంలో కబీరువంటి వేమన్న ఒకడున్నాడని చెప్పడంకాదు— ఆంధ్రకే కబీరువేమన్న- ఆంధ్రాకబీరు వేమన్న అని ఇకముందు అనకండి. దాన్ని తిరగేసి-చెప్పండి, హిందీకే వేమన – కబీరు అని చెప్పటం ఆరంభించాలని కోరుతున్నాను. అలా చెప్పడమే నిజం, న్యాయం, వాస్తవం. తెలుగువారైన హిందీ పండితులమీద యీ మహత్తర మైన కర్తవ్యం ఉందని మనవి చేస్తున్నాను.

ఇప్పటికికూడా సంయమనంతోనే మాట్లాడుతున్నాను. మెలగుతున్నాను. తత్వం గహనమయింది. నా కిప్పుడు యాభై ఏళ్లు. యాభై ఒక్కటికూడాను. పాతికేళ్ళముందు, నాకు పాతికేళ్లు నిండకముందు, భారతతత్వశాస్త్రపరిశీలన అనే గ్రంథాన్ని వ్రాశాను. అప్పుడు నేను కమ్యూనిస్టు పార్టీలో – శ్రీకాకుళం జిల్లా కార్య దర్శిని. ఆ పుస్తకం వ్రాసినందుకు అప్పుడూ పార్టీలో యుద్ధమే అయింది. విశాలాంధ్ర పత్రికలో నా పుస్తకంమీద పేజీన్నరపొడవు దాటినడిచింది సమీక్షపేర. పార్టీలో చదువుకొన్నవారు, ఆలోచనాపరులు అలజడిపడ్డారు. అంతలో కె. సి. వరదాచారిగారు హిందూ పత్రికలో ఆ నామార్క్సిస్టు విచారరీతికి ఒక కితాబ్ యివ్వడం జరిగింది. పార్టీలో ఒక కమిషన్ వెలసింది, వెంకటేశ్వరరావుకు అన్యాయం జరిగిందేమో విచారించ డానికి. అన్యాయం జరిగిందని తీర్పు యిచ్చింది ఆ కమీషన్. అది పాతకథ.

దాన్ని ఆరోజున ఎలాగయితే అర్థం చేసుకోలేకపోయారో దీన్నీ యివాళ అర్థం చేసుకోలేక తప్పుదారిలో చర్చకు తీస్తున్నారు. తత్వం జోలికి వెళ్ళే మిత్రులకు తత్వార్థం బహుగహనమని మళ్ళీ ఒకసారి చెప్పదలచాను. అప్పట్లో – – 1956 – ఆ పుస్తకం వ్రాసి, ఇంతకాలం తర్వాత యిప్పుడీ పుస్తకం వ్రాశాను. అప్పటి పుస్తకం నన్నుబాగా popularise చేసింది. పునర్ముద్రించమంటూంటారు చాలమంది. కాని మళ్ళీ ముద్రించలేదు. ఆ పుస్తకాన్ని రష్యన్ భాషలోకి తర్జుమాచేసుకోడానికి నిర్ణయమయింది. ఆదిలక్ష్మిఅనే ఆమెకు అసైన్‌మెంటు యిచ్చారట. ఆమె ఆకస్మికంగా

రష్యాలో చనిపోయింది. ఆమె మరణంతో దాన్ని అనువదించే దక్షతలేక అది అలాగే మిగిలిపోయింది. మాస్కో విమానాశ్రయంలో లైబ్రరీ తెనుగు విభాగంలో ఆ పుస్తకాన్ని తీసి చూపిస్తారు, చెప్తారు అని నా మిత్రులు అక్కడికి వెళ్ళొచ్చినవాళ్ళు చెప్పారు. కోలాచల సీతారామయ్యగారు (సోవియట్ రష్యాలో స్థిరపడి, అక్కడే చనిపోయారు – ఉయ్యూరు గ్రామంలో జన్మించినవారు – ఇంజనీరు) ఉప్పల లక్ష్మణరావుగారు (బరంపురంలో వున్నారు) ఆదిలక్ష్మిమాట చెప్పారు. ఆపుస్తకం ఆరోజున ఎలా అపార్థానికి గురయిందో, తర్వాత ఆ అపార్థానికి వారు ఎలా చింతించవలసి వచ్చిందో ఇవాళా అదే కథ అవృత్తమవుతోందనుకొంటున్నాను. ఆ పుస్తకంమీద యీ పుస్తకం అభివృద్ధి అనుకొంటున్నాను. (ఇప్పుడు) అపార్థంచేసి ఏదో చెయ్యబోయిన వారిమీద నాకు కోపంలేదు. నా దగ్గరున్నటువంటి శక్తి ఏమంటే మీరు రమ్మన్నచోటికి రాగలశక్తి– విషయాన్ని విషయంగా అర్థం చేసుకోడానికి యత్నించమంటాను.

శూన్యవాదమన్నపేరు వల్ల నాగార్జునుణ్ణి అపార్థంచేసుకొన్నారు చరిత్రలో. ఇప్పటికా అపార్థం తెగలేదు. స్వభావశూన్యతావాదం అది. స్వభావము అంటే వస్తువులందు, ఈ జగత్తునందున్న అన్నిటియందు ఆరని మారని సారమేదో ఉన్నదనుకోవటం తప్పు అని పోరి పోరి చెప్పినట్టిదా శూన్యవాదం. ఆ దురదృష్టమేమిటోగాని స్వభావశూన్యత అనే దానిలో స్వభావం అన్నమాట బ్రాకెట్టులోబడి, ఆ బ్రాకెట్ కాస్తా సున్నాగాచేరిపోయి, నిజంగా శూన్యం అయిపోయింది – సున్నా అయిపోయింది. (నిహిల్ అయిపోయింది. నిహిలిజంగా ఇంగ్లీషులో అన్నవారున్నారు.) అందులో కొందరు శూన్యశబ్దం శునః అంటే కుక్క – దానినుండివచ్చిందని కూడా తంటాలు పడి చెప్పి, అసలు శూన్యతా సిద్ధాంతంలోని భావాన్ని చెప్పబోయారు. కుక్కయొక్క నైజం నిలకడలేకపోవడం – అలాగే సర్వమూ నిల్కడలేనిది, గతిలో వుండేది, చలనాత్మకమైనట్టిది, అచలంకానిది, ఆత్మను వివేచించినా, ఆకాశాన్ని వివేచించినా అంతే అని నిరూపిస్తూ, 27 అధ్యాయాలు పెట్టి మాధ్యమిక కారికలు వ్రాస్తే, దాన్ని తెరవకుండా, తెరచిచూడకుండా, చూచినా అర్థం చేసుకోకుండా శంకరాదులు తుప్పతెప్పలుగా విమర్శకురిపించారు. ఇప్పటికీ అదే – సున్నా అనే అపార్థాన్నే నాకూ అంటగట్టుతున్నారు.

అట్టమీదనున్న బొమ్మను చూచి – నాగార్జునుడిదిగాగమనించి- అతని చేతిలో వున్న పేటికలాంటిదాన్ని రసయోగిచేతిలోని బంగారు బరిణగా భావించి, రసయోగిగా వేమనను వెంకటేశ్వరరావు చూపుతున్నాడని, నిన్న రసయోగంమీద ఉపన్యాసం ఏర్పాటుచేశాడుగదా వేమన చేరుకొన్నది స్వర్ణకార విద్యాలోనికని నిర్ణయించాడని చెప్తే నేనే మనేట్టు?

ఆ బొమ్మ రసవాది అయిన సిద్ధ నాగార్జునుడిదికాదు. శూన్యవాద కర్తఅయిన ఆర్యనాగార్జునుడిదిగదా! అది బంగారు గుళిక, బంగారు కలశమోఅని ఎలా వూహించారు. బౌద్ధత్రిరత్నపేటికకాగూడదా? పూర్ణకుంభంకారాదా? అది రసయోగం లోని పేటికఅని ఎవరు చెప్పారు? ఎవరు చెప్పగలరు? అది పొరపాటు. అది మాత్రం కానేకాదని చెప్తున్నాను.

ప్రొఫెసర్ షర్బట్స్కీ - రష్యన్ పండితుని - గ్రంథాలను తియ్యండి. నాగార్జునిలో Dialectics వున్నాయని, విజ్ఞానవాదాచార్యుడైన ధర్మకీర్తిని పూర్తిగా అనువదించి అచ్చువేసిన ఆ పండితుని గ్రంథాలొక్కసారి చదివి, అప్పటికీ నామీద మీకు ఆగ్రహం తగ్గకుంటే మట్టుకు తప్పకుండా నామీద వ్యక్తపరచండి. చదవండి - చదివి అర్థంచేసుకోండి. అట్టమీద బొమ్మలతోయుద్ధంకాదు. ఆలోపల ఏమున్నదో చూచినతర్వాత మాట్లాడండి. అయినా నాగార్జునుడితో నేనేకీభవించినట్టూ చెప్పలేదు.

వేమనను దిగంబరుణ్ణి నేను చెయ్యలేదు. నేను వెయ్యలేదు ఆ దిగంబర చిత్రాన్ని. ఉన్నబట్టలూడదీయించి నేను కుర్చోబెట్టాననా? బట్టలులేకపోతే, నేను కట్టి కూర్చోబెట్టలేదనా? ఇంతకూ అందులో నాపాత్రేమిటని? నాముందున్న పండితులంతా, పరిశోధకులంతా వేసుకొన్న చిత్రమేయిది. తంజావూరేలిన శివాజీ సవతి సోదరుడు ఏకోజీ సంతానంలోవారు - సరస్వతీమహల్లోకాదు - రాజాంతఃపురంలో పెట్టుకొన్నది. ఆ చిత్రంలోని పోజేమిటి? ఏ యోగశాస్త్రంలో ఆ ముద్ర, ఆ ఆసనం చెప్పబడింది. నా ప్రశ్నేఅది. ఉదయం మిత్రుడు మేడపాటి వెంకటరెడ్డి వేమన అభిమానించిన ఆసనాలని పేర్కొన్నవాటిల్లో దేనికి ఇది సరిపోతుందో చెప్పండి. అదేదీ కాదిది. అది అసాధారణమైన ఆసీనత. దీన్ని ఏ పతంజలీ చెప్పలేదు. ఏ యోగగ్రంథమూ చెప్ప లేదు. అటువంటిదాన్ని యోగిమాత్రుడని పేరొందినవాణ్ణి గూర్చి చూడకుండా ఎవడు గీస్తాడు? ప్రత్యక్షంగా చూడక దిగంబరయోగిని యోగాసనం గానిదాన్లో, సహజ సహజంగాకూర్చొన్నట్టు - చూడకుండా గీస్తాడంటారా? పోనీ, గీశాడనుకొందాం? అది నేగీయించిన చిత్రంకాదుగదా - నాకల్పనకాదుగదా!

యోగసాధనలోకి నేను వెళ్ళడంలేదు. వేమనే వదిలేశాడు. ఆసనాది విధుల అధమయోగంబురా అన్నాడాయెను. అచలం వారిని యీ వేదిక మీదికి పిలిచి ప్రసంగం ఏర్పాటుచేసినంత మాత్రాన నేను ఆ మతంలో జాయినైపోవటంలేదు. అచల మంటే చలనంలేకపోవటంకాదు. అలాగని వారు చెప్పారు. బౌద్ధంలో యోగసాధనలో

దశభూమికలున్నాయి. అష్టమభూమికను అచలభూమిక అంటారు. దానిని బట్టి, తత్సంబంధమైన మరికొన్నింటినీబట్టి వచ్చింది యీపేరు అనినేననంటున్నాను. ఆ అచల గురుపులిక్కడేవున్నారు. వారితో మాట్లాడాను. మీఅచలం వేదసమ్మతమా అని అడిగాను. వేదాలు అపౌరుషేయాలు కావని వారిమతం. అచల సిద్ధాంతం పుట్టిల్లు బౌద్ధం అని చెప్పాను. వారు కాదనలేదు. ఈ అచలం ఎక్కడిది ? ఎప్పటిది ? వీరబ్రహ్మం గారు మొదలుపెట్టిందా ? వేమన మొదలు పెట్టిందా ? (అంటేకాదు, కాదు.) బౌద్ధం నుంచీ వచ్చింది. ఎలావచ్చింది? వీర శైవంతీసుకొంది ? వీరశైవుల్లో తీసుకొన్న వారెవరు ? అల్లమప్రభువు. బల్లిగ్రామంవాడు. అప్పటికి ఆ కన్నడ గ్రామంలో బౌద్ధం బ్రతికేవుంది. అది పన్నెండో శతాబ్దం.

ఇంతకూ ఆ అల్లమ ఏం చెప్పాడు, ఏం చేశాడు ? కాయకవే కైలాస అన్నవాడతడు. కాయకష్టం చేసి బ్రతుకుగడపడమే కైలాసం, కైవల్యం అన్నవాడు. శ్రమసర్వానికి – ముక్తికి కూడా – మూలం కావాలన్నవాడు. వృత్తిదార్ల తిరుగుబాటు వీరశైవం – బసవన వీరశైవం.

గుళ్ళుకట్టడం కలవాడిపని, గుళ్ళలో అఖండ దీపారాధనం కోసం దాన ధర్మాలుచేసి దానశాసనాలు వేయించుకోవడం కలవాళ్ళకే చేతనయినపని అనీ, గుళ్ళు కట్టవద్దనీ, కట్టేకట్టేగుళ్ళు కట్టనీకుండా ఆపించి, దైవదిహ్నం మీహృదయానికి తాకేట్టు లింగాన్ని మెళ్ళో కట్టుకొని తిరగండిరా, ఇంతకంటే మరొకటి వద్దురా, తీర్థ యాత్రలసలేవద్దు – అవీ ధనికుని వినోదమే – గుడిదేహం – ఆత్మ దేవుడు – అంతా దేహంలోనేవుంది – వూరిపొలిమేర దాటకుండా ముక్తిసాధించడమే విశేషం అని చెప్పిసిలేచిన వృత్తిదార్ల ఉద్యమం వీరశైవం అంటున్నాను. అందులో జంగ మార్చన కొరకు దొంగతనం చేస్తే సమర్థనవుంది. అల్లమ అన్నవాడు శూన్యసింహాస నాన్ని అధిరోహించినవాడు, అధ్యక్షించినవాడు అని చదువుకొనివుంటే, ఆ చదువు అర్థమరసిన చదువైవున్నట్టయితే – ఆ రివల్యూషన్ – అదిరివల్యూషనే అనటంలో భేదించవచ్చు – దానికేంగాని, అదీ తెలుసుకోవచ్చు – కాశ్మీరంలోని కురచరాజదంపతులు వచ్చి కట్టెలు గొట్టుకొని బ్రతుకుతూ బసవన్నతోకల్యాణంలో ఉండిపోయారు. తన గుర్రాలశాల తుడిచేవాడే భక్తుడనితెలిసి వాడిపాదాలాశ్రయించిన రాజకథలందులోవున్నై. ఆరోజుకుమాత్రం పలసినదానికన్నా ఎక్కువగడించరాదు, కూడబెట్టరాదన్న నీతివర్తనం చెప్పే వృత్తాంతాలు, తాను రాజకోశాధ్యక్షుడైనా రోజూ చీపురుతో యిల్లుచిమ్మి కాయ కష్టం చేసిన బసవన్న – మాలల కుర్రవానికి బ్రాహ్మణ బాలికనిచ్చి పెళ్ళిచెయ్యబోయి వర్ణాశ్రమ రక్షణ బాధ్యతగలరాజు ఆగ్రహానికి గురై కనుగుడ్లు తోడివేయబడి, ఏనుగుచే

మట్టగించబడిన చారిత్రక సంఘటనలమయమై – ఆర్థిక విచారకోణంకలిగి కులవ్యవస్థ మీద విరుచుకుపడిన బసవన్న ఉద్యమానికి సిద్ధాంతనాయకత్వం అల్లమప్రభుని శూన్యతాదృష్టిఅని చెప్పదలచాను. అయితే ఆ ఉద్యమానికి మతపుతోడుగున్నది. శూన్య భావనే ఇంత చేయకలిగిందొకప్పుడు. మతమే ఇంత బాహ్యాచారాన్ని ఖండించింది. ఆ మతపుతోడుగును కాస్తావాల్చేసి 'ఆర్థిక విషయాలను ఆర్థిక విషయాలుగా చర్చించి' పరిష్కారాలు చెప్పి ఉద్యమించినవాడు మన వేమన్న అని యీ నా పుస్తకంలో ప్రతిష్ఠించాను. కాదేమో లోపలికంటా చదివి చెప్పండి. అంతేగాని అట్టలు చూచి అదరకండి. దిగంబరత్వాన్ని చూచి కోపం చెయ్యకండి.

ఒక్క విషయంమాత్రం స్పష్టంచేస్తాను. నాపుస్తకం తనపని తాను నెరవేరుస్తోందని. మిమ్మల్ని రెచ్చగొట్టి ఆలోచింప చేసినట్లైతేచాలు. కాని అట్టల్నిచూచి లోపలికిపోకుండా అవతలపెట్టేస్తేనో, చించినామొకాన కొట్టుదామనుకొంటేనో, వేదికమీద విసురుదామనుకొంటేనో, చెప్పగలదిలేదు. కానిదానివల్ల ఇదేమిటాఅని యితరులైనా చదువుతారు. (అంకితం కాగితం చించి పైకివిసరాలని ముగ్గురుయువకులు ఉద్దేశపడ్డారని తెలిసింది).

మాపూర్వుల్లో రామస్వామికవిరాజు సూతపురాణం వ్రాశారు. అందులోయథార్థ రామాయణకథ కూర్చారు. దానికి ఆగ్రహించి నందిగామ నడివీధిలోఅనుకొంటాను అపరవాల్మీకులు (వావిలకొలను సుబ్బారావు) సూతపురాణప్రతుల్నికాల్చారు. మీరూకాల్చవచ్చునుదీన్ని. దాన్నితట్టుకొన్న కోవలోవాణ్ణి, నిర్భయుణ్ణి, కాని వినయిని కూడా.

నువ్వు నిజంగాతప్పుచేస్తున్నావ్ వెంకటేశ్వర్రావ్, ఇక్కడ నీవివేచనతప్పు, అనిచూపవచ్చిచర్చించండి. ఆవేశంకాదు చూపాల్సింది, ఆలోచనచెప్పండి, అనుభవాన్ని చెప్పండి. తప్పునుంచినేర్చుకోవాలి. నేను సిద్ధం. మీరుసిద్ధంకండి. National Debate చెయ్యమన్నాను. నినాదాలతోపనికాదు. నేనూ అన్వేషకుణ్ణే. ఏమైనా దారితప్పుతోంటే నాచెయ్యిపట్టుకొని లాగి మీదారిలోకి తీసుకుపెళ్ళండి. మీతోపాటు తుపాకిపట్టుకోలేకపోతే అదిపట్టిన మిమ్మల్నిహర్షించే స్థితిలోకి తీసుకువెళ్ళండి. హర్షించలేకపోయినవారే ఇప్పుడునన్ను తప్పుపట్టారు. అదొకట్రాజెడీ, – కాకపోతే ట్రాజీకామెడీ.

ఎవరైతేనేం తప్పుపట్టటంతోనే ఆగలేదు. నాకొక డిమాండుకూడా వచ్చింది. అంకితం విషయంమీద. అదేమాట్లాడుతున్నవిషయం.(పనివాని ప్రాణాలురక్షించుదామని ప్రయత్నించి తనప్రాణాలనుకూడ రైల్వే లైనుమీదబలిపెట్టిన) నాతమ్ముని స్మృతి చిహ్నంగా అంకితం చెప్పాలన్నది మార్చుకొని శ్రీకాకుళం కొండల్లో చచ్చిపోయిన

తమ్ములలోని మానవతా స్పందనకు అంకితమన్నాను యీ పుస్తకాన్ని. అక్కడచచ్చి పోయినవారినిగూర్చి నాలోబాధవుంది. సజీవంగా మిగిలిన మిత్రులతో బంధంయింకా వుంది. మనిషైతే వుండకేంచేస్తుంది?

సూటిగా అడుగుతున్నాను. గుండెమీద చెయ్యేసుకుని చెప్పమని కోరుతున్నాను Whether it is timed properly – చెప్పండి. ఆవిషయంలో మీరుచేసుకొన్న ఆత్మ విమర్శయేమిటో? చాటుగాచేసుకొన్నదాన్ని వెల్లడిచేస్తారా? అంత ఘాటుగా నేననలేక పోయానుగదా? బ్రతికున్నతమ్ముళ్లన్నారన్నాను. అప్పట్లో నేతీసుకువచ్చిన మామిడి అప్పలసూరి వున్నాడు* నాదగ్గరవున్న భగవద్గీతకాపీ అతనిదే. స్వదస్తూరీలో అతనిపేరు వ్రాసుకొన్నదే. సీతారామాంజనేయసంవాదంపాడేవాడు అప్పలసూరి. ఈమధ్యే మా యింటికివచ్చాడు. పంచెకట్టులోవుండే అప్పలసూరి పాంటులో వచ్చాడు. గుర్తుపట్ట లేనంతగా మారిపోయివచ్చాడు. నేనులేను. నాభార్య ఇట్టేగుర్తుపట్టి ఆప్తంగా ఆద రించింది. అంతలో నేనువచ్చాను. కూర్చోపెట్టుకొని చర్చించాను. ఈపోరాటం మంచి చెడ్డల్ని కూడా గుండెతెరచిమాట్లాడాడు. చాలావిషయాలున్నాయ్. నేనుతప్పురాయలేదు, అబద్ధం రాయలేదు.విషయం ఎంతో విన్నాను. నాతోయుద్ధందేనికి ? మీలోనేయుద్ధం వుంది, జరిగినదాన్ని గూర్చి.

మిమ్మల్ని విమర్శించుకునేహక్కు మీకేవున్నదా ? ఇంకొకరికిలేదా? మీరివ్వరా? మిమ్మల్ని పరులువిమర్శించటానికి తావులేదా ? మీరేతప్పనుకొన్నదాన్ని మీనుంచి అప తలగావున్న త్రిపురనేని వెంకటేశ్వరరావు ఇందులోతప్పుజరిగినా, ఆతప్పులవెనక మాన వత్వాన్నిచూసివుండి బహిరంగంగా ఇలా చెప్పటానికి అవకాశం లేదా? తప్పుల్ని బహిరం గంగాఒప్పుకోగలిగి వుండాలి. అవి పబ్లిక్‌కు సంబంధించిన తప్పులు–విషయాలు. దానికి నైతికబలం వుండాలిమరి. అదేలేకపోతే ముందుకువెళ్ళేదెట్లా ? చాటుగామీలోమీరు చేసుకున్న ఘాటైనవిమర్శని, తగినట్లేతగ్గించి వేదికమీద ఇదిగో ఇలాతప్పులుచేశాం– తప్పుగా ఆలోచించాం, ఇకముందీతప్పుదొర్లకుండా చూస్తామని జాతికి చెప్పగలగాలి. అదేచిత్తశుద్ధి అదే మార్క్సీయమైనదృష్టి. అదొకటీవుంటే వేసుసకు మనం సత్కారం చేసినట్టే.

మనం నమ్మిందే పరమసత్యం అనుకొని, అదే పరమశాస్త్రమని చెప్పుకుని, మనకున్న శాస్త్రజ్ఞానమెంతో, మనమెన్ని ప్రయోగఫలితాలను జీర్ణం చేసుకొన్నామో, మనలో శాస్త్రజ్ఞు లెందరో ? ఆత్మవిమర్శ లేకుండా, ఎప్పటిదైనప్పటికీ మనం నమ్మిన సిద్ధాంతంలో సవరణావసరంలేదనుకొనే విశ్వాసంతో గడ్డకట్టుకుపోయి, ఆ సిద్ధాంత ప్రవక్త చెప్పుకొన్న సవరణలను మెలకువలను, సూక్ష్మాలను దాకా పట్టించుకోక, తల

కెక్కించుకోలేకపోతూ, అది అసలు మనసా త్రేననుకొంటూ సూదిమొనమోపినంతచోటు ఇంకొకడికి ఇవ్వనన్నాడన్న సుయోధనచక్రవర్తులమైపోవడంమాత్రం కూడనిపని. కూడనిపని. కారుణికత్వం అంతామానవతాభావమంతా తామేగుత్తగొన్నామని అట్టడుగు వర్గాలనుద్ధరించే మహత్తరకార్యభారమంతా మనభుజాస్కంధాలమీదే చరిత్ర మోపిందని, మన అవగాహనే అవగాహన, మరొకఅవగ్గాహనకు ఆచరణకు చోటే లేదన్నమాట ఆంతర్యంలోదాచుకొని, నూరుపువ్వుల్ని వికసించనిద్దాం అనేమాట నొక Tactic ఎత్తుగడగా మాత్రమేగాని చిత్తశుద్ధితోమాత్రం కాదేమోనని ఆలోచించు కునేస్థితి కల్పించేలట్టు–ఇవేమీ ఆలోచించకుండా ప్రవర్తిస్తేఫలితంలేదు. మనట్రాజెడీకి కారణ మేమిటోచర్చించండి. మీలోఒకణ్ణిగా పాల్గొంటానునేను.

నేనూ మార్క్సిజాన్నిచదివాను. ఒకపదేళ్ళు ఆచరించాను. ఆ ఆచరణకాలంలో నేను కాల్చేయబడ్డానని నామీదఆశవదులుకొని నాతమ్మునికి పెళ్ళిచేశారు. నన్నంతగా గుప్పెట్లోపెట్టుకున్న మార్క్సిజాన్ని కాదన్న ఎమ్. ఎన్. రాయ్‌నిచూచాను. ఆ ఎమ్. ఎన్. రాయ్‌కి సవరణలు ప్రతిపాదించిన Prof A.B. Shah తో కూర్చున్నాను. Ten Commandments షూట్‌చెయ్యడం ఎటువంటిదో, అనుచరులు రాయ్‌కి సవరణలుతేవడం అటువంటిదే. ఇక్కడ రాయిస్టులు ఏ. బి. షాను కాదంటూవుంటే ఆవులసాంబశివరావుగారు నన్ను ఎ.బి. షాకుతోడుగాజతచేసి రాడికల్‌హ్యూమనిస్టుసడీ కాంపుదాకాతోస్తే వెళ్ళినవాణ్ణి. అసలుమొదట్లోఆహ్వానంలేనివాణ్ణి. వెళ్ళినట్లుగా వుండి పోవాల్సివచ్చి, మాట్లాడమని బలవంతపెడితే, తీరామాట్లాడి ఇక్కడివారికి ఆశాభంగ కరంగా, ఏ.బి.షా సవరణలను ఇంకోకోణంనుంచీ వివరిస్తూ సమర్థించినవాణ్ణి. ఎక్కడ గుణముంటే దాన్ని స్వీకరించగలగాలి. నూతన జ్ఞానాన్ని సమన్వితం చేసుకోవాలి. అంతదాకా కూడా మీనుండి – యీవిమర్శలనుండి–ఆశించడంలేదు.

ఇంతకూ వీరినిగూర్చి నాబాధేమిటంటే యివాళకత్తిబుచ్చుకొన్నా, కలంపుచ్చుకొన్నా మార్క్సిజాన్ని Economic Determinism చెయ్యకుండా, మార్క్సిజం ఆర్థిక నియతికాదు అని మనచేతల్లో వ్రాతల్లో విమర్శల్లో, నిలబెట్టుకొన్నట్టయితే, నిరూపించుకోగలుగుతున్నట్టయితే దేశానికి సంఘానికీ ముక్తి. ఈ సమాజాన్ని నిజంగా ముందుకు తీసుకువెళ్తాం. మార్క్సిస్టు మేధావులు రాణిస్తారు. మార్క్సిజం రాణిస్తుంది అనుకొంటున్నాను.

ఆర్థికమైన కారణాలను కారణాలుగా చెప్పుకొందాం! అందుకు అభ్యంతరంలేదు. ఆర్థిక కారణాలెప్పుడు అంతిమంగానూటిగా పనిచేయనారంభిస్తాయో, ఈలోగా పనిచేసే యితరకారణాలేవో అవివివపనిచేస్తాయో విశ్లేషించగలిగి వుండాలి. వానికివ్వవలసిన

ప్రాధాన్యం వానికివ్వాలి. చూడండి. కులవ్యవస్థమీద ఎందరెందరో ఎప్పటినుంచో దాడి చేశారు. అదంతా ఆర్థికకారణాలనుంచే కలిగిందంటున్నారు. ఆదాడులు సాంస్కృతిక కారణాలనుంచీ కలగలేవన్నట్టుగా ఆదాడి కేవలంబట్టలపరిశ్రమలోంచి, బట్టలనేతలోంచి బట్టల అమ్మకంలోంచి, బట్టలరంగద్దకంలోంచి లేచిందంనిచెప్తూ అలాదాడిచేసినరైతుబిడ్డ వేమనను ఏచేనేతకులంవాడిగానో ఏబట్టలవ్యాపారస్తుల్లోనో చొప్పించుదామనేప్రయత్నం చేస్తున్నారు. వున్నలిఖితాధారాల విషయంవదిలేసి ఊహాగానంచేస్తున్నారు. ఆర్థికకారణాలను వేమన పురోహితసంస్కృతిని - శుష్కమైనకర్మకాండని మూఢవిశ్వాసాలను - వ్యతిరేకించాడంటే పురోహితవ్యతిరేకోద్యమం పెట్టుబడిదారీ సమాజంయొక్క ఆవిర్భావానికి తోడ్పాటయ్యేదీ దోహదకారిఅయ్యేదీ అని అనుకొంటూ వేమనను వ్యాపారస్తులకవి అని అపార్థకరంగా నామకరణం చేస్తున్నారు. ఇదంతా మార్క్సు, విశేషించి ఎంగెల్సు చెప్పినమెలకువలను అరిగించుకోక ఊరికే భాగాన్ని వల్లెవేస్తూ మార్క్సిజాన్ని ఆర్థికనియతి వాదపరిధి దాటనియ్యకుండా పాడుచేస్తున్నారు. ఆర్థిక నియతిగానే మార్క్సిజాన్ని అర్థంచేసుకున్న దానిఫలితమే వేమనగూర్చి యిటువంటి సూత్రీకరణలు చేసేస్థితి. ఇదేస్థితికొనసాగితే ఆవర్గాలను ఆవహించిన ట్రాజెడీ ట్రాజెడీగానే మిగిలిపోతుంది.

ఇంకాఆశ్చర్యకరమైన విషయమేమంటే వీరేశలింగం, గురజాడలను, నవయుగ వైతాళికులు విప్లవమూర్తులు అంటూవేమనను వ్యాపారస్తులకవి అనటం. అంగీకరించటం. వారిద్దరిపరిమితుల్ని వారిద్దరిఅపూర్ణత్వాన్ని బలహీనతల్ని సర్దుకుపోయి తలమీదపెట్టుకోటానికి ఎంతశాతం Tolerencesను ప్రసాదించారో, అంతశాతంలో ఆ Tolerences అన్నింటిని వేమనకు ఎందుకివ్వరూ అని అడుగుతున్నాను. ఎందుకుమీకీ పక్షపాతం ? ఎందుకు రెండు స్కేళ్ళనువాడుతున్నారు. అవన్నీయిస్తేవేమన ఎంతో ఎంతో చెప్పనలవిగానంత ఎత్తుఎదుగుతాడు. వీరేశలింగం, గురజాడలతో గాకుండా వేమనలో ఆంధ్ర పునర్వికాసంమొదలయిందనండి. వేమధ్వజాంకితంగా విప్లవించవచ్చంటున్నాను. ఆలోచించండి.

ఆఖరువిషయం : ఆరుద్రగారికి ఆహ్వానంపంపినతీరు విషయం. నేను నూటిగా చంపక, వయ్యాచలసాని ప్రసాద్ చేశాననేమాట. వారి అడ్రసులేక వారితోపరిచయంలేకఅలా చేశాను. అదీమొదటిసారే. అప్పుడైనా అభిమానమేదోఅడ్డుగోడై అలాచెయ్యలేదు. కించపరచడముకాదు. అలాగ మీరనుకోలేదనుకొంటాను. (అనుకోలేదు-ఆరుద్ర) తర్వాత ఉత్తరాలన్నీనేనేవ్రాశాను. నావస్తూరీలో నేనువ్రాశాననుకొంటాను. గమనించారుగదా ?.

మీకు నాపిలుపు అందజేసిన ప్రసాద్, యివాల్టి యీ సభల్లో పాల్గొనలేని పరిస్థితిలో పడిపోయాడు. అడిగిన పుస్తకాన్నీ అడగని పుస్తకాన్నీ పంపించి సహకరించి,

వేమన వ్యాపారస్తులకవి అని మీవాడన్నందుకు నువ్వువిభేదిస్తే, తమ్ముడు వరసనో, రక్త బంధువనో చూడకుండా విమర్శ వ్రాయగలగాలని, నిలవేసి నిగ్గదీసి, నేను ఆ విషయంగా వ్రాయడానికి కారణమైన ప్రసాద్ ఇతరులూ యిక్కడికి రాకూడని పరిస్థితికి కట్టుబడి వున్నారు, తమ సహచరులందరితోసహా. వారిని - అంటే విరసం వారిని కూడా కావాలనుకొన్నాను. పిలిచాను. పిలవనివారిని పిలిపించారు. వస్తామని ఎవరికి వారే వ్రాశారు. వారడిగినవాటన్నింటికీ ఒప్పుకొన్నాను. అయినా రాలేకపోయారు. కమిటీలో కూర్చొని వెళ్దామని ముందూ, వెళ్ళొద్దని వెనకా రెండోసారి వోటింగుపెట్టి నిర్ణయించారట. పాల్గొనడానికి అనుమతిలేదు. వినడానికి వుందేమోమరి ? ఎందుకీమార్పు ? ఎందుకీ నిషేధం? వెంకటేశ్వరరావును చూచి, వేమనను మరచిపోయేనా ? వేమనను ఏమేమో అనేసి వున్నామనేనా ? అన్నదే మళ్ళీ అనొచ్చు బలంగా. కాకపోతే మార్చుకోవచ్చు. కాని ఇదేంపని ? సరే. అయిపోయింది.

ఇన్ని గంటలు ఇంతమహాజనం ఉక్కబోతలోవుండి, లేవకుండా వుండిపోయి వింటున్న యీ ఓపికకు నేనెన్ని జేజేలు చెప్తే తీరుతుంది. ఇక వేమన వికాసకేంద్రం వెంటనే చేయనున్న పనిని వివరిస్తాను. - - - - -

ఇంతసేపు - అనగా అయిదు గంటలసేపు - అవిచ్ఛిన్నంగా ఇంత ఉక్కబోతలో కదలకుండా ఇటువంటి పండితగోష్ఠిని విన్న ఇంత మహాజనుల ఓపికకు ఎన్ని జేజేలు చెప్తే, ఎంతగా ధనవ్యాదాలు చెప్తే రుణం తీర్చుకోగల్గుతుంది వేమన వికాస కేంద్రం. ఇవే మాసాష్టాంగ దండ ప్రణామాలు. సభకూ వక్తలకూ అందరకూ—



# మన్నించండి, మార్క్సును తప్పించండి ఆర్థిక నియంతినుంచి..........

[ విజయవాడలో యిటీవల జరిగిన వేమన సాంస్కృతికోత్స వాలలో జ్వాలాముఖిగారు తదితరులూ ప్రస్తావించిన కొన్నిఅంశాలకు విజయవాడ, వేమన వికాస కేంద్రం అధ్యక్షుడు శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు సభాముఖంగా సమాధానం చెప్పారు. సమావేశ కర్తగా మర్యాదకు కట్టుబడి, ఆ ప్రసంగంలో చెప్పక వదలిన కొన్ని అంశాలూ, మప్పితంగా చెప్పిన కొన్ని అంశాలకు వివరణ, విశ్లేషణల నిమిత్తం యీ వ్యాసం వ్రాయవలసి వచ్చింది. ]

## మొదటి అభ్యంతరం: పుస్తకం అట్టమీదబొమ్మ

ఆ (నాగార్జునుడి చేతిలోవున్న) కలశం, ఆ రసవాదం యొక్క గుర్తువుందే' అది, వేమన్నను మనంమళ్ళీ రసవాదంవైపు తీసుకువెళ్తామా ? వేమన రసవాదిగానే లోకానికి పరిచితుడా ? స్వర్ణకారవిద్యతోనే పరిచితుడా ? ఇది నాలాంటివానికి కొంచెం సందేహంగానూ, బాధగానూ వుంది.

వేమన అంతరాంతరాల్లోకి అన్న శీర్షికకూడా పెట్టారు. అంటే వేమన గమ్యం ఏమిటని ? చివరకాయన బంగారం చేయటమా ? దిగంబరం కావటమా ?

## ఇద్దరు నాగార్జునులున్నారు :

శూన్యవాద సిద్ధాంతానికి కర్త ఆర్యనాగార్జునుడు. రసవాదానికి కర్త సిద్ధ నాగార్జునుడు. ఇద్దరూ వేరు. వేమన శూన్యవాదం తత్వసిద్ధాంతమని, అది తత్వకర్త

నాగార్జునుడిపని పుస్తకంనిండా వ్రాసివుంది. సిద్ధ నాగార్జునుణ్ణి కూడా పుస్తకం వేరుగా పేర్కొనివుంది. అయినా, జ్వాలాముఖికి ఇద్దరు నాగార్జునులున్నట్టు తెలియలేదుకాబోలు-సిద్ధనాగార్జునుడు బంగారు విద్యలోవాడని - తాత్వికుడైన నాగార్జునుడికన్నా వేరని తెలియకుండానే తత్వపరిశోధనకు చెందిన చర్చలో పాల్గొన సాహసించాడన్నమాట. పుస్తకంమీద మాట్లాడటానికిగాను షుమారు నెలరోజులు ముందుగా పుస్తకం ఆయన నొద్దవుంది. అంతముందునుంచీ చదువుకొన్నప్పటికీ వీరికీ విషయాలు తెలియలేదు. రెన్నాళ్ళుగా సభలో నాకోవున్నా ఇదేమిటీఅని అడిగి తెలుసుకోలేకపోయారు అన్న మాట. నాగార్జునుడిచేతిలోవున్నది బంగారుకలశమనే అభిప్రాయం ఏర్పరుచుకొని సభలోనే సంశయం తీర్చుకొందామని ఉండిపోయారన్నమాట.

## చేతిలో బంగారుబరిణెకాదు, పూర్ణకుంభం

బొమ్మలో నాగార్జునుడి చేతిలోవున్నది బంగారు కలశంకాదు, బంగారుబరిణె కాదు. బౌద్ధుల పూర్ణకుంభమో, బౌద్ధుల త్రిరత్నాలపేటికో, నాగలోకంనుంచీ నాగరాజు నుంచీ పేటికా నిక్షిప్తమైన ప్రజ్ఞాపారమితా శాస్త్రాల్ని (శూన్యవాద మూలప్రతిపాదనా సూత్రాలు) నాగార్జునుడు సంపాదించి తెచ్చాడన్న గాథను సూచించే పేటికో కావచ్చు గాని బంగారుబరిణె మాత్రంకాజాలదు. అయినా ఆ చిత్రానికి నేను కర్తనుగాను. పాతి కేళ్ళుగా ప్రచారంలోవున్న చిత్రాన్ని స్వీకరించాను.

## వేమన - స్వర్ణవిద్య :

వేమన రసవాదిగానే పరిచితుడా, అతణ్ణి రసవాదంవైపే తీసుకెళ్దామా అన్న ప్రశ్నలకుకూడా నెలనాళ్ళుగా జ్వాలాముఖి 'చదివిన' పుస్తకంలో స్పష్టంగా సమాధానాలున్నాయి. అయినా సభాముఖంగా పుస్తకావిష్కారమప్పుడు జ్వాలాముఖులు సడన్‌గా సంశయావిష్టులయ్యారు.

కాని వేమన లోకానికి పరిచితుడు కానిదిమాత్రం ఆర్థిక విచారకుడిగాను, ఆర్థిక విజ్ఞుడుగానూ అనిమాత్రం పుస్తకంలో, పీఠికలో ఎంతో చెప్పి చూపించిన దాన్నంతా దాచేసి, దానితో భేదముంటే నే చూపించిన దాన్నంతా ఎత్తుకొని వివరంగా ఖండించకుండా దాటవేసి, వేమనను రసవాదంవేపే తీసుకెళ్దామా అనే ప్రశ్నను మొలిపించడమే ఆశ్చర్యాల్లోకి ఆశ్చర్యం. రసవాదికానివాణ్ని రసవాదంవేపు నేనో, మరొకరో తీసుకెళ్ళే ప్రసక్తిలేదు. వేమన రసవాదం చేశాడు. పద్యాలున్నాయి. ఇచ్చాను. అందులో అతని వైఫల్యాన్నికూడా స్పష్టంగా పుస్తకంలో చెప్పాను. ఇదిగో :

"కరవులనే హేమతారక విద్య పరిష్కారముగా చాటినాడు.... అతని సిద్ధి ఎట్టిదో ఎరుగరాదుగాని వైఫల్యమాతని పద్యములలో లేదు. కాని అతడందు విజయము సాధించినాడని తలపవలసినదేనా ? కరవులు మాత్రము దీరలేదు. కాపులకావిద్య పట్టు బడలేదు. కాపులచేతికి బంగారము రాలేదు. ( 201వ పేజీ – నా. విశ్వదాభిరామ వినురవేమ )

'వేమన-స్వర్ణయోగం' అనే ఉపన్యాసం ఏర్పాటు చేసినందుకు– ఆ ఉపన్యాసకులు చెప్పినదానికి నా ఆమోదమున్నదని, అటువంటిది ఏర్పరచటమే తప్పో, దౌర్బల్యమో అని ఇంతదూరం వెళ్ళారనుకోగలమా ?

## వేమన వస్త్రాపహర్తను నేను కాను :

ఇక వేమన దిగంబరుడా అంటే అతన్ని దిగంబరుణ్ని నేను చెయ్యలేదని అతని వస్త్రాపహర్తను నేను మాత్రం కానని జ్వాలాముఖికి చెప్పకోవలసివస్తే ఏమేం చేసేది ? నాగార్జునశూన్యవాదం ప్రకారంగాని, అచలసిద్ధాంతం ప్రకారంగాని దిగంబరత్వం అక్కర్లేదు. ఒకానొక జైనం, ఒకానొక శైవంమాత్రమే దిగంబరత్వాన్ని నిబంధిస్తాయి. జ్వాలాముఖీ, ఆయన సహచర దిగంబరకవులకన్నా ముందు వేమన ఆది దిగంబర కవిగా ఆవిష్కృతం కావడానికి కారణం నాగార్జునతత్వం కాదు. శూన్యవాదం కారణంకాదు. తత్వం మారినా దిగంబరుడుగానే వున్నాడా, మరేమను కోవాలో అదంతాకూడా పుస్తకంలోనే వ్రాసివుంది. "అతని అతివాదం" అనే శీర్షిక పెట్టి వ్రాసింది చూడండి, ఇదిగో చిత్తగించండి.

"నగ్నశివాకారంతో వూళ్ళుచుట్టాడు. మంది ముందుకువచ్చి బోధించాడు. కడవరకూ అంతేనా ? లోకనీతినీ, రీతినీ .. లౌకికవ్యవహారాన్నీ చెప్తుతూకూడా అలవాటు చొప్పున దిగంబరుడుగానే మిగిలిపోయాడా ? దిగంబరత్వం మాధ్యమిక శూన్యతత్వానికి అవసరమయింది కానేకాదు. తిరిగి వేమన బట్టలు ధరించాడని– కావులే కానీండి, కల్యాణవేషంలోని పసుపుబట్టలే కానీండి, నిర్విశేషంగా సాదాబట్టలే కానీండి– దాఖలా దొరికితే ఉత్తరోత్తర విశేషదశలవుతాయి. సాదా బట్టల్లో నిలిస్తే, వెలిస్తే వేషధారితనంకూడా పోయి అందమయిన సంగతవుతుంది. ఆ దాఖలా కోసమే మరి.... " [ వేమన అంతరాంతరాల్లోకి – అతని అతివాదం ]

ఒక ఉపశీర్షిక యిచ్చి ఇంతవ్రాసినది చూడకుండానే మాట్లాడాడా ? అలా మాట్లాడడం క్షంతవ్యమేనా ?

## అంకితంతో అభ్యంతరం జ్వాలాముఖికా ?

(2) అంకితప్పద్యంతో వారికున్న అభ్యంతరం :

తూర్పుతోవరు తిరగకముందే, తొందరపడి త్రోవతప్పి శ్రీకాకుళం కొండల్లో కూలిపోయిన తమ్ముళ్ళన్నప్పుడు—తొందరపడి త్రోవతప్పి అనటం వీరికి-జ్వాలాముఖికి-జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య నిర్మాతకు అభ్యంతరమయిందట !

"సామాజిక విప్లవం అంటే భూస్వాముల్ని వ్యక్తులుగా నిర్మూలించడమే అన్న దృక్పథానికి ప్రాతినిధ్యం వహించే సాహిత్యమే విప్లవసాహిత్యంగా చెలామణి చెయ్యబడింది.... అతివాదదుస్సాహసిక దృక్పథంతో వచ్చిన సాహిత్యమే వి. ర. సం. లో ప్రధాన స్థానం ఆక్రమించింది.

మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనావిధానాన్ని అంగీకరించినవారికి మాత్రమే పరిమితమైన సంస్థగా ప్రకటించబడిన వి. ర. సానికి ప్రజాసంఘ స్వభావం లేదు." [జనసాహితీ సాం....సమాఖ్య ప్రణాళిక - 17వ పేజీ]

వ్యక్తినిర్మూలనను బలపరచే సాహిత్యంతోనే వేగలేక వేరే సంఘం పెట్టుకొని ఇంత పరుషంగా ఇంతసూటిగా దుయ్యబట్టిన ప్రణాళికలోని జ్వాలాముఖికి తొందరపడి త్రోవతప్పి నెత్తురులోలికి, ఒలికించిన అని అంటే అభ్యంతరం చెప్పడానికి హక్కు ఎక్కడిది? వ్యక్తినిర్మూలనకు స్వయానా పాల్పడినవాళ్ళల్లో మానవత్వాన్నింకా చూస్తూ దానికి అంకితమియ్యగలిగినవాణ్ని నేను. నన్ను జ్వాలాముఖి తప్పుపట్టటమేమిటి ?

'తొందరపడి, త్రోవతప్పి' అన్న మాటలు ఈ పుస్తకంలో అనడానికి ఆస్కారంలేనివి, హేతువాద పరిధినిదాటి రాజకీయంగా అతివ్యాప్తి కలిగినటువంటివి అని జ్వాలాముఖి విమర్శ. ఆ రెండుమాటలూ లేకపోతే, ఆ అంకితంలో రాజకీయ అతివ్యాప్తీ తక్కినవీ లేవన్నమాట వారి దృష్టిలో. గొప్ప అవగాహనాపరులు సుమీ! వారితో ఏకీభవిస్తే ఏ అతివ్యాప్తీ ఉల్లంఘనా లేదు - విమర్శిస్తేనే అవన్నీ కనిపించుతాయి.

వేమన నక్సలిజం క్రింద జరిగినపనులనిపించేవి కొన్ని చేసి, కొంత ఉగ్రవాద ఆర్థిక కార్యక్రమాన్ని చెప్పినవాడు కావున, అతనిమీద వ్రాసిన పుస్తకాన్ని అతనివంటి వారిలోగల మానవతా స్పందనకు అంకితమన్నాను. తొందరపడినా, త్రోవతప్పినా వారిలోగల స్పందనను గుర్తించాను. ఈ పుస్తకంలోని విషయంతో సందర్భించే అంకితమే యిది. కాగా, హేతువాదపరిధికి లోనుచేసి, రాజకీయసీమజోలికి వెళ్ళరాదనేది జ్వాలాముఖిగారేగాని, మేముగా నియమితం చేసుకోలేదు. మా సాంస్కృతి

కోద్యమం జాతి సామాజిక జీవితం సర్వంతోనూ, భావజీవితం సర్వంతోనూ ప్రసక్తిస్తుంది. మా ఆశయం లక్ష్యం-అభ్యర్థన మరోరకంగా చెప్పలేదనుకొంటాను.

ఇంకా యితరులు తప్పు పట్టే మాటుంటే, దానికి సమాధానం నా ఉపన్యాసం లోనే వుంది. చూడండి.

## ఉదయం యోగి - సాయంకాలానికి భౌతికవాది !

(3) "వేమనను యీనాడు మనం భౌతికవాదిగా తేవాలా ? కర్మయోగిగా తేవాలా ? మార్మికవాదిగా తేవాలా ? (అతని ప్రశ్నగుర్తులు) శిష్టుల కంగీకారం కానందువల్ల వేమనను యోగి చెయ్యడానికి (పూర్వం) ప్రయత్నించారు" – అన్నమాటకు.

31 మే, 1981 తేదీ పగలు పన్నెండు గంటలకు వేమన యోగియని, యోగిగా అతడూ, అతని యోగామిస్టిసిజం Not acceptable, reject చేస్తాం అన్నారు జ్వాలాముఖి – అది Development in reverse అన్నారు.

31 మే, 1981 తేదీ సాయంకాలం 8 గంటల వేళకు అదే సభావేదికమీద పుస్తకావిష్కారమప్పటికి శిష్టులెవరో యోగికాని వేమనను కావాలని యోగిని చేసి చెప్పారని – తిప్పిసెలవిచ్చారు. గొప్పగావుంది పట్టీ. వ్యవస్థలేని అభిప్రాయాలు అనాలోచితస్థితులు. అర్థంలేని వాగాడంబరం– జాలిపడటంవినా ఏమనగలం? వేమన యోగాన్నిగూర్చి పుస్తకంలో నేను వ్రాసింది, వినండి – ఇదిగో ఇలావుంది :

"ఉపవాసమక్కరలేదు. ఆసనాది వ్యాయామ మక్కరలేదు. జెట్టిసాముగాని సహజ శాంత యోగమును వేమన కడకు పాటించినాడు" —(14వ పేజీ)

"మంత్రము, యోగము, మననదిధ్యాసనలు మున్నెన్నన వేమియులేని యోగ ముగా రాజయోగముపేర వేమన్న యొకటి చెప్పినాడని కనుగొన్నాము. అచలము కూడా అంతే చెప్పుచున్నది. —" (31వ పేజీ) (విశ్వదాభిరామ వినురవేమ)

అచలులది సంసారయోగం - యోగముద్రలులేని యోగం - రాజర్షుల యోగం – వివేకానందాదుల రాజయోగంకాదు. వేమనదీకడకంతే.

హేతువాదకవి భౌతికవాదికాలేడని, వేమన భౌతికవాది కలేడని మధ్యాహ్నం ఆరుద్రగారు వేసిన ప్రశ్నలకు ఎదురుతిరిగి తనవద్ద 20 పేజీల నోట్సుంది – వేమన Creative Anarchist అనటం కూడా సరైనదే – తన యీ సూత్రీకరణల్లో ఏమీ మార్చుకోనవసరం లేదని మొరాయించిన జ్వాలాముఖి సాయంకాలం చల్లటివేళ కల్లా చల్లబడి, ఆరుద్రను అంగీకరిస్తున్నట్లై వేమనను భౌతికవాదిగా చూపాలా లేదా

అని నిస్సంకోచంగా ఎలుగెత్తి, వెంకటేశ్వర్రావు అలా చూపలేదని ఆరోపిస్తూ ఫిరాయింపు విమర్శకు పాల్పడి విషాదము వినోదము కలగలుపు చేసి కావలసినంత పంచారు సభలో.

## జైనమతప్రస్తావన చాలతక్కువ.

అదే పుస్తకావిష్కారవేదికమీద ఆ వెంటనే "ఇంతదాకా వేమనమీద వెలువడిన గ్రంథాలలో జైనమతం, చార్వాకాల ప్రస్తావనలేదు. కాని యీగ్రంథంలో దినమొల జైనం, చార్వాకాలప్రస్తావన (వెంకటేశ్వరరావుగారు) బాగాచేశారు. ముఖ్యంగా జైనం యొక్క ప్రసక్తిబాగా తీసుకురావటం జరిగింది". అన్నారు జ్వాలాముఖి. పైవాక్యాలకిది విరుద్ధంగదా!

ముఖ్యంగా జైనమతప్రసక్తి బాగాచేశానన్నమాట సత్యదూరమయినమాట. ఎక్కువచెయ్యలేదు. తక్కువేచేశాను. ఆరుద్రగారికన్న తక్కువగానే చేశాను. నేను చేశాను. నేను చేసిన చార్వాకప్రస్తావనకన్న తక్కువగాచేశాను. వేమన ఆ రెండింటినీ జైనచార్వాకాలను-ఖండించాడని ఊహించాను. వేమననుంచీ చార్వాక మతఖండన పద్యాలలో ఒక డజను ఉదాహరించాను. మరి అరడజను ఇవ్వవచ్చు. ఇంకా ఎక్కువ వుండవచ్చు. వేమనలో జైనమత ఖండనకన్నా చార్వాక మతఖండన పద్యాలెక్కువగా వున్నాయి. అందుకే ఎక్కువగా ఇచ్చాను. జైనమతఖండన పద్యం ఒక్కటే యిచ్చాను.

## జైన చార్వాకాలు-నేనూ ఆరుద్రా :

నాకూ ఆరుద్రగారికీ యీ రెండు విషయాల్లో చాలా అభిప్రాయభేదంవుంది. జైనులతో వేమనవేకీభవించినవేళ ఎప్పుడూలేదన్నాను. ఒకప్పుడు ఏకీభవించి మరొకప్పటికి విభేదించినట్టు నేను చిత్రించలేదు. చిత్రించలేను. ఎవ్వరూ అలాచిత్రించి నెగ్గించుకోలేరు. ఆరుద్రగారే చిత్రించారు. ప్రతికరాస్తుదంగానైనా వారిచిత్రణంచూడలేదు. మూస్తే ఆవిషయాన్ని చర్చించేవాణ్ణి అచ్చంతా అయిపోయినతర్వాత (సెప్టెంబరు 1978) నివేదిత పత్రికనుంచీ కత్తిరించి వారివ్యాసభాగాన్ని మిత్రులు పంపారు. చూచాను. వారిచ్చిన అర్థతాత్పర్యాలు పొసగవు. అది వేరేవిషయం-వేరే రాస్తానుకూడా.

వేమనలో అంత అధికంగా చార్వాకఖండనవున్నదంటే, వేమన చివరకి చార్వాకంలోకేవచ్చి చేరుకొన్నాడనేభాష్యం చెయ్యడానికి రోడ్‌బ్లాక్ అయిపోయిందని జ్వాలాముఖికి అర్థంకాలేదు.భౌతికవాదిగా ముగుస్తున్నాడని ప్రతిపాదించారు.ఆరుద్ర-స్వాగతమే. అదే చివరినిర్ణయంగా వస్తేబాగుండునన్నారు వేమన ఆదిలోనో అంతంలోనో ఎప్పుడైనా గాని భౌతికవాదభావాలు చెప్పాడని సభలో ఆరుద్రగారు చదివినపద్యాలు భౌతికవాదార్థ

నికి అసలుఒదగనివి ఎక్కువనీ, ఒదుగుతూ ఇతరభాష్యానికికూడా అవకాశం యిచ్చేవి ఆ తక్కినవనీ మరొకభాష్యానికి, లొంగకుండా భౌతికవాద భాష్యానికి మాత్రమే లొంగేవి అసలు అందులో లేనేలేవనికూడా చెప్పడం మంచిదని ముందుగా చెప్తున్నాను. అదివేరే నిరూపిస్తున్నాను.

## జ్వాలాముఖి అవ్యవస్థ-దుర్భ్రమలు :

కాని జ్వాలాముఖి ఒక దుర్భ్రమలో మాత్రమున్నారు. భౌతికవాద మయితేచాలు అదితప్పకుండా విప్లవాత్మకంగా వుంటుందనే అభిప్రాయంలోవున్నారు. అలాగెవ్వరను కొన్నాతప్పే. వేమనను భౌతికవాదినిచేసిన ఆరుద్రగారు వేమన అరాజకవాది, సృజనాత్మక అరాజకవాదికూడాకాదని, చార్వాకం(బార్హస్పత్యంగా) రాచరికవాదం చేసిందని వేమన అలాగే రాచరికవాదిఅని నిరూపించయత్నించడంవల్ల గ్రహించేవుంటారను కొంటాను. ఇదే విషయాన్ని పాతికేళ్ళక్రింద " నా భారత తత్వశాస్త్ర పరిశీలన " అన్న గ్రంథంలోచెప్పాను. యూరపులో Hobbes భౌతికవాది- కానిరాచరికవాది ఈ దేశంలో పూర్వమీమాంస నాస్తికసమమై భౌతికవాదమైకూడా యజ్ఞయాగాదికమైన మాజిక్కుకూ, రాచరికవాదానికీ వర్ణవ్యవస్థకూ తావలమవటంచూపాను. భౌతికవాదం ఎప్పటికీ తిరుగుబాటుపాత్రే వహించిందనుకోవటం చాలతప్పు. అసలు దానికర్త బృహస్పతి చేతిలో అది గణతంత్రానికి వ్యతిరేకంగారాజరికవ్యవస్థను చెప్పింది.కర్నాటకంలో 11, 12 శతాబ్దాలలో అది రాజులను ఆశ్రయించుకొని వుంది, రాజుల్ని తన అనుయాయుల్నిగా చేసుకొనివుంది. వర్ణవ్యవస్థావాదులైన లకులీశ, పాశుపతశైవుల సమ్మానం పొందివుంది. అప్పటి విప్లవశక్తి వీరశైవ మతోద్యమంగాని చార్వాకంకాదు. చార్వాకు లెప్పటికీ అట్టడుగు వాళ్ళతోనే వుండిపోలేదు. అది బహురూప. అందులో ఎంతో భేదంవుంది. డైలెక్టిక్సుకు దూరంగా – వ్యతిరేకంగా వున్నది అది. ఆరుద్రను విని తిరిగిపోయినజ్వాలాముఖి వేమన అనార్కిస్టు అనటం కూడా వదులుకొన్నారన్న మాటేగదా !

సభానంతరం భోజనం చేసినప్పుడీమాట చెప్పాను జ్వాలాముఖితో. అప్పుడేమన్నారో తెలుసా ? డైలెక్టిక్సు వున్నాయిగా విప్లవాన్ని ఆదుకోడానికి- అదెప్పటికీ తప్పుకాదు గదాఅని.

Spratt ని చదివారా అన్నాను. రావిపూడిని చదివాను అన్నారు. అది విశేషం గాదు అన్నారు. అపవతలవుంచి, Spratt ఎవరోతెలుసా- భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీని స్థాపించడానికి వచ్చిన ఇద్దరి బ్రిటిష్ కమ్యూనిస్టుల్లో ఒకరు. ఇక్కడే స్థిరపడి, ఇక్కడే మట్టయినవాడు....ఏదో చెప్పాను. రావిపూడినైనా ఖండించలేదు.

ఈవిషయంలోనూ వారు దుర్భ్రమలో వున్నారు హెగెల్, గ్రీకుహెరాక్లిటస్, డిమో క్రాట్స్లాంటివారు ప్రభుపర్గాలపక్షంవారు.అతనితత్వం మిస్టిసిజంమయం. అరవిందోకుబాగా ఆలంబనం యిచ్చినట్టిది. ఇవన్నీతెల్సుకుంటే మంచిది. సందర్భనుంచి తొలగిదూరం వెళ్ళాను. మన్నించండి. ఇంతతెలియనందుకు జ్వాలాముఖిని తప్పుపట్టటం లేదు. ఎంతో తెలిసినవాడిగా వాగాడంబరం చేస్తున్నందుకే ఏమన్నా తప్పుపట్టుతాము. వేమన బాహ్యా చారఖండనం భౌతికవాదిగా చేసినట్టు బాహ్యాచారంమీద మతాలుదాడి చెయ్యలేవన్నట్టూ, జ్వాలాముఖి మాట్లాడివున్నారు. విని నవ్వుకొన్నాను. తెలిసినవాళ్ళు నవ్వకుండా వుండ లేరు. బాహ్యాచారాలమీద దాడి చాలామతశాఖలుచేసినై. ఆధ్యాత్మికమైన మతాలుచేసినై అద్వైతంకూడా ఎంతోచేసింది. నిర్గుణపంథాలోని మతాలన్నీ, ప్రవక్తలందరూ చేశారు. కబీరుచేశాడు, బసవన్నచేశాడు, వేమనచేసినదాడికి భౌతికవాద ఉత్కంఠకాదు కారణం. నిర్గుణపంథాలోనే దానిపునాదులు. మతాన్నికాదన్నస్థితికి ఎదిగిన తర్వాతకూడా ఆనిరసనే బలపడింది, మార్క్సిజానికి దగ్గరగావున్న చార్వాకమూ జైనబౌద్ధాలు అంటున్నారు. చిన్నపిల్లలతంతుగా వున్నది. అయితే నాగార్జునుడు బౌద్ధాచార్యుడు. అతని శూన్యవాదం బౌద్ధము. వేమన శూన్యవాదబౌద్ధాభిప్రాయానికి చేరుకొన్నాడంటేనేకదా ఇంతరగడరేపి వున్నారు జ్వాలాముఖి. వేమన బాహ్యాచారాలకు పునాది అయిన ఉత్పత్తిసంబంధాలలోకి వెళ్ళలేదంటాడు, బాహ్యాచారఖండనం ఎవరుచేయగలరోకూడా సొంతం తెలుసుకోలేని స్థితిలోవున్న జ్వాలాముఖి ఉత్పత్తిసంబంధాల విషయమై లోతులంటిన వారంటారా ? అందులో ఏమైనా పరిశోధన చేసినవారంటారా? ప్రత్యేకాధ్యయనం చేసినవారంటారా ? ఈవల్లింపు ఎంతపాటిదో, అదీ అంతపాటిదే. అదీ ముందుచూస్తారుగదా: "బాహ్యా చారాలకు కారణమైన సామాజికస్థితులేమిటో వేమన యింకాలోతుకు వెళ్ళలేదు." వీరు వెళ్ళారేమో చెప్పమనండి. వైష్ణవంలోవున్న వడగలై, తెంగలై శాఖలలో నామాలను గూర్చిన భేదం బాహ్యాచారంలో భేదంగదా? ఆబాహ్యాచారానికి, ఆబాహ్యాచారంలోని వైషమ్యానికి సామాజికస్థితిలోవున్న కారణాలేమిటో చెప్పమనండి. వైష్ణవులజుట్టుపెంచే తీరొక బాహ్యాచారం. దానికి సామాజికస్థితిలోగల పునాది ఏమిటో? చెప్పమనండి-బాహ్యా చారాలనుగూర్చి మార్క్సిస్టువిచారం – ఒక్కవైష్ణవం విషయంలో వారికితెలుసు గావున చెప్పమనండిచాలు. ఇందులో ఉత్పత్తిసంబంధాలేమిటో సెలవియ్యమనండి.

## బుద్ధునిలో భౌతికవాదం-అచల యోగం :

భౌతికవాదాన్ని ముందుకు తెచ్చినబుద్ధుడు అంటూకూడా ఆయన ప్రసంగించ గలడు. ప్రసంగించాడు. అప్పుడే అక్కడే ప్రసంగించాడు. అటువంటి బుద్ధుణ్ణి "దశా వతారాల్లో చేర్చినటువంటి ఘనాఘనసుందరులు మన తాత్వికలోకంలోవున్నారు. వేమనను

యోగిగా చెయ్యగలరనే విషయం చాలామామూలు విషయం అన్నదంతా గుర్తులేదా ? చార్వాకుల ఉచ్ఛేదవాదాన్ని,స్వభావవాదాన్ని ఆత్మశాశ్వతా వాదంతోపాటుగా త్రోసిపుచ్చిన మధ్యేమార్గంవాడు బుద్ధుడు. బుద్ధునితర్వాత బౌద్ధుల్లో విజ్ఞానవాదశాఖ వచ్చింది- వచ్చి భావవాదం అది. అదంతా ఒకకథ. కాని లోతులంటని చదువు ప్రమాదిస్తుంది.

అలాగే జ్వాలాముఖి అచలయోగం అంటున్నారు. ఘూథసమ్మెకాలకు ప్రశ్న గుర్తులు పెట్టినవేమన శివయోగంగురించి, రాజయోగం గురించి, అచలయోగంగురించి అంతగా పాదాక్రాంతం కావలసిన అవసరం అసలే లేపతనికి అన్నారు మరోచోటకూడా అన్నారు. అచలయోగమంటూ యోగసాధన అనే దొంటిలేదు. అసలు అచలంవారు యోగులుకారు. ఆసనాదివిధులేమీలేవు. వారు సన్యాసాన్ని అంగీకరించరు. ఉపవాసా లంగీకరించరు. కులాలనంగీకరించరు. వారి ఆద్యగ్రంథం బృహద్వాశిష్ఠంలో ఒక ప్రకరణమే వర్ణనిరసన ప్రకరణం ఇప్పటికీ హరిజనులతో అంటులో బ్రాహ్మణ పర్యంతం సహపంక్తిభోజనం చేస్తారు. ఆంధ్రలోమాజీమంత్రి అరిగె రామస్వామి అచలసిద్ధాంతి వేమన చెప్పిన ఎంగిలితిన్ను వీరిలోఉండేవి- ఇప్పుడు మానుకొన్నారు. నేను ఆశ్చర్య పడ్డాను. అందులో కందార్థ దరువులువ్రాసి ఎంతోప్రచారంలోవున్న భాగవతుల కృష్ణదేశికులు ఆరుద్రగారి తాతముత్తాతల్లోవారట. ఆరుద్ర గారైనా ఆలోతులు తరచినవారుగాక పోయారు. అందులో విగ్రహపూజలు ఏమీలేవు. నిర్గుణోపాసనకూడలేదు. దానిగొప్ప తనం చాటుకోవటం ఆ అచలసిద్ధాంతులకే తెలియటంలేదు. గురువాదం గురుపూజ తప్పిస్తే మతంకాకుండాపోయినమతం, తత్వం అదొక్కటే యీదేశంలో. దాన్నిగుర్తు పట్టడం మనబోటివాళ్ళవంతు.

అచలంవైపుకు మొగ్గుచూపడానికి ప్రయత్నం చేసినటువంటి అంశాలిందులో వున్నాయి. శాస్త్రం సమస్తమూ చలనంలోవున్నది. ఏదీ అచలంగావుండటానికి వీల్లేదంటు న్నది. కాని అచలంవైపేమొగ్గటం ఎవరికైనా మంచిదేమోగాని త్రిపురనేనికి వేమనవికాస కేంద్రానికిమాత్రం ఆరోగ్యప్రదంకాదు, అని జ్వాలాముఖి హితవుచెప్పారు. కాని అచలసిద్ధాంతంఏమిటో తెలియకుండా చెప్పబూనుకొన్నారు.తెలిసిచెప్పితే ఆలోచించవచ్చు. తెలియని పెట్టని వారింతకు సాహసిస్తే ఎట్లా? అచల విషయాలింకా నా ఉపన్యాసంలో చలాచలాలనుగూర్చి కూడా వుంది చదవమని కోరుతాను.

ఒకవేళ అచలంవీరన్నట్టిదై వేమన ఆమార్గంలోనివాడే అయితే అలాగే దాఖలా వుంటే నన్నేంచెయ్యమంటారు? ఇదేమైనా పరిశోధనా ? సత్యాన్వేషణా ? రాజకీయమా? ఏదైనా తెలిసిమాట్లాడాలి. సత్యాన్వేషణకు దీక్షవుండాలి. రాజకీయావసరాలనుబట్టి

పరిశోధనా ఫలితాలను మార్చరాదు. పరిశోధనాఫలితాలు ఎంతమేర వుపకరిస్తే అంతమేరే ఉపయోగించుకోవాలి. అచలం చలనాన్ని తిరస్కరిస్తే, ఆ భాగాన్ని గాక పైచెప్పిన తక్కినభాగాన్నే గౌరవించుదాం.

అచలమన్నది ఇప్పుడుప్రచారంలో పెట్టినపేరు. అసలు వారిసిద్ధాంతం పరిపూర్ణ సిద్ధాంతమంటారు. వీరశైవంలో వున్నపేరేఅది. శూన్యము అంటేపరిపూర్ణముఅని వచనకారులు చెప్పుకొన్నారు కన్నడంలో. వీరశైవులకే దానిలోతులు పూర్తిగా అందటంలేదు. అదే శోచ్యం.

## సెక్యులరిజం : జ్వాలాముఖి అసత్యాలు

(6) వేమనలోవున్న సెక్యులరిజం ఎటువంటిదని నేను చెప్పానో, అటువంటిదిగా నేను చెప్పలేదని దుర్మార్గమైన అబద్ధం మాట్లాడాడు జ్వాలాముఖి :

"వేమనలో సర్వమత సమ్మానం వుంది. అన్ని మతాలను సమానంగా చూశే గుణంవుంది. ఇది ఎంత సెక్యులరిజం! ఎవరూ గుర్తించడంలేదు అనేటట్లు ప్రస్తావనకు తీసుకొని వచ్చారు (వెంకటేశ్వరరావుగారు). అసలు రాజ్యానికి కావలసింది అన్ని మతాలను సమానంగా చూడడమా ? అలాచూడటమే సెక్యులరిజమా, లేక, రాజ్య వ్యవహారాల్లో మత ప్రసక్తి లేకుండా చెయ్యటమే సెక్యులరిజమా ? " అంటూ అటువంటి దాన్ని నేను వేమనలో చూపలేదని క్రూరాతి క్రూరంగా అబద్ధం ఒకటి చెప్పారు, సభముందు. కించపడతారని సభలో నా సమాధానంలో అది వదిలేశాను. గమనించండి:

పిలిచినందుకు మన్నన చేయవలసివున్నదని ఇంతఘోరమైన అజ్ఞానాన్ని ఇన్ని అబద్ధాలను ఇన్ని వక్రీకరణలను చూపించినా, చెప్పినా, చేసినా పిలిచి సభలో నేను చిన్నపుచ్చినట్టవుతుందని తగ్గి కొంతమేరకే సమాధానం చెప్పుకొన్నాను. చదివితే మీకే బోధపడుతుంది. ఇది అసలు వదిలేశాను.

" మతసమత్వమేకాదు, మతరాహిత్యము " అనే పేరుతోనే ఒక Chapter వ్రాశాను. పుస్తకం ఆదిలో 6వ పేజీనుండి 11వ పేజీదాకా ఒక అధ్యాయమే వ్రాశాను. పుస్తకంలోకి వెళ్ళకుండా విషయసూచిక చూచినా తెలిసే విషయం యిది. వేమన Organised Religion కు వ్యతిరేకమనీ, మతానుభవం వ్యక్తిగతానుభవమన్నవాడనీ, మతములోననున్న మతములన్నిటిని గోయుమన్నాడని, మర్మమెరుగలేక మతములగల్పించి ఉర్విదుఃఖులగుదులోకరికొకరని మార్క్సుకు ముందెప్పుడో అన్నా

డని పది పద్యాలుదాహరించి- మతప్రసక్తిరహిత సమాజ, రాజ్యతత్వాన్ని చెప్పిన వాడని, ఇటువంటి భావం పాశ్చాత్యమైనదని మన రాజకీయపండితులంటారని, మన దేశంలో అటువంటి సెక్యులరిజానికి సంప్రదాయం లేదంటారని, సర్వ సమానత్వమే మన సంప్రదాయమని అంటారని - అదంతా అబద్ధం, తప్పు అని నిరూపిస్తూ పాశ్చాత్యమయినదనే మతప్రసక్తిరహిత లౌకికరాజ్యతత్వాన్ని వేమన చెప్పాడని, అచలంలో అదే భావమని, వెనకటికి నాగార్జునుడిలో పునాదులున్నాయని అతని దృష్టి రాహిత్య సిద్ధాంతంలో ఇది వున్నదని అచలం- వేమన అనే Chapterలో (30, 31 పేజీల్లో) కూడా చూపివున్నాను భారతదేశం మొత్తంమీద ఈ సెక్యులరిజానికి కర్త వేమన అవుతాడని 1969లోని రేడియో ప్రసంగం లగాయతూ ఎన్నోచోట్ల వ్రాశాను - చెప్పాను. అలాగన్ని పీఠికలో చాలా ప్రస్తావించాను. కాని కొండంత అభాండం వేశాడు జ్వాలాముఖి నెల్లూరు జైలునుండీ పుస్తకం పట్టుకొని చదివి మాట్లాడిన అబద్ధాలు ప్రామాదికాలా? బుద్ధిపూర్వకాలా? ఏమిటీ మహనీయుని ప్రవృత్తి? విచార్యం కావటంలేదా?

## కులంమీదదాడి : వ్యాపారం :

(7) 'వేమన వ్యాపారస్తులకవి' అని ఒక విప్లవరచయిత అన్నందుకు వెంకటేశ్వర్రావు గారు అంత విరుచుకుపడనక్కరలేదు – అని అన్నారు జ్వాలాముఖి.

విరుచుకుపడలేదు – వివేచించాను – విరుచుకుపడలేని సందర్భంకూడా. అసలు వ్రాయొద్దనుకొన్నది. వ్రాయాల్సి వచ్చిన సందర్భంఅది. అలాగన్నది త్రిపురనేని మధుసూదనరావు, విరసం కార్యదర్శి. ఆవివేచనలో జ్వాలాముఖినసలే అపవదించలేదు - చెప్పింది చెప్పలేదనలేదు. కేవలం చర్చించాను. నోరు జారలేదు. నోరు పారేసుకోలేదు. ఒక సమస్యను వారిముందుంచాను. అది వీరిముందూవున్నట్టే వుంచినట్టే. సమాధానం కోసం యత్నించవచ్చు. వేమన కులవ్యవస్థను కాదనటంలో(వ్యాపార)పెట్టుబడి ప్రయోజనాలున్నాయని, సరుకుల ఉత్పత్తి బాగా జరుగుతున్నందున, అనగా స్వయం సంపూర్ణ గ్రామావసరాల మేరకేగాక ఇతరప్రాంతాల, దేశాల అవసరాలదృష్ట్యా సొంత వినియోగం కొరకేగాక, అంగడికిగాను ఉత్పత్తిసాగుతోంటే, అంగడికొరకు ఉత్పత్తి అనే దానికి అప్పట్లో కులం అడ్డంకిగావుండి, ఆ కులవ్యవస్థమీద వేమన 17 వ శతాబ్దిలో తిరగబడ్డాడన్న అభిప్రాయం వీరందరిలోనూవుంది. జ్వాలాముఖి కూడా సరుకుల ఉత్పత్తి అవుతున్నకొద్దీ కులీన సమాజం బీటలువారక తప్పలేదు. అంగళ్ళల్ల పర్యాటక జీవితం, దానివల్ల జీవితానుభవం పెరిగి, స్థిరమైన విలువలకూడలి

బద్ధలవుతూ పోయింది. దానివల్ల బాహ్యాచారంమీద దాడి చెయ్యటం కలిగింది" అంటూ ఉపన్యసించినవారే గదా!

కులవ్యవస్థమీదదాడి, బాహ్యాచారాలమీద దాడిచేసినవారిలో వేమన చాలా చివరి వాడు. 17వ శతాబ్దివాడుగదా! కులంమీద దాడి 7, 8 శతాబ్దుల తంత్రాచారం నుంచీ వుంది. నాగార్జున శిష్యుడైన ఆర్యదేవుడినుంచీ కూడా బాహ్యాచారంమీద దాడివుంది. సహజయానం నుంచీవుంది. తంత్రాచారం అన్నిమతాల్లోకీ ఎక్కింది. అప్పట్లో సరుకు – అంగడి – వర్తకమే దానంతటికీ కారణమా?

## సమస్య ఇచ్చాను - కలిసి సమాధానించవచ్చు:

వేమనకు 500 ఏండ్ల ముందు పశ్చిమోత్తరకర్నాటకంలో శైవం వీరశైవమై-కులంమీద తిరగబడింది. అంతకు ఒక నలభై యేళ్ళ ముందునుంచీ కర్నాటక పశ్చిమ తీరంలో – ఉడిపి, మంగుళూరులు కేంద్రంగా – వర్ణాశ్రమాచార కాఠిన్యంగల మధ్వాచార్యుల భక్తి వుద్యమం లేచి విస్తరిస్తోంది. 12వ శతాబ్దంలోనే – అదే కాలంలో తీరాంధ్రంలోనూ, లోపలి ఆంధ్రంలోనూ శైవం ముదిరి కన్నడ వీరశైవాన్ని, ఆ నాయకుణ్ణీ కీర్తిస్తూనే ఆలింగధారణం చేయిస్తూనే కులవ్యవస్థని వదులుకోలేని నిస్సహాయతని ప్రకటిస్తూ విజృంభించింది. కులంమీద తిరుగుబాటు శైవానికి వ్యతిరేకంగా ఒక చిన్న పిచ్చుకగూడంత పల్నాటిలో వైష్ణవ రూపం తీసుకొని చిన్న పక్షం పాలై దెబ్బతిన్నది.

సముద్ర వాణిజ్యంచేత సరుకు – అంగడి – వర్తకుడు ముందుగా – ఎక్కువగా – ఏర్పడగల తూర్పు పడమర తీరాల్లో కులవ్యవస్థానుకూల మతోద్యమాలు, భూచక్రబంధితమైన పశ్చిమోత్తర కన్నడం అంగడి – సరుకు – వర్తకుడన్న పరిస్థితులు అంతగా ఏర్పడకుండానే కులంమీద దాడి భీకరరూపం తీసుకొన్న మతోద్యమానికి అదే శతాబ్దంలో అదే కాలంలో నిలయ మెలాగు అయింది? ఇదే ప్రశ్నకు పల్నాటి వీరవైష్ణవమేమిటి? కన్నడకల్యాణనగరంలో వీరశైవం ఏమిటి? అని నా పుస్తకపీఠికలో వ్యాపారస్తులకవి వేమన అన్న వివేచనలో అడిగాను.

12, 13 శతాబ్దుల్లో కులంమీదదాడి భీషణరూపం దాల్చింది. యుద్ధరూపం ఎత్తింది. హత్యారూపం తీసుకొన్నది. కులం వదిలేసిన వారంతా వేరొక కులమై పోవటందాకా వచ్చింది. తర్వాత 14వ శతాబ్దినుంచీ భక్తి వుద్యమాలు భక్తులు బాగా లేచారు. కులరాహిత్యప్రబోధం వంపిగా జరిగింది. అది బోధగానే వుండిపోయింది. లింగాయతంలాగా ఆచరణ విస్తృతిసాధించలేదు. కాని అంగడి–సరుకు–వర్తకం పెరిగింది.

పెరిగినా, కబీరు తక్కిన భక్తులూ బోధించినదెక్కువ – దానిఫలితాలు తక్కువై పోయాయి. కబీరుకన్నా వేమనచేసినప్రయత్నం గట్టిది. పట్టుదలతో సాగినది. అయినా అవివీరశైవం విస్తృతిని సాధించలేదు. వేమన "యుగసంధిలో యుగవాణి"గా వచ్చాడని సాయంకాలపు సభలో జ్వాలాముఖి సెలవిచ్చారు. మొదటి వారసలు వ్యాపారస్తులకవి అన్నదాని భావంకూడా అదేకావాలి. అయితే వేమనకు వ్యాపారవర్గాలు స్వాగతం చెప్పివుండాలిగదా! అనుసరించి వుండాలి, కొలిచివుండాలి. ఆదాఖలా నాకు దొరకటంలేదు. వారికేమైనా దొరికిందేమో చూపవలసి వుంటుంది.

అసలీ కులవ్యతిరేకోద్యమాల జాగ్రఫీకి, టైమోగ్రాఫుకీ– సరుకు, అంగడి, వర్తకుడు పరిస్థితులకూ వీరనేంత సూటిసంబంధాన్ని మార్క్సిజం కోరుతుందంటే మాత్రం ఆసంబంధాన్ని అంతసూటిగా కళ్ళకుగట్టినట్టు నిరూపించడం వీరికర్తవ్యమే. అంతపనిమాత్రం వీరింతవరకు పెట్టుకోలేదు.

## కోశాంబీ సూత్రీకరణ :

శైవ వైష్ణవవైషమ్యం వర్గవైషమ్యమని నిజమైన ప్రధానమైన పోరాటం పైనుంచి ఏర్పరచే ఫ్యూడలిజానికి దిగువనుంచి ఏర్పడే ఫ్యూడలిజానికి, మధ్యన అనికొశాంబి సూచించాడు 1956 లో. ఆసూచన కాకతీయ విజయనగర రాజ్యాలలోని మతపరిణామాలకు వర్తిస్తుందా ? అనగా గణపతిదేవుడాదిగాగల కాకతీయరాజుం ఆర్థికరాజకీయవ్యవస్థకు, కృష్ణదేవరాయలతో వైష్ణవరాజ్యంగా మారినహంపీరాజ్యల లోని ఆర్థికరాజకీయ వ్యవస్థకు అటువంటి తేడాఏమైనా వున్నదా? అవి కోశాంబీచెప్పి నట్టు ఫ్యూడలిజంలో భిన్నదశలను తార్కాణిస్తున్నావా ? కొండవీటి రెడ్డిరాజ్యం శైవం నుండి వైష్ణవంలోకి మారుతూవచ్చింది. కోరుకొండ, కందుకూరురెడ్లు మరీ వైష్ణవు లయ్యారు. ఈ మార్పులో కోశాంబి రుజువవుతున్నాడా? వేమన ఆరోజుల్లో మధుర, తంజావూర్ల శైవ వైష్ణవతగాదాల్లో కోశాంబి సూత్రీకరణ చెల్లుతుందా ? ఇటువంటి ప్రశ్నలను సమాలోచించాలిగదా :

స్మార్తమైనశైవాన్ని పాశుపతశైవం, అపాశుపతశైవాన్ని కులవ్యవస్థని కాదన్న వీరశైవం కబళించబోవటంలో ఫ్యూడలిజంయొక్క భిన్నరూపాల ఆవిష్కారమేనా ? దాని పరిధినిదాటే ప్రయత్నాలుకూడా కలిగాయా? – ఆలోచించాలిగదా !

## కులవ్యవస్థ-మార్పు :

పారిశ్రామిక విప్లవానికి ముందటిదశలో ఇండియాలో సరుకులఉత్పత్తి-అంగళ్ళ పెంపు-వర్తకాభివృద్ధి జరిగి కులవ్యవస్థాకాఠిన్యం సడలటంమాటగాని కులవ్యతిరేకోద్య

మాలమాటగాని, స్వయంసంపూర్ణగ్రామవ్యవస్థ సడలటంమాటగాని మార్క్స్ చెప్పలేదు. కోశాంబిచెప్పలేదు. స్వయంసంపూర్ణగ్రామవ్యవస్థే ఇండియాకు ప్రత్యేకమైనదనో అటువంటి ఫ్యూడల్‌కాలంలో సరుకుల ఉత్పత్తివ్యవస్థ ఏమీలేదన్నట్టు అదేదో 14, 15 శతాబ్దాల్లో పోర్చుగీసువారు పడమటితీరంలో విజయనగరం రాజ్యకాలంలోనో - ఆరంభమైనట్టు దానిఆరంభంతో కులవ్యవస్థ సడలవలసిన అవసరంఏర్పడినట్టు కులవ్యతిరేకోద్యమాలకు అవసరమైనట్టు ఊహాసౌధం ఒకటి నిర్మిస్తున్నారు. పెట్టుబడిదారీ వ్యవస్థా విస్తారానికేగాదు, దాని పూర్వదశఅయిన కొద్దిపాటి వ్యాపారాభివృద్ధికే కులంమీద దాడి ఆర్థికావసరమైనట్టు మనమిత్రులు ఉపన్యసించ నారంభించారు. దానికిచరిత్రనుంచి దాఖలాలుసేకరిస్తున్న దేమీలేదు. అదొకమార్క్సిస్టు డిడక్షన్‌గా వున్నది. భారత చరిత్రను "వీరి మార్క్సిజం" నుంచీ సృష్టిస్తున్నారు. కల్పిస్తున్నారు.

## దానాలు, దారిదోపిళ్ళు - వేమన, మార్క్సిజం

వేమన ఉన్నవాళ్ళను దానం చెయ్యమన్నాడు. ఆ దానంకూడా నాటి సాంఘిక చట్టంవల్ల బ్రాహ్మడికే యిస్తారు. బ్రాహ్మడు కాని వానికి దాన ధర్మాలు చెయ్యటం అప్పుడు చాలా తక్కువ. దానం దొరకనటువంటి దీనులు దుఃఖితులు దారిదోపిడీలు చేస్తే వేమనకు అభ్యంతరంవుంది. This cannot be tolerated అన్నారు జ్వాలాముఖి.

వేమన చెప్పిన ఆర్థిక విప్లవానికి, వీరి ఆర్థిక విప్లవానికీ తేడా యిక్కడ వుంది. వేమన విప్లవం నైతిక చేతనలో, మానవ కారుణ్యంలో పుట్టింది. అంతవరకే పరిమితమయింది. నైతిక చేతన పునాదిగా, అడుసుగా ఆర్థిక పునర్వ్యవస్థీకరణను, సంపద పునర్విభజనను అతడు కోరవలసి వచ్చింది. సంఘంలోని దారిద్ర్యానికి చలించిపోయి, దాన్ని తీర్చడానికిగాను ఏమార్గమైనాసరే అవలంబించమని చెప్పి చేయించినవాడు, ఆ దారిద్ర్యబాధితులే దారిదోపిడీవృత్తికి తలపడితేమాత్రం అభ్యంతరమన్నాడని - కథా విమర్శ కావచ్చు. కాని జ్వాలాముఖి చెప్పినట్టుగా దోపిడీలనుగూర్చి వేమన ఒక పద్యం చెప్పలేదు. పేదల్ని వధించి ఊళ్ళు దొంగిలించిన వారి దోపిడీని, బందిపోటునుగూర్చి మాత్రం చెప్పాడు.

> "పెక్కు జనుల గొట్టి పేదలవధియించి, డొక్కకొరకు నూళ్ళు దొంగిలించి
> ఎక్కడికిని పోవ నెరిగి యముడు చంపు — — — — — — — " అన్నాడు.

ఇందులో పేదల్ని, ప్రజల్ని కొట్టి చంపడం, దోచుకోవటం మాట వున్నది. డొక్క కొరకు బందిపోటు చేసేవారికి ఏది అనువు, వీలు అయితే అదే చేస్తారు.

-పేదలని కూడా వాళ్ళు వదలరు. పెద్దవాళ్ళ యిళ్ళకు బందోబస్తుపుంటే వీలుకాదు కాబట్టి పేదలనైనా కొట్టుకు తింటారు. ఈ పద్యంలో వున్నదిటువంటిది. మరో పద్యం వున్నదేమో, జ్వాలాముఖి చూపవచ్చు.

పెద్దవాళ్ళని కొట్టి పేదలకు పెట్టడం తాను చెప్పిందే. అదే సొంత పొట్ట కొరకు దొంగతనం వృత్తిగా అవలంబిస్తే వేమనకు మార్క్సిజానికీ అభ్యంతరమే. కానీ జ్వాలాముఖికి అభ్యంతరం లేదంటున్నారు. దారిదోపిడీ చర్యల్ని, వృత్తినీ విని, చూసీ ఉదాసీనంగా వుండడంకాదు, అందులో వార పట్టుబడితే, ఏదో పొట్టజరగక చేశారు. ఉదారంగా చూడమనటం కాదు - అంతకన్నా వారికి వేరొక దారి ఏదీ అని జరిగిపోయిన దానిని సమర్థించటమైనా కాదు. అలా చేయండని, అలా చేయడం పేదలకు నైసర్గిక హక్కు అని వక్కాణిస్తున్నారు జ్వాలాముఖి. ఇది తిరుగుబాటుకాదు, విప్లవం పక్కదార్లు పట్టడంగా వీరు భావించేట్టులేరు. ఎవరి వల్ల అన్యాయం జరిగిందో వారిమీద ప్రతీకారం ఏ రూపంలో తీసుకొన్నా తప్పుపట్టనివారుసైతం ఇటువంటి అరాచకాన్ని వ్యతిరేకిస్తారు. ఉదారుడైన భూస్వామిని వర్గశత్రువని నిర్మూలిస్తేనే లోకం హర్షించలేదు. మార్క్సిస్టులే హర్షించలేదు. జ్వాలాముఖే వ్యతిరేకించారు ఆ పనులు. అందులో కతినుల్ని చంపినా వ్యతిరేకించి వేరే సంఘం కూడా పెట్టినట్టు. ఇప్పుడు తన్నుతానే ఖండించుకొంటున్నారన్నమాట! ఇటువంటి అరాచకాన్ని, ప్రక్కదారినీ హక్కుగా చెప్పటం మార్క్సిజం కాదేమో. వర్గశత్రువులైన వ్యక్తులను దోచుకొని నిర్మూలించాలనే విధానం మార్క్సిజం కాదనుకొనేప్పుడు దారిదోపిడి పేదల నైసర్గికహక్కుగా మార్క్సిజం ఎలా అంగీకరించగలదు? అది అవినీతి, అపమార్గము అనికాదు మార్క్సిజం ఆ విధానాలను కాదనేది: అవి విప్లవ విజయానికి దారులు కావటంలేదని, ప్రక్కదారులు బట్టి పేదలు విప్లవాన్ని నెరవేర్చకపోతారని మాత్రమే. అంటే ఇక్కడ మార్క్సిజం నైతికమైన ప్రశ్నగా గాకుండా విప్లవ విజయానికి ఉపకరిస్తున్నదా, లేదా అనే దృష్టినుంచి చూస్తుంది. వేమన మాత్రం నైతిక పరిధిలోనిలిచి ప్రశ్నిస్తాడు. అదీ భేదం. ధర్మకన్నాలను చెప్పి చేయించిన వేమన దారిదోపిడిని నైసర్గిక హక్కుగా తిరస్కరించగలడు. ఇటువంటిది కూడా మార్క్సిజమే అనేవారు కొంపదీ ఉండటానికూడా విప్లవం వెనక్కుపోతుంది. ఎంత కాదన్నా, నీతిసులోచనాలను వదలుకోలేని విశాలప్రజదృష్టిలో మార్క్సిజానికి గౌరవ హాని కలుగుతుంటుంది.

వేమనకు విప్లవదృష్టి నీతి పరిధినుంచి కలిగినట్టిది. కాయకష్టంచేసి బ్రతకాలి. కష్టాన్ని ఒకరికి వదులుకోక - ఒకరికష్టాన్ని కోరవద్దు - కొల్లకొట్టవద్దు. యాచన అధమం. తాతతండ్రుల ఆస్తిమీద ఆధారపడటం ఇంకా అధమం - కూడనిపని. ఆస్తి గౌరసత్వంకూడదు. కష్టపడు - తిను - మిగుల్చు - మిగిల్చి ఒకడికి ఆపదలో పెట్టు -

కడకు మిగల్చకు - సంతానానికని మిగల్చకు. ఇదీ అతని నైతికవాదసరళి - హేతువాద సరళి. దీనికి భిన్నమైనదంతా కలుషితార్జనము. కలుషితార్జనాలక్రింద కలవారు చేసే దోపిడీ రూపాలను అఖండంగా ఎత్తిచూపించి నిరసిస్తాడు. లేనివారిలోనూ కాయకష్టం మాని, సొంతగడనమాని బ్రతుకు పోసుకోవడాన్ని కూడా నిరసిస్తాడు. నమ్మబలికి అప్పు తీసుకొని ఎగబెట్టడం పేదలలోకూడా వున్నదన్నాడు : యాచనను నిరసించాడు. ఒకే కొలబద్దతో యిరుపక్షాల తప్పుల్ని ఎన్నికచేయగలుగుతున్నాడు. శ్రమసర్వానికి మూలమన్న తత్వంలో అవలంబించే వైఖరి ఇది.

## పేదలకే దానమన్నవాడు వేమన్నే

బ్రాహ్మడికే అతడు చెప్పేదానం దొరుకుతుందనేమాట : కాని, దాన పాత్రతను చెప్పడంలో వేమన మతస్థులందరికన్నా విశిష్టుడు. మతప్రసక్తిలేకుండా, దోషాదోష ప్రసక్తిలేకుండా కూడా పేదతనమే దానయోగ్యతగా చూచి దానం చెయ్యమన్నాడు. దోసకారియైన దూసరిదైన, పతితుడైన వేదబాహ్యుడైన, పట్టి పేదవాని కీదగునీవి, విశ్వ - - అన్నదాతని బోధ. అయ్యవార్లకు, జంగాలకు, వైదికులకు మాత్రమే దానం యిచ్చే రోజుల్లో వేమన ఇలా చెప్పడం ఎంతో గొప్పా కదా ! అతని ప్రత్యేకతకదా ! అతని ప్రబోధం వల్ల దానం చేద్దామని మనసు పుట్టిన మల్లీవాడు, ఆ దానం మాత్రం బ్రాహ్మడికే యిద్దామని పరిమిత పరచుకొంటే, ఆ తప్పు వేమనదవుతుందా ? అట్టివాడు వేమన అనుయాయికాగల్గుతాడా?

## వేమన - గాంధీ - ధర్మకర్తృత్వ సిద్ధాంతం :

ఉన్నవారిని దానాలు చెయ్యమనటం గాంధీగారి ధర్మకర్తృత్వ సిద్ధాంతంగా కనిపించిందట జ్వాలాముఖిగారికి ? అన్నిటికంటే వేమనలో అదే ప్రశ్నార్థకంగా భావించారట వారు. వారికది ప్రశ్నార్థకమయిందేమో, దానాలు చెయ్యమనటం గాంధీగారి ధర్మకర్తృత్వ సిద్ధాంతంగా కన్పించిందన్న తర్వాత వీరి సిద్ధాంతపరిజ్ఞానం పెద్ద ప్రశ్నార్థకమై కూర్చున్నది నాలో. గాంధీగారు దానప్రబోధం చెయ్యలేదు ధర్మకర్తృత్వ సిద్ధాంతంద్వారా. 'ఇంతకంటే పరిమితికి మించినటువంటి ఆస్తిని మీరుంచుకోవటానికి వీల్లేదు' అని ధనికులకు నిర్దేశించలేదు గాంధీగారు. వేమన నిర్దేశించినట్లు జ్వాలాముఖి చెప్తున్నారు. అది వారి పరిశోధనకావచ్చు - నాకు కన్పించ లేదు.

అయినా ఆస్తి సంబంధాల్లో మార్పు ఏమీ కోరలేరంటారు. అపరిమితమైన ఆస్తికి ధర్మకర్తలుగా శ్రీమంతులు వ్యవహరించాలన్నది ధర్మకర్తృత్వ సిద్ధాంతం. సొంత వ్యయాన్ని తగ్గించుకోవాలన్నారు గాని ఆస్తికి పరిమితి చెప్పలేదు. తత్వవిషయాలు అర్థంగాకపోవచ్చుగాని ఆర్థిక రాజకీయ సాంఘిక సిద్ధాంతాలు అర్థంకావచ్చును కొన్నాను. అవి ప్రశ్నార్థకంలో పడుతున్నాయి మరి.

ఆనాటి సంఘంలో విప్లవం లేచి కలవాళ్లు మునిగిపోనుంటే, వేమన బయల్దేరి వారి నుద్ధరించడానికి, కాపాడడానికి తన సిద్ధాంతాన్ని – అందులో దానప్రబోధం–చెప్ప లేదు. గాంధీగారు మాత్రం సోషలిస్టు కమ్యూనిస్టుల హింసామయమైన ఆస్తిస్వాధీన చర్యలనుండి కాపాడుకొనడానికైనా, మీ ఆస్తులను మీవే అనుకోక, ప్రజల ఆస్తులని, వానికి ధర్మకర్తలం మాత్రమేననుకొని, ఆ ధర్మకర్తృత్వపు మానేజిమెంటుకు తగు మాత్రమైన ప్రతిఫలంగా కొంతే అనుభవించాలి, స్వంత వ్యయం తగ్గించుకోవాలి, పని చెయ్యాలి అని చెప్పారు. వేమననాడు పేదలు తిరగబడలేదు, కలవాళ్ళకు గుండె బెదురుగా తయారుకాలేదు. జరుగుతున్న, జరగనున్న విప్లవానికి ప్రతీఘాతంగా వేమన దానప్రబోధం పుట్టలేదు– పనిచెయ్యలేదు. పేదల నిస్సహాయస్థితిలో వెలువడిన ప్రబోధ మది– అందులో విశేషమేమిటోకూడా– కుతూహలకరమైనదేమిటోకూడా– అసాధారణ మైనదేమిటోకూడా చెప్పాను పుస్తకంలో. ఏవిధంగాచూచినా గాంధీగారి ధర్మకర్తృత్వ సిద్ధాంతంతో వేమన దానప్రబోధం పోల్చరానిది.

ఉన్నవాళ్ళనే దానం చెయ్యమనలేదు. పేదవాళ్ళనీ, చిన్నవాళ్ళనీ, కడకు అడు క్కొనే బిచ్చగాణ్ణికూడా తిరిగి దానం చెయ్యమన్నాడు వేమన – ఉన్నదానిలోనే, అడు క్కొన్నదానిలోనే దానం చెయ్యి – రేపటికి మళ్ళీ సంపాదించుకో – సంపాదించింది కొడు కులకు మిగల్చకుండా దానం చేసేసి వెళ్ళిపో. ఆస్తి కొడుకులకే యివ్వొద్దు అన్నదాతని దానసిద్ధాంతం– ఇదేనా గాంధీగారి ధర్మకర్తృత్వ సిద్ధాంతం.

'వేమన లేనివాళ్ళను ఈసడించాడు' అన్నారు జ్వాలాముఖి. అది సర్వం కల్ల. పులిమీదపుట్ర. అదేదో ఉదాహరించవచ్చు ఇప్పటికైనా. వేమన లేనివాళ్ళను ఈసడించ లేదు. ఈసడించలేదు.

అయినా ఆస్తి సంబంధాల్లో మార్పు ఏమీ కోరలేరంటారు. అపరిమితమైన ఆస్తికి ధర్మకర్తలుగా శ్రీమంతులు వ్యవహరించాలన్నది ధర్మకర్తృత్వ సిద్ధాంతం. సొంత వ్యయాన్ని తగ్గించుకోవాలన్నారు గాని ఆస్తికి పరిమితి చెప్పలేదు. తత్వవిషయాలు అర్థంగాకపోవచ్చుగాని ఆర్థిక రాజకీయ సాంఘిక సిద్ధాంతాలు అర్థంకావచ్చను కొన్నాను. అవి ప్రశ్నార్థకంలో పడుతున్నాయి మరి.

ఆనాటి సంఘంలో విప్లవం లేచి కలవాళ్లు మునిగిపోనుంటే, వేమన బయల్దేరి వారి నుద్ధరించడానికి, కాపాడడానికి తన సిద్ధాంతాన్ని – అందులో దానప్రబోధం–చెప్ప లేదు. గాంధీగారు మాత్రం సోషలిస్టు కమ్యూనిష్టుల హింసామయమైన ఆస్తిస్వాధీన చర్యలనుండి కాపాడుకొనడానికైనా, మీ ఆస్తులను మీవే అనుకోక, ప్రజల ఆస్తులని, వానికి ధర్మకర్తలం మాత్రమేననుకొని, ఆ ధర్మకర్తృత్వపు మానేజిమెంటుకు తగు మాత్రమైన ప్రతిఫలంగా కొంతే అనుభవించాలి, స్వంత వ్యయం తగ్గించుకోవాలి, పని చెయ్యాలి అని చెప్పారు. వేమననాడు పేదలు తిరగబడలేదు, కలవాళ్ళకు గుండె బెదురుగా తయారుకాలేదు. జరుగుతున్న, జరగనున్న విప్లవానికి ప్రతీఘాతంగా వేమన దానప్రబోధం పుట్టలేదు_ పనిచెయ్యలేదు. పేదల నిస్సహాయస్థితిలో వెలువడిన ప్రబోధ మది_ అందులో విశేషమేమిటోకూడా_ కుతూహలకరమైనదేమిటోకూడా_ అసాధారణ మైనదేమిటోకూడా చెప్పాను పుస్తకంలో. ఏవిధంగాచూచినా గాంధీగారి ధర్మకర్తృత్వ సిద్ధాంతంతో వేమన దానప్రబోధం పోల్చరానిది.

ఉన్నవాళ్ళనే దానం చెయ్యమనలేదు. పేదవాళ్ళనీ, చిన్నవాళ్ళనీ, కడకు అడు క్కొనే బిచ్చగాణ్నికూడా తిరిగి దానం చెయ్యమన్నాడు వేమన – ఉన్నదానిలోనే, అడు క్కొన్నదానిలోనే దానం చెయ్యి – రేపటికి మళ్ళీ సంపాదించుకో – సంపాదించింది కొడు కులకు మిగల్చకుండా దానం చేసేసి వెళ్ళిపో. ఆస్తి కొడుకులకే యివ్వొద్దు అన్నదాతని దానసిద్ధాంతం– ఇదేనా గాంధీగారి ధర్మకర్తృత్వ సిద్ధాంతం.

'వేమన లేనివాళ్ళను ఈసడించాడు' అన్నారు జ్వాలాముఖి. అది సర్వం కల్ల. పులిమీదపుట్ర. అదేదో ఉదాహరించవచ్చు ఇప్పటికైనా. వేమన లేనివాళ్ళను ఈసడించ లేదు. ఈసడించలేదు.

పాటు. ఆ నమ్మకాలు లేకపోయినా అటువంటి దాన ప్రబోధం యిప్పటికీ పని చేస్తుందని వెంకటేశ్వర్రావు అనుకొంటున్నాడన్నప్పటికీ తప్పే. వేమన ఆలోచనని - ఆనాటి పరిమితుల్లో మెరుగనిపించి ఈనాటికి పనికిరానిదివుంది. ఈనాటికి తీసుకోవాల్సిందీ వుంది. అదేమిటోకూడా ముందే మనవి చేశాను.

మార్క్సిస్టు అంచనాలు చారిత్రకభౌతిక వాదదృష్టి అలవడితే, వేమన శ్రామికవర్గం అంతిమ విజయం కోరలేదని - వ్యక్తి ఆస్తిలోబేసిక్ మార్పును కోరలేదని మాట్లాడటం సంభవిస్తుందా ? ఆలోచించండి.

అందరికీ రిఫరెన్సుకు పనికివచ్చేవాణ్ని గూర్చి జాగ్రత్త పడాలి- అటు బిర్లా కూడా కోట్ చేస్తే, పంచాయితీ ఆఫీసులో అంజయ్య ప్రభుత్వం వేమన పెట్టిచెయ్యరా దన్నాడని బోర్డులుపెట్టి ఇందిరాగాంధీగారి యిరవైపాయింట్ల ప్రోగ్రాంను ప్రచారంచేస్తే ఇంకేముంది ? మనం మిగలము- వేమనను ప్రభుత్వం జాతీయం చెయ్యబోతుందని బూచి నొకదాన్ని చూచి, చూపిస్తున్నారు.

వీరేశలింగం, గురజాడలను కాంగ్రెస్ ప్రభుత్వం ఎప్పుడో జాతీయం చేసింది. అలాగని, వీరు వదలలేదు- మునిగిపోలేదు. వారు ఒక పంపింగుస్కీము సందర్భంలో కోట్ చెయ్యటం నాకు తెలుసు- కోపరేషన్ + ఎలెక్ట్రిసిటీ = సోషలిజం అన్నవాక్యం కరపత్రంపాటి చిన్నపుస్తకం ముఖపత్రంమీద వెయ్యడం నేనెరుగుదును. మావోను సర్వోదయంవారు గాంధీగారితో కలిపారు. ఏమయింది? ఏం జేస్తారు? అంజయ్యగారు- ఇందిరాగాంధీ ఇరవైసూత్రాల ప్రచారంలో వేమననుపయోగిస్తారు. ఉపయోగించరాదా ? ఫ్యూడల్ అవశేషాలను పెల్లగించడానికి వేమనసూక్తి ఉపయోగపడితే విప్లవకారుడు మునిగిపోతాడా ? ప్రభుత్వాలు ఇటువంటి మంచిపనులేమీ చెయ్యకుండా వుండాలిని, వుంటేనే విప్లవం సుగమమవుతుందనీ- ఇదేనా ఆలోచన? పోనీ, దయ్యాలు వేదాలను వల్లిస్తాయిగదా ? అలా జరగడంకూడా సహజమే. దాన్నంతటినీ పోరాడుకొంటూ రావాలిగాని, అంజయ్యగారికి ఉపయోగపడకుండా వేమన మాట్లాడివుండాల్సిందంటే, అదేమిమాట. వర్గస్వార్థం ఎంత వక్రీకరణనైనా చేయిస్తుందని చెప్పేవారేనా యిలా మాట్లాడేది ? మార్క్సును మార్క్సుకు వ్యతిరేకంగా చూపుతున్నారు. యువక మార్క్సును పెద్దమార్క్సుకు వ్యతిరేకంగా చూపించిన ప్రయత్నం ఇంకా సాగుతోనే వుంది గదా.

పీఠికలో పుస్తకంలో నలభై పేజీల్లో చెప్పిన వేమన ఆర్థిక సిద్ధాంతాన్ని- అందు లోని ప్రధానాంశాల్ని - వూసెత్తకుండా దాటించేసి, దానధర్మాల మాటొకటి తెచ్చి,

అందులో అతన్ని అందరివంతువాడిగా అపచిత్రణంచేసి, దానధర్మాలమీద నిత్యంచేసే మార్క్సిస్టు దైనిక విమర్శకు పాల్పడి వేమనను ఎలా క్రిందికిలాగాలా అని పనిగట్టు కొని స్థాయితక్కువ ప్రసంగాలు చారిత్రక భౌతికవాదంపేర చేయడం శోచనీయం. ఎంగెల్సు తమ పూర్వుల్ని ఎలా అంచనావేశాడో తెలుసుకొనగలిగితే – వేమన ఆర్థికదృష్టిని మెచ్చుకోవాల్సివస్తారు.

అదంతా ఎఱిగి, అలా ఎదిగి వేమన ఆర్థిక చింతనాపరత్వాన్ని ఆహ్వానించ మంటున్నాను. తెలిసిన ప్రతిపక్షం వలన కంటే, తెలియని అనుచరుల వల్లనే ప్రవక్త లకు పెద్ద ప్రమాదం అన్నమాటను ధ్రువపరచకుంటే చాలు.

చదివితే చాలదు. చదివితే అర్థమయ్యేదాకా చదవాలి. సంశయాలు తెగేదాకా చదవాలి. ఒకరినడిగి సంశయాలు తెంచుకోవాలి. సంశయాలతో వేదికమీద వాది కారాదు; వాగాడంబరంచేసి సుఖములేదు. అభిప్రాయభేదం అనడానికిముందు పూర్వ రంగం వుంటుంది.

ఔనటంచు నొక్కడాడిన మాటకు, కాదటంచు బలుక క్షణముపట్టు
దాని నిలుపదీయ తాతలు దిగివచ్చు విశ్వదాభిరామ వినురవేమ॥

అటువంటి పనిమాత్రమేదో కలిగిస్తున్నారు.

(జ్వాలాముఖిగారి "నేటికాలానికి వేమనఅవసరం" అనేప్రసంగంలో విషయాన్ని గూర్చి యీవ్యాసం ప్రధానంగా వెలువడింది.)

## కామెంట్సులేకుండా :

"ఆబాహ్యాచారాలు ఆవిధంగా రావడానికి....సాంఘికమైన ..రాజకీయమైన కారణాలేమిటి? ముఖ్యంగా ఉత్పత్తిసంబంధాల్లోవున్న మార్పుదశఏమిటి అన్నది వేమన గుర్తించలేదు. ఇంతకంటే మహామేధావిగా కనిపించిన కబీరుకూడా గుర్తించలేదు.

బ్రౌను మనల్ని దారితప్పించాడు ....వేమనకాలంలో....ఆనాటి మత సంఘటనలుకాదు, అవిజరగటానికి కావలసినటువంటి ఆర్థిక పునాదులు ఏమిటి ? రాజకీయకారణాలేమిటి ? ఈవిషయాన్ని వివేచించటంలో చెయ్యాల్సినంత ప్రయత్నం బ్రౌను చెయ్యలేదు."—జ్వాలాముఖి.

కబీరు,వేమనలు 15,17వ శతాబ్దాల్లోవాళ్లు. బ్రౌన్ 1829-39 సం॥రాల్లోవేమనను వెలువరించినవాడు. ఆర్థికపునాదులను అడిగే చారిత్రిక భౌతికవాదం కమ్యూనిస్టు మానిఫెస్టో 1848 తర్వాతవిషయం.

## 1970 లో వేమన
## రమణారెడ్డిగారిదృష్టిలో

స్వయంగా సాగుచేసుకొని, పంట పండించుకొంటూ, తన సర్వస్వానికిన్నీ నేలను నమ్ముకొనేవాడు ప్రతిఒక్కడూ కాపే. ఇలా చూస్తే, ఈమాట ఒక సాంఘిక స్థాయినీ, వర్గవిశేషాన్నీ తెలియచేస్తుంది. వేమన కలిగినవారింటపుట్టి కాలుమీదకాలు వేసుక్కూర్చున్నవాడు కాదనేందుకు చెట్టు చేమలతోటీ, పైరుపంటలతోటీ, సంసార కష్ట సుఖాలతోటీ పైరు పంటలతోటీ అతనికిగల స్వానుభవంతో కూడిన గాఢమైన పరిచయమే సాక్ష్యం చెబుతుంది.

ఒరులకొరకు భూమినొరచెటివారును, అవని పతికి వశ్యులైనవారు
పాలవంటివారు పన్నుబెట్టెడివారు వాకెరుగరు కాపువారు వేమ॥

ఈ పద్యం వేమనదే అయినపక్షంలో, అది వేమన సానుభూతి తనవారికెలా సమర్పితమయిందో తెలుపుతూంది. వారి చిత్తశుద్ధి గురించి ప్రశంస ఒకవైపూ, వారి శరీరకష్టం గురించి నిట్టూర్పుతో గూడిన బాధ మరొకవైపూ జమిలిగా వెలువడతాయి. తమ కష్టఫలం పూర్తిగా తమకు దక్కుబాటుకావడంలేదనే విషయం 'ఒరుల కొరకు' లో సూచనగా కనిపిస్తుంది. అయినా దక్కిందే బొక్కుడన్నట్లుగా, చివరకు తమవంతుగా మిగిలిన ధాన్యాన్నే నమ్ముకొని బతికే సన్నకారు జనానికి,

వెలయ భూమితల్లి, విత్తనమటుతండ్రి, పంటలరయ సుతులు, పాడిపరము'
ధర్మము తనపాలి దైవము, విశ్వదాభిరామ వినురవేమ ॥

వ్యావసాయకుల భావసీమను ఇంతకంటె విపులంగా వివరంగా వ్యాఖ్యానించ నక్కరలేదన్నట్టుగా గుంభనగాసాగే కాపుల కాపురాల మితులనూ పద్ధతులనూ ఇది క్లుప్తంగా చెప్పగలిగింది. 'అప్పు లేనివాడు అధిక సంపన్నుడే' అనడంలోనూ కాపు వాని దృష్టే వేమనది. అక్రమార్జన చేసి కూడబెట్టవలెననే కోమటిదృష్టికాదు. 'ఎదుటివారిసొమ్ము ఎంతవారికి తీపి' అనడము ఇలాంటిదే. దారులు డొంకలూ అడ్డగించి కలుపుకొనే బలియుల దౌర్జన్యాలనుకూడా వేమన ప్రస్తావించాడు.

కరువు రోజుల్లో కడుపాకలితో కటకటలాడే పేదసాదలకు తాను చేసిన ఉపదేశం, కందమూలాలూ కాయకసర్లూ కర్ర పెండలాలూ తిని ఎలాగో ఓలాగు ప్రాణాలు నిలుపుకొమ్మనికాదు. కష్టాలన్నింటినీ ఒక్కపెట్టున తుదముట్టించుకొనేందుకు విషపదార్థాన్ని దేనినయినా ఆరగించమని మాత్రమే ( ॥ । )

గ్రామకరణాలకూ కాపులకూ మధ్య నుండవలసిన ఒద్దికకూడా వేమన చూపు నుంచీ తప్పిపోలేదు. ఆ రోజుల్లో రాజులమని పేరుబెట్టుకొని రాక్షసంగా పరిపాలిస్తూ వచ్చిన దుష్టప్రభువులను విడిచిపెట్టలేదు.

కొండముచ్చుకెన్న కోతిపేరంటాలు, బడుగుదొరకు మంత్రి బండవాడు
బండవాని కరయ కొండీడు చుట్టంబు, విశ్వ - - - - - - - -

వేమన పద్యాలు అన్నీ ఒక్కమారు చెప్పినవికావు. లౌకిక జంజాటనలు పూర్తిగావదలని దశలోనే లోకవ్యవహారాలను గురించి నిష్ఠురంగా నిందామయంగా ఇలాంటివి చెప్పివుండవచ్చు. అయితే తర్వాతి దశలోవి వచ్చి వీటిని కొట్టివెయ్యవు.

తిండిపోతులూ సోమరులూ అతనిగౌరవానికి యోగ్యులుకారు. దుక్కిముచ్చులూ దొంగలూ 'కొర్తి' ఎక్కవలసిందే. 'వెక్కలికాండ్రు' దూరుపడవలసిందే. బడుగు దొరలూ వాళ్ళహంగుదార్లూ బండవాళ్ళుగా కనిపించవలసిందే.

(1970, జమీన్ రైతు ఉగాది సంచిక - 'వేమన కవిత్వం'నుంచీ)
—కొట్టివెయ్యవు అని అప్పుడు అన్నారేగాని, రెడ్డిగారు
1980 సరికి విరసంవారి విశ్లేషణలో పడి కొట్టివేసినట్లే వ్రాశారేమో.

## 1980 లో వేమన
## విరసంవారి విశ్లేషణలో

—వేమనగాని బ్రహ్మంగారుగాని సులభశైలిలో పామరులకు తత్త్వబోధనచేశారు. వారి ప్రధానోద్దేశం జీవన్ముక్తి. వారు యథాశక్తి యోగులు. సంఘ సంస్కరణకు సంకల్ప పూర్వకంగా పూనుకొన్నవారు కారు. అయితే సంఘంలో వ్యాపించిన రకరకాల చెడుగులను వేమన చాలా కరుకుగా విమర్శించాడు. (పేజీ - 21 డా. రామకృష్ణ, రమణారెడ్డి.)

—మధ్యయుగాంతములో వేమన అన్ని కులాలనూ, అన్ని మూఢవిశ్వాసాలను ఖండించి, హేళనచేసి చివరకు చూపించింది జ్ఞానమార్గము. అయితే యీ వ్యక్తుల ఉద్యమాల ఫలితంగా కులవ్యవస్థగానీ, భూస్వామ్యంగాని, మతంగానీ, చెక్కు చెదరలేదు - (పేజీ 49. డా. రామకృష్ణ, రమణారెడ్డి.)

[ప్రజాస్వామిక సంస్కృతి (కందుకూరి గురజాడల దోహదం) సొసైటీ ఫర్ సోషల్ ఛేంజ్ - కావలి ప్రచురణ.]

—నిజానికి వేమన కవిగా గొప్ప చేయదగినవాడు కాడు.

—వేమన చెప్పిన తిరుగుబాటు చాలా గొప్పదనటం Fantastic. వేమన బలం ఆయన సాంఘిక దృక్పథంలోవున్నది - పేజీ 3 'ఉపోద్ఘాతంమారుగా' - కొడవటిగంటి.

—వేమన కవిత్వం విలువ అంతా సామాజిక దృక్పథంమీద ఆధారపడివున్నది - పేజీ 7. వీరేశలింగం, అప్పారావుగార్ల సేవకన్నా వేమన చేసిన సేవ ఎక్కువైన దనటం అర్థంలేని మాట - ('ప్రజాస్వామిక పరిష్కారంగురించి' పేజీ 5 కొడవటిగంటీ, చలసాని ప్రసాదులు.)

## కొల్లావారి విశ్లేషణలో —

వీరి ఈ మాటలకు నిమిత్తకారణులు శ్రీ కొల్లావెంకయ్యగారు. వారి 'దేశీయ భాషలూ, జాతుల సమస్య, ప్రజాస్వామిక పరిష్కారం, అన్న పుస్తకానికి విరసం వారి రీయాక్షన్ ఈ రూపం తీసుకొన్నది.

కందుకూరి - గురజాడలను కమ్యూనిష్టుపార్టీ వారు యుగపురుషులుగా నెల కొల్పడం 'వాస్తవాలతో నిమిత్తంలేని ప్రచారం'. వారు 'వలసపరిధికి లోబడిన సంస్కరణ కర్తలని, వారిది వలస పరిధికిలోనైన సంస్కృతి, యని శ్రీ శ్రీ 'గురజాడ అప్పారావుని మహాకవిగా చిత్రించి వేమన సరసన నిలపడం తప్పిద మని - వేమన కవిత 'అభివృద్ధికరమైన సాహిత్యం' అని, వేమన మహాకవి అని, ప్రజాకవియని శ్రీ కొల్లావారి నిశ్చయం చేశారు.

కొల్లా శ్రీ శ్రీ లిద్దరికీ వేమన మహాకవే - ప్రజాకవే - వేమన వరకు వారికి ఏకీభావమే. కందుకూరి గురజాడ విషయంలోనే భేదాభిప్రాయం. 'కందుకూరి, గురజాడ, గిడుగులను అంతతేలికగా కొట్టిపారెయ్యలేము, ఆనాడు వారు చేసిన కృషివల్ల సామ్యవాద విప్లవం ఒక అడుగు ముందుకువేసిందనే చెప్పాలి' అని బలపరచుకొన్నారే గాని శ్రీ శ్రీ వేమన సైజుక త్తిరించే పనికి దిగలేదు.

కొల్లావారు కందుకూరి - గురజాడలను క్రిందికి గుంజినందుకు ప్రతిగా శ్రీ శ్రీ వినా తక్కిన విరసం వారు వేమనను క్రిందికిలాగారు. రామకృష్ణ, రమణారెడ్డి, కొడవగంటి, చలసానీ వేమన మహాకవి కాడు, వేమన తిరుగుబాటు గొప్పదికాదు అనేంత వరకూ వెళ్ళారు. అంతవరకూ వారి నలుగురికీ ఏకాభిప్రాయమే. వేమన బలం, వేమన కవిత్వంవిలువ అంతా అతని సామాజికదృక్పథంమీద ఆధారపడి వుందనడంతో చలసానీ, కొడవటిగంటీ ఆగితే, ఆ సంఘసంస్కరణకు కూడా వేమన వీరబ్రహ్మాలు సంకల్ప పూర్వకంగా పూనుకొన్నవారుకారు అన్నంతవరకూ రామకృష్ణా రమణారెడ్డి గారలు సంకోచించకుండా తీర్మానం చేశారు. వేమనకు సంకల్పలోపం! సంస్కరణ లోపం!! వారేమైనా అనగలరు, నిరూపణలేకుండా.

కొల్లావారు కందుకూరి గురజాడలు యుగపురుషులు గారనడానికి, 'వారు ప్రబోధించిన సంస్కృతి విప్లవకరమైనదికాదు' అని చాలా సాక్ష్యం, సమాచారం యిచ్చి నిరూపించ యత్నించారు. వేమన పైన ఇంతింతమాటలు విసిరేసినవీరు, ఈ విసుర్లువినా ఏ విధంగానూ ఆధారాలు చూపలేదు, చూపాలని యత్నించలేదు. ఖండనకు పూనుకొన్నప్పటి కర్తవ్యం కరణీయం తెలిసినవారేగాని, అది ఇక్కడ లోపించింది. నిర్ణయాల బాగోగులు తప్పొప్పులమాట తర్వాతగాని, వాదధర్మమే వదలి మెదలు తున్నారంటే ఏమనేట్టు మరి! కందుకూరి గురజాడల పక్షాన డిఫెన్సు సాక్ష్యం పోగుజేసినట్టు వేమనపై అభియోగమేగాని ఏం సాక్ష్యం పోగుజేశారు వీరు ? నిర్నిరూపణము నిస్సమాచారము అయిన అభియోగమే గదా వేమనమీద వీరు చేసిన పని. ఇదెంతో పేలవంగానూ, పేదరికంగానూ ఉన్నది. ఇంత మంది అధ్యాపకులు పఠన పాఠనమే, రచనమే, వృత్తిగాబెట్టుకొన్నవారు, పరిశోధనలో సాహిత్య వాదోప వాదాల్లో గడితేరిన వారు చేసే ఖండనా నిర్వహణమేనాఇది ?

కందుకూరి-గురజాడల యుగపురుషత్వాన్ని, వారి వారి మహాకవిప్రజాకవిప్రతి పత్తులను నిలబెట్టడానికిగాను ఏఔదార్యాన్ని సహిష్ణుతను, ఏసానుభూతి పూర్వకావ గాహనలను 'చారిత్రకనేపథ్యం' పేర 'రాజకీయ చైతన్యం' పేర 'ఆనాటిపరిమితులపేర' చూపారో అటువంటి వ్యతిరేకతారహితమైన అవగాహనతోనే వేమనను కూడా చూడాలి గదా ? అందరినీ ఒకేత్రాసులో తుయ్యాలిగదా ? ఈ యుగపురుషులపట్ల చూపిన అవగాహనా ప్రమాణాలతోనే వేమనను కొలిస్తే అతడొక ఎవరెస్టుగా ఎదిగిపోడా ?

అసలింతకూ వీరియుగపురుషత్వస్థాపనకు సంరక్షకు వేమనమీద దాడి చెయ్య వలసియున్నదా ? దాడిచేస్తే యింత నిర్బాధ్యతగానా ?

ఇప్పటికైనా మించిపోయిందిలేదు. వేమనమీద యీ విరసంవారి యీతీర్పులు సూత్రీకరణలు పరిశోధనా పూర్వకాలే, ప్రత్యేకపరిశీలనా ఫలాలే, గాఢచింతనా పర్యవ సానాలే అయివున్నట్లయితే ఆపరిశోధనను ఆఆకరాలను ఆవాదనను వెంటనేప్రచురించి వేమనకు వెలకట్టడానికి ఒక National Debateగా నిర్వహించమని మనవిచేస్తున్నాను. ఈ పుస్తకం కడముట్టాచదివి యీ విరసం మిత్రుల వేమనమీదివిమర్శలకు ఇంకా సమాధానం కావలసివుందని పాఠకమిత్రులు భావిస్తే అప్పుడింకా చెప్పుకోవచ్చుననుకొంటాను.

వేమనబలం ఆయన సాంఘికదృక్పథంలోను, సామాజిక దృక్పథంమీదను నిలిచి వుందన్నారుగదావీరు. అతని ఆర్థికదృష్టి వీరికి తగ్గలేదన్నమాటేగదా? అదే వేమన పరిశోధనలో అందరి Blind spot అన్నాను.

అసలింకోవిషయం- వేమనమీద కొల్లావారెంతో వ్రాశారనికాదు. చాలాకొంచెం వ్రాశారు. అది పేజీన్నరపాటికాదు. కాని ఆకొంచెంలోనే అతనిలో ఆర్థికకోణాన్ని పసికట్టారు. నాటిదశలో కొత్తధోరణిని "బయటపెట్టు ధనికులకు అడుగులకుమడుగులొత్తేవారిగుట్టును రట్టుచేశాడు" అంటూ ఉదాహరించారు; వివరించారుకొంచెం. ఈవిషయాన్నైనా విరసం సాహిత్యసారధులుకానలేదు. ఖండనకు తీసుకోలేదు.

వేమన వీరబ్రహ్మేలవంటి వ్యక్తుల ఉద్యమాలకు భూస్వామ్యవ్యవస్థ చెక్కుచెదరలేదని వారిసాఫల్య వైఫల్యాల మాటకూడ విమర్శలోకి తెస్తుంటే నవ్వొస్తోంది. కొంచెం ఆత్మవిమర్శా స్ఫురణతో వ్రాయాల్సిన భాగంగదా అనుకొని.

వేమనను, తిరువళ్ళువరును భక్తిలోబెట్టేస్తున్నా (మధ్వరామానుజుల్ని జ్ఞానమార్గంలో అవతలవారు చెప్పినట్లే) నామదేవు కబీరు ఎక్సెట్రాలకు వెయ్యిపన్నెండు వందలేండ్లముందెప్పుడో వున్నవళ్లువరును, వీరితోకలుపుతున్నప్పటికీ "భక్తివుద్యమం ఇస్లాంతాకిడివల్ల హిందూమతం తొడిగిన ఒకానొకరెమ్మ" అన్నారు రెడ్డిగారు రామకృష్ణగారు! ఈ భక్తివుద్యమంలోని వాళ్ళెవరూ వేమనబుజాలదగ్గరకుగారని రారని కానకపోయినా, సామాజికార్థికవీక్ష' తత్సమస్యాప్రాధాన్యం వేమనను వారినుండి మౌలికంగా విడదీసి విశిష్టుణ్ణిజేస్తుందని ఎరగక పోయినా, విప్లవ వారసత్వాన్ని వేమనునుంచి చెప్పుకోవాలని గుర్తించినందుకు కొల్లావారికి రెడ్‌శాల్యూట్ చెయ్యాల్సిందే.

["విశ్వదాభిరామవినురవేమ" అనే గ్రంధపీఠిక ఆధారంగా]

## వేమన వ్యాపారస్తుల కవి ! ! !

"వేమనప్రజాకవికాడు. వ్యాపారస్తులకవి. వేమనకవిత్వానికి ప్రధానప్రేరణవర్తక వర్గమే. వర్ణవ్యవస్థని వ్యతిరేకించటం, పురోహిత సంస్కృతిని పరిహసించంటం ఏవర్గాలప్రయోజనాలకు దగ్గరగా వుంది" అని ప్రశ్నించి, "వర్తకవర్గాలకు దగ్గరగా వుందని అయితే వర్తకవర్గం అప్పుడు ప్రగతిశీల వర్గమే"యని సిద్ధాంతం చేశారు.విప్లవ రచయితలసంఘం కార్యదర్శి శ్రీత్రిపురనేని మధుసూదన రావుగారు.

వీరు వేమన వర్ణవ్యవస్థను వ్యతిరేకించడంచూస్తున్నారు. పురోహితసంస్కృతిని అపహాళన చెయ్యడం చూస్తున్నారు. అంతే ఆపైన కానటంలేదు. అతని ఆర్థిక వివేచనను ఆనవాలుపట్టడంలేదు. అఖిలభారత రంగంమీద అతని ప్రత్యేకతఅయిన అతని ఆర్థికచేతన ఆర్థికసమస్యా ప్రాధాన్యవాదులకు అగోచర విషయమైనది.

వేమనఎక్కడగాని. ఏదశలోగాని పేదలకు వ్యతిరేకంగాకలవారి పక్షమై సిద్ధాంతించినపద్య మొక్కటిచెప్పలేదు. పేదరికంఎన్నడూ అతనిస్మరణనుంచితప్పలేదు. తాచకోలుఎప్పుడూ పేదలవేపే. ఉగ్రమార్గమూ వాళ్ళకొరకే. కాగితల్లారి తత్వబోధకుడై కలవారిపాలిటికి టూచిగాపునర్జన్మను చూపించడమూ పేదలకొరకే. అతను తప్పుదారిన పడినా పేదలకొరకే. కాదంటే చూవవచ్చు.

కులాన్నీ పురోహితసంస్కృతినీ పెట్టుబడిదారీవర్గమే ఎదిరిస్తుందా? 12 వశతాబ్దంలో వీరశైవంకులాన్నీ పురోహితసంస్కృతినీ కన్నడదేశంలో వ్యతిరేకించడం కమర్షియల్ బూర్జువావర్గంయత్నమేనా? వృత్తిపనివారి యత్నంకాదా? అసలు వానిని ఇప్పటి పారిశ్రామిక బూర్జువావర్గం ఎంతవ్యతిరేకిస్తున్నది? వేమనకులవ్యతిరేకత బూర్జువావర్గాల వ్యతిరేకతవంటిదేనా? మౌలికమైనభేదంలేదా?

కన్నడదేశంలో కులంమీద తిరుగుబాటు 12 వ శతాబ్దం అరవయ్యోపడిలో వీరశైవంద్వారా జరుగుతోంటే ఇంచుమించు మరోపదేళ్ళలోగా కులంమీద తిరగబడుతున్న వీరవైష్ణవంమీద, కులాన్నివెనుకవేసుకొని వీరశైవం పల్నాటిలోశంఖం పూరించింది. ఈతారతమ్యంఠ ఏఏవర్గాల ఘర్షణలోని తారతమ్యాన్ని తెలియజేస్తుందో మార్క్సిస్టులుపరిశీలనచేసి చెప్పవలసివున్నారు.

వ్యాపారస్తులకవి ప్రజాకవి ఎలాగూకాడు. కాని వీరి దృష్టిలో ప్రజలంటే, అప్పట్లో కూడా కూలిచేసే కార్మికులే. కనీసం డోపిడిచెయ్యని వాళ్ళకూడా ప్రజలలో భాగంకారు. అంటే స్వయానా యజమానులైన వృత్తిదార్లూ ప్రజలుకారు. ఇదేమి మార్క్సిజమో తెలియటంలేదు.

"In his sarcasm on the inequalities of material possession, he is no less radical and realistic than in his invectives against the disabilites engendered by caste distinctions" అని 1950 సరికే ప్రముఖ సాంస్కృతిక చరిత్రకారుడు, బెంగాలీ విద్వాంసుడు వినయకుమార్ సర్కార్ అనగా, ప్రాయగా విరసం వారికి మాత్రం వ్యాపారస్తులకవి, యధాశక్తి యోగి జీవన్ముక్తి బోధకుడు – సంఘ సంస్కరణా సంకల్పరహితుడైన సాంఘిక విమర్శకుడు మాత్రంగా కానవచ్చాడు వేమన.

## బట్టల పరిశ్రమ : వేమన

శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి

"వేమన ఏకాలంవాడో ఏ ప్రాంతంవాడో ఏ వృత్తివాడో నీకరంగా తేల్లేదు. - - - మన వస్త్రపరిశ్రమకు పశ్చిమదేశాల్లో మంచిగిరాకీవున్న రోజుల్లో

ఆ పరిశ్రమ అభివృద్ధిచెందడంకోసం అంతవరకు అడ్డుగోడలుగా వున్న కులాలమీద వస్త్రపరిశ్రమతో సంబంధంవున్న వారందరూ దాడి చేసిన వాళ్ళలో మనభాషలో వేమన అగ్రగణ్యుడు. కనక ఆయనకు ఆ పరిశ్రమతో ఏదో సంబంధం ఉండి ఉండవచ్చు"

(ఈ నాడు ఎడిటోరియల్ - 1981, ఏప్రిల్ 19)

వేమన కాల ప్రాంతాలనుగూర్చి వివాదంవుందిగాని, వృత్తినిగూర్చి వివాదం ఎక్కడుంది? లేనిదాన్ని వున్నట్టు వీరే ఈనాడులో సృష్టించి, చిత్రించి, వేమనను బట్టలపరిశ్రమలోవాణ్ణిగా ఒక వింతసుద్దిని – వివాదాస్పదమైన పరిశోధనా విషయాన్ని లక్షలాది సామాన్య పాఠకుల నుద్దేశించి వ్రాసే దినపత్రికా సంపాదకీయంలో వ్రాసి - చర్చకు స్థలంలేదని ఖండనాన్ని ప్రచురించక - యీ రచయితకో వుత్తరం రాశారు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారు.

"మీ విమర్శాలేఖలో బసవేశ్వరుని నాటినుంచి, అంటే పన్నెండో శతాబ్దంనాటి నుంచి కులాలమీద ఎందరో తిరుగుబాటు చేసినట్లు పేర్కొన్నారు. అలాంటి తిరుగు బాటుకి ఆధారమైన సామాజిక వాస్తవికత ఏమిటి? ఆర్థికాధారం ఏమిటి? - - - -

పన్నెండో శతాబ్దంనుంచే దక్షిణాదిని "సరుకు" ఉత్పత్తి బీజప్రాయంగా పుట్టింది. అది 14. 16 శతాబ్దాలమధ్య అంకురంగా పెరిగింది. 16-18 శతాబ్దాలమధ్య దాన్ని కొయ్య పావుకోళ్ళతో విదేశీయులు, స్వదేశీయులుకలసి తొక్కిపారేశారు. ఇతర వస్తువులు ఎన్ని ఉత్పత్తి అయినా అందులో వస్త్రోత్పత్తి ముఖ్యమయింది. ఇంగ్లాడులో పారిశ్రామిక ప్రగతికీ శ్రీకారం చుట్టింది కూడా" స్పిన్నింగ్‌జెన్నీ" అన్న విషయం మీకు గుర్తుండే వుంటుంది.

"గతితార్కిక, చారిత్రక భౌతికవాదాలు రెండూ రెండు కళ్ళుగా పెంచుకున్న నేను నా అవగాహనమేరకు అలాంటి అనుమానాన్ని వెలిబుచ్చాను. అది అనుమానమే గాని నా సిద్ధాంతీకరణగాదు. ఒకవేళ అది సిద్ధాంతీకరణలాగా అచ్చులో పడివుంటే అది నా పొరపాటని ఒప్పుకుంటాను. - - సుహృద్భావంతో అర్థంచేసుకోగలరని ఆశిస్తున్నాను.

భవదీయుడు,

"రాంభట్ల కృష్ణమూర్తి"

5_5_81

కులంమీదదాడి ఎప్పటిదయినా సరే 'సరుకు' వుత్పత్తి బీజప్రాయంగా అయినా వున్నట్టు కన్పించడం వీరికి తప్పనిసిరి. మార్క్సిజాన్ని ఆర్థికనియతివాదంగా జీర్ణం చేసుకొన్నదాని విషమఫలితంఅయింది.

మన వస్త్రపరిశ్రమకు పశ్చిమదేశాల్లో మంచి గిరాకీవున్నరోజులన్నవి 1500లలో వాస్కోడిగామా మనపడమటితీరంలో దిగినతర్వాత – అనగా 16 వ శతాబ్దం నుంచీ – ప్రత్యక్షంగా ఏర్పడింది. ఆపోర్చుగీసువారికి 1612 నుంచీ ఇంగ్లీషువాళ్ళూ, డచ్చివాళ్ళూ, ఫ్రెంచివాళ్ళూ పోటీదార్లుగా 17వ శతాబ్దంలోదిగారు. ఇంకా అప్పటికీ ఇంగ్లాండులో పారిశ్రామిక విప్లవం రాలేదు. ఆ పారిశ్రామిక విప్లవం 1760 తర్వాత కాలంలోని దానిగా చెప్తారు. అనగా అంతవరకూ మన బట్టకు పశ్చిమ దేశాల్లో గిరాకీవుంది. 16, 17 శతాబ్దాలు పూర్తిగానూ, 18వ శతాబ్దం సగానికి పైగానూ మన బట్టల పరిశ్రమకు మంచి గిరాకీవుంది. జోరుజోరుగా సాగింది.

ఈ గతితార్కిక చారిత్రక భౌతికవాద విశ్లేషణ ప్రకారం కులవ్యతిరేకోద్యమాల పుట్టుక – విజృంభణ యీ రెండున్నర శతాబ్దాల కాలంలో జరిగినవనాలి. ఎడిటోరియల్ లోని స్థితిఇది.

## విదేశీ మార్కెట్లకుముందే కులంమీదదాడి

కులవ్యతిరేకోద్యమాల ఉధృతమంతా పోర్చుగీసువాళ్ళు మన పడమటి తీరంలో అడుగుపెట్టేసరికే అయిపోయింది. కబీరుకూడా 15వ శతాబ్దంలోనివాడేగాని ఇంకా ఇవతలి వాడనే సిద్ధాంతాలు తలదించేసుకొన్నాయి. కర్నాటకంలో, ఆంధ్రలో, మహా రాష్ట్రలో – ఆ తర్వాత ఎప్పటికో ఉత్తరప్రదేశంరో – అన్నీ 15 వ శతాబ్దాంతం లోగానే లేచినై. మనబట్టకు గిరాకీ ఏర్పడకముందే లేచినై. ఇదీ వాస్తవమైన చరిత్ర.

పశ్చిమదేశాల్లో మన బట్టలకుబాగా గిరాకీ ఏర్పడినప్పుడు – 16–17 శతాబ్దాలలో – బట్టలనేతతో, అమ్మకంతో సంబంధంవున్న కులాలు, అందులోని మేధావులు కులవ్యవస్థమీద దాడిచేయాల్సివచ్చింది, దాడిచేశారు అనటం నిరాధారమైన సూత్రీకరణ – పశ్చిమదేశాల మార్కెట్టు మనకు బారంబాటగా తెరచుకోకముందెప్పుడో, బట్టల పరిశ్రమలో వాళ్ళెవ్వరూ ముందుకురాకుండానే ఇతరకులాలతోనే కులంమీదదాడి ఉవ్వెత్తుగాలేచింది. యుద్ధరూపం కూడా తీసుకున్నది. 11, 12, 13 శతాబ్దాల్లోనే కులం మీద దాడి వేడిగా వాడిగా సాగింది. 12వ శతాబ్దంలో వీరశైవ వీరవైష్ణవాలు కర్నాటకంలోనూ ఆంధ్రలోనూ కులాన్ని కూల్చవచ్చాయిగదా! బసవేశ్వరుడు బ్రహ్మ నాయుడు బట్టల పరిశ్రమలో వాళ్ళుగారు. వాళ్ళ అనుయాయుల్ని, అభిమాన పుత్రుల్ని ఆయాజాబితాల్లోవెదికితే వార్వెరూ నేతగాళ్ళుకారు – బట్టలమ్మకందార్లుకారు. బ్రహ్మన్న ఏడుకులాల సంతానంలో ఒక్కడూ నేతగాడుకాడు. బసవేశ్వరుని అనుచరులు నూట పద్దెనిమిదిమందిలోనూ నేతకులంలోని వారొక్కరూలేరు. 13వ శతాబ్దంనుంచే పండరీ పురం కేంద్రంగాలేచిన వార్కరీ సంప్రదాయంలో (రామకృష్ణహరి) నూ, అదేకాలంలో

లేచిన మహారాష్ట్రల మహానుభావ లేక జయకృష్ణ సంప్రదాయంలోని అనేకకానేక భక్తులలో సంతులతో బట్టలు నేసిన కులంవాళ్ళే లేరు. ఈ రెండు సంప్రదాయాలూ కులాన్ని కాదన్నవే. మహానుభావ సంప్రదాయప్రవర్తకుడు మరీఎక్కువ బోధించాడు. యాదవరాజు మహాదేవుని ముఖ్యమంత్రి హేమాద్రి (చతుర్వర్గచింతామణికర్త) అతణ్ణి అనగా చక్రధరుణ్ణి హత్యచేయించాడు. బసవకల్యాణం, పల్నాడు, అమ్రోతి భీకరమైన కులవ్యతిరేకోద్యమాలను చూచినవే.

వేమన మాత్రం మనబట్టకు గిరాకీ ఏర్పడినకాలంలో వున్నాడు. కులవ్యతిరేకోద్యమాల తీవ్రత తగ్గినతర్వాత వచ్చాడు. కులవ్యతిరేక బోధకులలో చివరవాళ్ళు వేమన వీరబ్రహ్మాలు.

## చార్వాకులు : కులంమీదదాడి

7, 8 శతాబ్దాలనుండీ వున్న తంత్రసంప్రదాయం కులవ్యవస్థకు వ్యతిరేకమయింది. అందులో నేతకులంవాళ్ళులేరు. నవవిధకన్యలని చెప్పబడినవారిలో చేనేతకులాలులేవు. తమిళదేశంలోని 63 శైవ నాయనారులలోను, 12 మంది వైష్ణవ ఆళ్వారులలోనూ–భక్తుల్లోనూ నేతకులాలవాళ్ళులేరు. భక్తిఉద్యమాల్లో చేనేతవారు ముఖ్యులుగాలేరు. కబీరు ఒకపెద్దపేరు, సిద్దప్ప ఒక చిన్నపేరు, దసిమయ్య, ఇంకా ఒకటీ అరా చేనేతపేర్లు బట్టలపరిశ్రమనుంచితీసి, చేనేతకులాలే బట్టలపరిశ్రమే కులవ్యవస్థమీద దాడికి నాయకకులమయిందని తీర్మానించడంతప్పు.

సరుకు వుత్పత్తి బీజప్రాయంగా 12వ శతాబ్దంలో పుట్టడమేమిటీ? అలాగది ఎప్పుడు లేదుగనక! అది బీజప్రాయంగా క్రీస్తుపూర్వంనుంచీ వుంది. కులాలు పుట్టక ముందునుంచీ వుంది. ఆటవిక తెగలమధ్య వస్తుమార్పిడి జరిగిన నాటినుంచీ వుంది. నాణెం అన్నది పుట్టిన నాటినుంచీ వున్నది. బానిసవ్యవస్థలో వేరే చెప్పేపనిలేదు. చాలా చాలా ఎక్కువగావుండేది. ఫ్యూడలిజంలో మళ్ళీ తగ్గింది. స్వయంసంపూర్ణ గ్రామవ్యవస్థ అంటారే, అందులో తగ్గింది. కాని అప్పుడూవుంది. అలాతగ్గినప్పటి శతాబ్దాలలో – 6, 7, 8 – ఫ్యూడలిజం (పైనుంచి) బాగా బిగుసుకొన్న కాలంలోనే కులాన్ని కాదనే తాంత్రికోద్యమం, స్త్రీని పూజించే తాంత్రికోద్యమం వ్యాప్తిచెందనారంభించింది. 10వ శతాబ్దంలో మహమ్మదీయులకు ఎదురైన ఉత్తర భారతం తాంత్రికదశలో వుంది.

అదంతా ఎందుకు? చార్వాకులు కులవ్యవస్థకు వ్యతిరేకులు, వర్ణాశ్రమాచారధర్మానికి విరోధులు కదా! వారి వుద్యమం వారివ్యాప్తి, ఎప్పటిది? తాంత్రికదశకంటే

ముందటిదికదా ? లోకాయతులు కులంమీద ధాడిచెయ్యడానికి గల ఆర్థిక పునాదు లేమిటి ? సరుకూ అంశ్లేనా ?

మతాచార విశ్వాసాలను, వాటితోకూడా పెనగొనివున్న కులవ్యవస్థని సడలించడం పెట్టుబడిదారీ విధానం పుట్టుకకు, పెంపుకూ అనుకూలమైనదే కావచ్చు. అవును నిజంగానే. కాని అది తప్పనిసరికాదు. మతం బిగుసుకొంటూ పెట్టుబడిదారీ విధానం పెరిగిన ఉదాహరణలున్నాయి. జపాన్ ఒక ఉదాహరణ. 'జెన్' బౌద్ధమతం కంటె వెనుకకువెళ్ళి, పాతషింటో మతాన్ని పనిగట్టుకొని ముందుకు తెచ్చుకొనికూడా జపాన్ పారిశ్రామికీకరణను సాధించింది. కులాలతోనే ఇండియా కేపిటలిజాన్నే కాదు సోషలిజాన్ని కూడా చూస్తుందేమో ననిభయంవేస్తున్నది ।

ప్రత్తిపంటతో, గింజ తియ్యటంలో, ఏకులు చెయ్యటంలో, నూలు వడకటంలో, నేతతో, నేసినబట్టకు రంగుల అద్దడంతో, బట్టల అమ్మకంతో ఏ ఏ కులాలు ముడిపడి వున్నాయో ఆయాపనులు ఆకులకట్టళ్ళ అడ్డంకులతో ఎలా కుంటుపడినవో వూహించనే లేము. అందుకు అవకాశం కన్పించడంలేదు. ఇదంతా పారిశ్రామికీకరణకు ముందు రోజుల విషయం. మనదేశంలో చేతిపరిశ్రమల్లో విషయం.

ఉర్వివారినెల్ల ఒక్క కంచముబెట్టి, పొత్తుగుడిపి కులము పొలియజేయాలన్న వేమన్నను బట్టలపరిశ్రమలోకి నెట్టడం ఆబట్టల పరిశ్రమను కులంమీద దాడికి నిలయ మనడం అంతా మనదేశంలోని మార్క్సిజంయొక్క దురదృష్టం. మన సొంతశ్రమ, సొంతఫలితాలు బొత్తిగాలేకుండా కొందరి వైదేశికుల ఉపరిశోధన మీద కేవలం ఆధారపడి మనచరిత్రకూ సంస్కృతికీ వ్యాఖ్యచెప్పడం మార్క్సిజానికి ఉన్నతికాదు. గతితార్కిక భౌతికవాదం రెండూ రెండు కళ్ళుగా చూసుకొంటే ఏం ఫలం ? అవి గాజుకళ్ళుగా మారిపోకుండా చూచుకోవాలి. మీయోపియావ్యాధికి గురికాకుండా చూచుకోవాలి.

ఆర్థికంకన్నా అన్యకారణాలుంటవని ఆచరణలో చూచి, చూపగలగాలి. అది లేకుండా, మార్క్సిజం ఆర్థిక నియతివాదంకాదు, కాదని మార్క్సు ఎంగెల్సు చెప్పారంటే సరిపోదు. పరిశోధనలో ఆర్థిక నియతివాదులం కామని రుజువుచేసుకోవాలి. వేమన్నను బట్టల పరిశ్రమవాదనడం — కులంమీదదాడి బట్టల పరిశ్రమలోని ధనటం — వేమన వ్యాపారస్తులకవి అనటం, మార్క్సిజాన్ని ఆర్థికనియతివాదంగా చేస్తున్నారడానికి ప్రబల నిదర్శనం అవుతోంది. కులవ్యవస్థమీద వేమన తిరుగుబాటుకు ఆర్థిక కారణాలను వెదికేముందు వేమనను ఆర్థికవిచారకుడిగా వెలకట్టడం నిలబెట్టడం అవశ్యకర్తవ్యమని గుర్తించడం మంచిది.

—o o—o o—

## ర మ ణా రె డ్డి గా రి లే ఖ

కా వ లి.

శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారికి, 20-2-81

వందనాలు. మీవుత్తరం అందింది. బంగోరెద్వారా వేమనవికాస కేంద్రం గురించి, మీరచన గురించి ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే ఉన్నాను. అచ్చుపూర్తి అయిందని వినడం సంతోషకరం.

"సింపోజియం"లో పాల్గొనేందుకు నేనుసిద్ధమే. పైగా అదిగౌరవప్రదం కూడా. ఇప్పటికే మీరు ఎందరిపేర్లోరాశారు. కొత్తగా నేను సూచించే వ్యక్తులెవరూ లేరు. నార్లవారు రాగలిగితే బాగుంటుందేమో ఆలోచించండి.

P. C. Narasimha Raddy, M. A.
(Lecturer in Telugu) 6-168 S. V. Nagar,
West station—Tirupathi-517502

మధుసూధనరావుగారికి వీరుసన్నిహితులు. వరవరరావుగారిని పిలవడం సముచితం.

మీ

కె. వి. రమణారెడ్డి

## వ ర వ ర రా వు గా రి లే ఖ

హనుమకొండ,
వరంగల్. 506001

త్రిపురనేని వెంకటేశ్వరరావుగారికి, 22-2-81

నమస్తే, నిన్ననే మీవుత్తరం (18.2) గుంటూరులో అనసూయమ్మగారు సూచనప్రాయంగాచెప్పారు-ఇలాంటి ఆహ్వానం రాబోతున్నదని. వేమనపైసింపోజియంలో పాల్గొనాలనివుంది. అయితే మార్చి ఆఖరువారంలోనే బహుశా Nationaliteis Question సెమినార్‌లో నేనుపాల్గొనాల్సి వుంటుంది. తేదీలు క్లాష్‌కాకపోతే పాల్గొనటానికి ప్రయత్నిస్తాను. అయితే ఆహ్వానసంఘంలో మాత్రం నాపేరుచేర్చవద్దు. నాపేరేకాదు విరసం సభ్యులపేర్లు ఎవరివీ చేర్చవద్దు. ఎందుకంటే ఇదిసంస్థగా తీసుకోవాల్సిన నిర్ణయం. కార్యవర్గం సమావేశంకాకుండా ఆనిర్ణయం సాధ్యంకాదు.

మీరు తప్పకుండా పిలవాల్సినవాళ్ళుగా నేను భావిస్తున్నవాళ్ళు 1) కొల్లా వెంకయ్యగారు, 2) కె. వి. ఆర్, 3) కాళోజీగారు. అందరినీ మించి పిలవక తప్పని మనిషి శ్రీశ్రీ.

చెరబండరాజుకు తెలియజేస్తాను. మీరు వీలయితే రాయండి-
అడ్రసు..................

ధన్యవాదాలతో
మీ
వ ర వ ర రా వు

పి. సి. నరసింహారెడ్డిగారి లేఖ

తిరుపతి, 6-3-81

వేమన వికాసకేంద్రంవ్యవస్థాపక మిత్రులు
శ్రీ త్రిపురనేనివెంకటేశ్వరరావుగారికి,

"కేంద్రం" ప్రారంభోత్సవసందర్భంలో ఏర్పాటుచేస్తున్న "సింపోజియం"లో పాల్గొనాలని ఆహ్వానిస్తూ మీరురాసినలేఖ అందింది.

నిరభ్యంతరంగా పాల్గొంటాను. కేంద్రంగురించి మిత్రులద్వారావిన్నాను. నేనుసూచించాలనుకొన్నపేర్లు మీలిస్టులోనే వుండిపోయాయి. వరవరరావుగారినికూడా పిలవవచ్చు. కొత్తవారి మాటెలావున్నా పాతవారిలోనే అందర్నీపిలవడం మీవుద్దేశ్యం కాదని అనిపిస్తూన్నదిలిస్టుచూస్తే ........

మీ
నరసింహారెడ్డి

మధుసూదనరావుగారి లేఖ

తిరుపతి, 21-2-81

డియర్, అన్నయ్యా !

మీవుత్తరం, వేమన వికాసకేంద్రం గురించీ, మీరుపుస్తకంరాయటం గురించీ బంగోరెచెప్పాడు. వేమనమీద'సింపోజియం' పెట్టటం విభిన్నఅభిప్రాయాలుగల వాళ్ళతో మాట్లాడించటంమంచిపని. నేనూ తప్పకుండా వస్తాను. —మీకుతెలియని వేమన అభిమానులు నాకుతెలిసినవాళ్ళు ఎక్కువలేరు. కాకపోతే శ్రీశ్రీ, గంధం అప్పారావు(మద్రాసు)ల్ని కూడా పిలవొచ్చు.

నాఅభిప్రాయంతో విభేదించినా దాన్నిచర్చించటం చాలామంచిపని. సత్యాన్వేషణలో తన మన ఏముంది ? సహేతుకంగా ఎవరుచెప్పినా నేను నా అభిప్రాయాన్ని మార్చుకొంటాను. తప్పుఅని తేలిపోయినతర్వాత దాన్నేపట్టుకు వేళ్ళాడటం నాపద్ధతికాదు, మీరునిరాకరించటానికి చూపినహేతువుల్ని పరిశీలించి నాకుసంతృప్తికరంగావుంటే నాఅభిప్రాయాన్ని వదులుకున్నట్లు సభలోనే ప్రకటించటానికి నాకు ఎలాంటి అభ్యంతరంలేదు. మీవాదాన్నికాస్తముందుచూస్తే ఆలోచించటానికి వ్యవధి వుంటుంది.

మీరు చారిత్రక భౌతికవాదం శాస్త్రీయమైన వాదంకాదని భావిస్తున్నట్టు ప్రసాద్అన్నాడు. నిజమేనా ? అలాంటప్పుడు సాహిత్యానికి సామాజిక జీవితానికీ సంబంధాన్నీ ఎలా శాస్త్రీయస్పష్టతతో నిరాకరించగలం ? మీరు నాఅభిప్రాయాన్ని

నిరాకరించటానికి చూపినహేతువులు సక్రమంగాలేవని అనుకొంటే అదికూడా సభ లోనేచెపుతాను.

మధువు బాబాయిపంపాడు. పైపైనకాక కవిత్వవస్తువు మీద ఎవరితోఅన్నా విమర్శరాయించివేస్తే బాగుండేది అనుకున్నాను.— బెజవాడలో కలుస్తాను.

మీ

మధుసూధనరావు

## మధుసూదనరావుగారి లేఖ

తిరపతి

16-4-81

అన్నయ్యా!

వికాసకేంద్ర కార్యక్రమం అందింది. నేను వ్యాసంరాయటం ఎందుకో నాకర్థంకాలేదు. వేమనమీదనేను ప్రత్యేకంగా కృషిచేయలేదు. వేమనఅంటే ప్రత్యేక అభిమానములేదు. మీపుస్తకంచూచినతరువాత వేమన వ్యాపారస్తులకవిఅనే నా ప్రతిపాదనని మీరు నిరాకరించింది సహేతుకంగా కనిపిస్తే సవరించుకొంటాను. లేకపోతే నావివరణ అవకాశం దొరికితే ఇస్తాను. మీరు ఖండించకముందు చర్చపెడితే నేనుపాల్గొనటంలో అర్థంవుంది. మీరు రాసినతరువాత నేనుదాన్ని పెద్దచర్చావిషయం చేయటం దేనికి ?

చారిత్రక; భౌతికవాదాన్నిమీరు ఆమోదించకపోయినా నాకువచ్చిన ఇబ్బందేమీలేదు. దాన్ని ఆమోదించేవాళ్ళు కోట్లమందివున్నారు. నిరాకరించేవాళ్ళు కోట్లమంది వున్నారు. నేనుగతితార్కిక, చారిత్రిక, భౌతిక వాదాన్ని ఆమోదించేవాళ్ళలో ఒకడిని.

సైంటిఫిక్అవుట్లుక్ అనేదికూడా ఇప్పుడు బ్రహ్మపదార్థం అయిపోయింది. అమర్త్య చిన్మయానంద భగవద్గీత సైంటిఫిక్ అవుట్లుక్ మీద మూడు గంటలు వుపన్యాసంఇచ్చారు. భౌతికవాదంకాని సైంటిఫిక్ అవుట్లుక్ వుండదనే అనుకొంటున్నాను. మీరుచెప్పినతేదీల్లోనూ నాకువిరసం ప్రోగ్రామ్స్ వున్నాయి. అందుకని రాలేకపోవచ్చు. మీపుస్తకం ఆవిష్కరించినతరువాత పంపండి.

మీ

మధుసూదనరావు

## చలసాని ప్రసాద్ గారి లేఖ

విశాఖ
21-4-81

My Dear T. V.

వేమన సెమినార్‌లో పాల్గొనవద్దని మావిరసం కార్యవర్గం నిర్ణయించినది. ఈముక్క నీచెవినివేద్దామని నిన్నపొద్దుననీకు ఫోన్‌చేశాను. ఫోన్ మీదనువ్వు దొరకలా. నిన్నపగలు నీవుచేయలేదు.

శ్రీశ్రీనుంచి నావరకు మేమెవరమురాము. విరసంకాదు కనుక పురిపండా రోణంకిలను తీసుకువెళ్ళు. వాళ్లువస్తారు. రావిశాస్త్రిగారుకూడా రాలేరు.

మీరేం అనుకున్నా ఒకసంస్థలో వున్నాక దాని క్రమశిక్షణకు కట్టుబడి వుండాలి గదా?

దీనివలన మన Personal Relations strain కానక్కరలేదు.

మీ
ప్రసాద్.

## చెంచయ్యగారి లేఖ

కావలి,
1-5-81

శ్రీ వెంకటేశ్వరరావుగార్కి,

నమస్తే.

మీ ఉత్తరం నిన్ననే అందినది. కృతజ్ఞతలు. నేను విరసం సభ్యుడిని. ఈ మధ్య విరసం కార్యవర్గం చేసిన తీర్మానాన్ని అనుసరించి మేం మీరు జరుపుతోన్న వేమన సదస్సులో ఏవిధంగాను పాల్గొనకూడదు. వ్యాసం పంపటంకూడా పాల్గొనడమే కాబట్టి, నేను వ్యాసం పంపకూడదు. కాబట్టి పంపటంలేదు. విరసం నిర్ణయం మీకు కూడా తెలుసు అనుకుంటాను.

I am very sorry.

మీ
వి. చెంచయ్య.

## ప్రసాద్‌కు వెంకటేశ్వర్రావు లేఖ

23-4-1981

విజయవాడ-10

Dear prasad,

'వేమన సెమినార్‌లో పాల్గొనవద్దని మా విరసం కార్యవర్గం నిర్ణయించిందని నీవు వ్రాసిన లేఖ (21-4-80) అందింది, నిన్నసాయంకాలంసరే. నీవేమిచేస్తావు. దీనివలన మన Personal relation strains కానక్కరలేదు. అని అంటున్నావు. బాగానేవుంది, అలాగే కానిద్దాం. అదేమంత సమస్యకాదునాతో.

కాని, నిర్ణయం నీకే ఆశ్చర్యంకలిగించి వుండాలి. ఎందుకంటే, 19వ తేదీ మధ్యాహ్నంకూడా నాతోమాట్లాడావు. నీకు ఇటువంటి అనుమానం కలగనేలేదు. మీ కార్యవర్గాన్ని టీకిపిలిస్తే, వ్యవధిలేకపోవటంవల్లనే రాలేకపోతున్నాను. నీవంటే మిత్రవాతావరణమేగాని మరేవాతావరణం లేదంటూ మాట్లాడుకొంటూవచ్చావు నేనూ అలాగే భావించానుమరి.

వరవరరావు. R. V .R, రామకృష్ణ, P. C. N, కడకు మా బ్రదర్ మధుసూదనరావు, నీ సంగతి చెప్పనక్కరల్లేదు గదా ! మీ వాళ్ళంకా ఎవరికివారుగా నా ఆహ్వానానికి చక్కగా రెస్పాండు చేశారు. నాతో సహకరించటమే దు, ప్రోత్సహించు మన్నట్లుగా వ్రాశారు. ఎవరెవరిని పిలవాలో కూడా వీరందరూ సూచించారు. చాలా సంతోషించాను. నేను పెట్టే సింపోజియం, వేమన వికాసకేంద్రముకూడా మీదే అను కొన్నంతగా తలంచుతూ వ్రాసినట్లుఉన్నది వీరందరినుండీ వచ్చినరెస్పాన్సు.

చాలా కాలానికి రచన - ప్రచురణ - సాహిత్యవ్యాసంగం గట్టిగా చేపట్టి నందుకు - అదీ వేమననుగూర్చి ఆరంభించినందుకు - మంచిప్రారంభంగా భావించాను ఈ వుత్తరాలన్నీ చదువుకొని.

మధ్యలో మన మిత్రుల నియమంమాట తెచ్చారు నువ్వూ, కృష్ణాబాయిగారూ. బంగోరెతో కూడా తెచ్చారట. మంత్రులున్న వేదికమీద విరసంవారు మాట్లాడరు కదాఅని. సింపోజియంలో మంత్రుల్నిలేకుండా, రాకుండా ప్రోగ్రాం చేస్తానన్నాను. నిజానికి, Cultural affairs మంత్రిగారు Vemana Exhibition ప్రారంభించి వెళ్ళిపోవటంతప్ప మరే మంత్రికీ ప్రమేయంలేకుండా ప్రోగ్రాం చేస్తున్నానన్నానుగదా ! Veman వికాసకేంద్రం ప్రారంభోత్సవమే శ్రీ శ్రీ చేత చేయించమని నీవు ప్రతిపాదించావు. అంగీకరించాను అలాగే ఆహ్వానించాను. జవాబులేకపోతే మళ్లి రెండోజాబు నీకేపంపి, నీవే ఆయనకిది పంపుతూనువ్వు వ్రాయాల్సింది. వ్రాసిరప్పించ

మన్నాను. నువ్వుఅలాగే చేశావు. అలాగని చెప్పావు. ఆరుద్రకు కూడా నీవే పంపావు. రెండో జాబు. ఆయన వ్రాశారు అంగీకరిస్తూ.

నా Book - Release కు కూడా ఆవులవారిని, నార్లవారినీ మాత్రమే అను కున్నాంగాని మంత్రులమాటరాలేదు.

ఇందులో మనమిత్రులు కొందరికి ట్రావెలింగ్ Expenses మాట మీరు తెచ్చారు. కృష్ణాబాయిగారు చెప్పారు. బంగోరె చెప్పారు. మీరు చెప్పిన వారందరికీ సరేనన్నాను. ఇంతదాకా అందరూ ఉత్సాహంతోనే వున్నట్టుగదా!

ఆదిలోనే వరవరరావుగారు మావాళ్ళెవర్నీ ఆహ్వానసమితిలో వేయకండి అని వ్రాశారు. - అది నీతోచెప్పాను. అలానే వేయలేమ. మరెక్కడనుంచి అభ్యంతరం కనిపించింది. ఇందులో ఎవరుఏమితప్పుచేశాము. నాకు తెలియటంలేదు ఆలోచనకు అందటంలేదు,

నా పీఠికలో మధు, పి. సి. యన్, మీ ప్రజాస్వామిక పరిష్కారం విషయాలు చర్చించాను. అది నీకుచెప్పాను. మధుకు మొదలే వ్రాశాను. బంగోరె వీరివీరిని కలిసి చెప్పనే చెప్పాడు. ఇదంతా తెలిసే సింపోజియంలో పాల్గొనడానికి వ్యాసాలువ్రాసి తేడానికి అంగీకరించారు. ఇందులో దాచిపెట్టలేదు. మధునుగూర్చి చర్చించడానికి ఒక పట్టాన నేను ఇష్టపడలేదు. కాని మీరేదో ఆరోపిస్తే ఆకాస్తా చర్చించాను. అలా ఏదో విమర్శకుడా చేశానని వ్రాసి మరీపిలిచాను. దానికి ఏముంది? తన - మన భేదంలేకుండా వ్రాసుకోవాలని వ్రాశాడు.

కాని 16వ తేదీ పుత్తరంలో ధోరణి మారింది. మీరు ఖండించకముందు చర్చపెట్టితే పాల్గొనటంలో అర్థముంది. ఖండించిన తరువాత దానిమీద పెద్దచర్చ దేనికి? మీ పుస్తకం పంపండి — రాజాలను, మే 2, 3 తేదేల్లో విరసం పభలున్నవి కూడా అని వ్రాశాడు.

మీసభలంటూ అడ్డువస్తుంటే, మే 2, 3 తేదీలు గాకుండా మే 9, 10 తేదీలలో మరొకతేదీకో మాసభ వాయిదావేస్తాను. మీవాళ్ళతో చెప్పమన్నాను. తప్పకుండా చెప్పివుంటావు. అంచేత వీలుగాక, రాకపోవటం కాదుగదా. మంత్రులు పాల్గొంటున్నా రని కాదుగదా! మరేం కారణము అంతుబట్టడంలేదు. వేమనతో భేదమా? నాతోనా: ఇవి ఆదినుండి వుండాల్సినవికదా! అలాలేవు. హఠాత్తుగా ఇలాచేశారేమిటి?

ప్రోత్సహించి, యింతగా నాకార్యక్రమాన్ని షేప్‌చేసి, నాకార్యక్రమంలో యింత జోక్యంపెట్టుకొని అకస్మాత్తుగా ఇదేమినిర్ణయం? ఇదేమి ఆర్గనైజేషన్? ఎవరితోనైనా చర్చించడానికి అభ్యంతరంఏమిటి? విభేదిస్తే మాత్రంఏమిటి?

విభేదించక చర్చేమిటి ? నాకే అర్థంకావటంలేదు. ప్రసాద్ ! హడావిడి ఏమీవద్దు. అసలు విషయంచెప్పు. కారణంలేని నిర్ణయం వుండదుగదా last minute లో ఇలా చెయ్యడం బాగోలేదు . ఏంచేస్తాను. నేను మరోరకంగా ప్లాను చేసుకొండాను. మే రెండు మూడు తేదీలు వాయిదావేసుకొంటాను. పురి పండాను తీసుకు వెళ్తాను. రామకృష్ణా, P. C. N లు కూడా మీవిరసస్థులేనా ! వాళ్ళు రారేమిటి నాయనా ? చెప్పు.

విషయం మాత్రం చెప్పుత్రావాయి. ఇదిమాత్రం అనిపించడంలేదా ? నన్ను యిబ్బందిపెట్టటమేగదా చేసింది కడకు. నీవుకాదు నిన్నునొక్కేసిన organigation సుమా !

ఎవరికి వారుగా సుముఖులే – సమిష్టిగా అయితే మాత్రం విముఖులు – Paradoxical.

ఇట్లు
త్రిపురనేని వేంకటేశ్వరరావు.

ప్రసాద్ లేఖ

విశాఖ,
26-4-81.

My Dear T. V,

నీ పెద్దజాబు చేరింది. నీ బాధకూడా నాకు బోధపడింది. But Iam help-less. ఒదిగి వుండవలసిన వాడినే. Port - Mortem అనవసరం.

శ్రీ శ్రీ కూడా రారు. ఆరుద్ర, పురిపండారోణంకి వస్తారు. Go ahead.

మేమిద్దరం కూడా రాము. రాలేము, మన్నించు.

మీ
సి. ప్రసాద్.

వేమన సాంస్కృతికోత్సవాల అనంతరం
విరసంవారి ఉత్తరప్రత్యుత్తరాలు

సాంస్కృతికోత్సవాల అనంతరం

మధుసూదనరావుగారి లేఖ

తిరుపతి
17–6–81

డియర్ అన్నయ్యా !

వేమన వికాసకేంద్రం కార్యక్రమాలు బాగా జరిగినందుకు సంతోషము. పత్రికలో చూడటమేగాక మిత్రులు చెప్పగాకూడా విన్నాను. పుస్తకం కూడా చూశాను. ప్రచారంలో వున్న కొన్ని అంశాల్ని కాస్త స్పష్టం చేసుకోవటం మంచిది.

మీరు వేమనమీద రాసినవాళ్ళని సభకు పిలవాలని ప్రాతిపదికమీద విరసంలో కొందరికి వ్యక్తిగతంగా ఉత్తరాలు రాశారు. అంటే సంస్థగా విరసాన్ని పాల్గొనమని విరసానికి రాయలేదు. కావున సంస్థ తరపున మా నిర్ణయాన్ని మీకు తెలియజేయటం అనే సమస్య ఉత్పన్నం కాలేదు. విరసం సభ్యులు వ్యక్తిగతంగా ఎవరు పిలిచినా సభలకు పోవచ్చు. పోకుండా వుండొచ్చు. సభకు వెళ్ళటం వెళ్ళకపోవటం సాధారణంగా ఆహ్వానించబడిన సభ్యుడు నిర్ణయించుకుంటాడు. ఆ నిర్ణయం విరసం జనరల్ ఆశయాలకు అనుగుణ్యంగా చేసుకుంటాడు. అయితే నలుగురైదుగురు విరసం సభ్యుల్ని పిలవటంవల్ల, మీరు మీ సభాకార్యక్రమాన్ని బాగా ప్రచారంలో పెట్టటంవల్లా అందులో పాల్గొనటమా లేదా అనేది చర్చనీయాంశం అయింది. మా దగ్గరవున్న సమాచారాన్ని బట్టి ఆ సమావేశానికి వెళ్ళటం ప్రయోజనకరము కాదని నిర్ణయానికి వచ్చాం. ఆ నిర్ణయాన్ని మీకు తెలియజేయమని ప్రసాద్‌కి చెప్పాను. అతను మీకు తెలియజేశాడో మర్చిపోయాడో తెలియదు. అదికూడా మేము వ్యక్తిగతంగానే సంస్థ తరపున చెప్పమనలేదు. అంటే విరసం సంస్థగా మీ సభల్ని బాయ్‌కట్ చెయ్యలేదు. మీరు ఆహ్వానించిన విరసం సభ్యులు తాము సభకి రాలేమని ప్రసాద్ మీకు తెలియచేస్తాడు, లేదా ఆ సభ్యులే రాసుకుంటారు అనేది నిర్ణయం. వాస్తవానికి నేను సభకు రాలేను అనీ వేరే కార్యక్రమం వుందనీ మీకు వ్రాశాను. అలాగే వేమన వ్యాపారస్తులకవి అనే విషయాన్ని నేను ప్రతిపాదించటం దానిమీద చర్చ రావటం, ఆ తరువాత మీ నిర్ణయాల్ని మీరు రాసుకుంటారని నేను అనుకున్నాను కాని ముందు మీరు మీధోరణిలో దానిమీద ఖండనరాసుకొని తరువాత నేను వచ్చి మీస్టేజీమీద సమర్థించుకోవటం అర్థరహితంగా నాకు కనిపించింది. అది వాదపద్ధతికి విరుద్ధం అని నేను ఇప్పటికి అనుకుంటున్నాను. ఇక మీ అంకితం చూసినతరువాత నేను రాకపోవటమే మంచిది అయ్యిందని అనుకున్నాను. మీ ఇష్టం వచ్చినపని మీ చేయవచ్చు.

మీరు చేసిన పనిమీద పాఠకులు తమ ఇష్టంవచ్చిన అభిప్రాయాలకి తాము రావచ్చు. శ్రీకాకుళపోరాటం గురించికానీ, ఆ వెలుగులో జరుగుతున్న ఇతర పోరాటాల్ని గురించి కానీ మీకు ఏమీ తెలియదని నా అభిప్రాయం. కమ్యూనిష్టులు చేసే అన్ని పోరాటాలమీద మీ వైఖరి ఇదే విధంగా వుంటుంది. కాబట్టి దీన్ని గురించి కూడా మీకు ఎక్కువగా రాయటం అనవసరం. మీ పుస్తకం చూసినతరువాత మీసభకి రానందుకు నేను ఏమీ బాధపడటం లేదని పైగా సంతోషిస్తున్నానని చెపితే చాలు అనుకుంటాను.

వ్యక్తిగతంగా మిమ్మల్ని గురించి నాకు ఏమీ తెలియదు. మీ సభకి రాకపోవటానికి మీరు దోపిడీదారుడనీ, ప్రజావ్యతిరేకులనీ మేం అనుకోపటం కారణం కానే

కాదు. నిజానికి మీ ఆర్థికజీవితం గురించి నాకు తెలియదు. తెలుసుకోవాల్సిన అవసరం కూడాలేదు. దేవస్థానంలో పనిచెయ్యటం గురించి మీరు ప్రస్తావించారు అని నేను విన్నాను. నాకు కొద్దిగా ఆశ్చర్యం వేసింది. నేను దేవస్థానంలో పురోహితుడుగా పని చెయ్యటంలేదని బహుశా మీకు తెలిసేవుంటుంది. నేను కాలేజీలో పనిచేస్తున్నాను. ఏ కాలేజీలో లెక్చరర్‌కి అయినా జీతం ప్రభుత్వమే ఇస్తుంది అనే చిన్నవిషయలుకూడా మీకు తెలియదా! అదిసరే ఎక్కడో ఒకచోట ఏదో ఒకపని చెయ్యకుండా ఎవడు మాత్రం ఎలా బ్రతుకుతాడు? సోషలిష్టు సమాజంలో వుండనందుకు నన్ను తప్పుపట్టి లాభం ఏమిటి? నాకు 5రూ॥ ఆస్తికూడా లేదని మీకు స్పష్టం చేస్తున్నాను. ఆ తార్కిక విమర్శ చెయ్యవద్దని కోరుతున్నాను. మిమ్మల్ని గురించి మీరు ప్రస్తుతించుకోండి. కానీ ఇతరుల్ని గురించి మాట్లాడేటప్పుడు కనీసం మీకు తెలిసిన వాస్తవాల్ని అయినా దృష్టిలో పెట్టుకోండి. నా యిష్టం - నా యిష్టంవచ్చిన విమర్శ చేస్తాను అంటే నేను చేయగలిగింది ఏమీలేదు.

నేను వేమనమీద ప్రత్యేక కృషి ఏమీ చెయ్యలేదు. ఆమాటకొస్తే ఎవరిమీదా నేను ప్రత్యేకకృషి చెయ్యలేదు. భౌతికజీవితంలో వచ్చిన మార్పులు బౌద్ధిక జీవితంలో మార్పులకి కారణంగా వుంటాయని, చైతన్యానికి జీవితం మూలమనీ స్థూలంగా చారిత్రిక భౌతికవాదాన్ని ఆమోదించేవాళ్ళలో నేను ఒకడిని. వేమన అంతకుపూర్వం ఎవ్వరూ చెప్పని తీరులో చెప్పిన విషయాలు వున్నాయని దానికి భౌతికకారణాల్ని అన్వేషించటానికి ప్రయత్నించాను. వేమన వ్యాపారస్తులకవి అనే నా ప్రతిపాదనని చారిత్రిక, భౌతికవాదం ఆమోదించేవాళ్ళు ఒకరకంగానూ, ఆమోదించనివాళ్లు మరో రకంగానూ పరిశీలించే అవకాశం వుంది. మీరు నాతో ఎక్కడ విభేదిస్తున్నారో నాకు మీ పుస్తకం చదివిన తర్వాతకూడా అర్థంకాలేదు. నేను ప్రతిపాదించిన మరొక ముఖ్య విషయాన్ని అసలు మీరు చర్చకే తీసుకోలేదు. మైక్రోసోయట్ సూక్ష్మకవి అనేది చర్చించలేదు. అంటే ఆమోదించారు అనికానీ, ఆమోదించలేదు అనికానీ చెప్పినట్టు కాదు గదా! మొత్తం మీ పుస్తకం చదివి ముగించినతర్వాత వేమనలో మీరు చూసిన కొత్తవిషయాలు ఏమీ లేనీ, ఇతరులు చెప్పనివి మీరు ఏమీ చెప్పలేదనీ నాకు అనిపించింది. కాకపోతే మీ ప్రతిపాదనా పద్ధతిమీదిగావుంది. వర్తమాన సాహిత్యంతో అయితే మనం తీవ్రవాగ్వాదాలు చెయ్యవచ్చు. ఎందుకనంటే బతికివున్న కవిని మార్చే అవకాశం వుంది. వేమనని గురించి చర్చలో ఆవేశపడవలసింది ఏమీలేదు. వేమన గురించి మీరు చేసినా గోపిచేసినా పరిశోధన పాతకవులమీద రాసేదాన్ని విమర్శ అనరు. వేమనమీద ఇప్పుడు రాస్తున్నవాళ్ళమీద మీరు రాసింది మాత్రమే విమర్శ పరిధిలోకి వస్తుంది. విశ్వకవి, విప్లవవైతాళికుడువంటి అతిశయోక్తులవల్ల వేమనకి మీరుకానీ మరో

కరుకానీ పెట్టగలిగిన కొత్త కిరీటం ఏమీలేదు. ఆధునికులు చెప్పిన విషయాలు అన్నిటినీ ఆధునికుల కంటే ముందే వేమన చెప్పాడు అని నిరూపించటానికి పూనుకోవటమే అర్థరహితం.

'రచనోత్సాహమునే మెచ్చుకొందు సిరిసిరిమువ్వా' అని శ్రీ శ్రీ అన్నట్టు మీరు కృషిచేసి వేమనమీద పుస్తకంరాసినందుకే నేను చాలా సంతోషిస్తున్నాను.

మీ
మధుసూదనరావ్.

మధుసూదనరావుగారికి వెంకటేశ్వరరావు లేఖ

21, జూన్ 1981
విజయవాడ-10

**Dear Brother,**

17 జూన్, 1981వ తేదీగల మీఉత్తరం చదివి ఆశ్చర్యపడ్డాను. మీ ఉద్యోగం మాటెత్తుకొని, మిమ్మల్ని విమర్శిస్తున్నట్టు నన్ను గురించి మీరు వినటం మాటకు ఆశ్చర్యపడ్డాను. మీమాటేగాదు, మీ 'విరసం'లో ఎవరినీ ఉద్యోగవిషయంగా యింకా యిప్పటికి ఎంచలేదు. ఎవరు చెప్పారోగాని ఆ సమాచారం తప్పు- నిజం కాదు.

సభలో అన్నట్టు వింటే Tapes వుండనే వున్నాయి, వినొచ్చు, ఎవరితోనైనా అన్నట్లు వింటే అదేదో చెప్పండి. అదీ చూద్దాం. వ్యక్తిగత జీవితాల తడువులాట వరకూ కథ యింకా ముదరలేదనుకుంటాను.

అసలు మీ ఉత్తరం చూసేదాక, దేవస్థానంలో మధుసూదనరావు పురోహితుడు కాకపోయినా, ఉద్యోగి గదా అన్న స్ఫురణ ప్రత్యేకంగా మిమ్మల్ని గూర్చి నాలో కుదురుకోలేదు, ఏర్పడియుండలేదు. అంటే దేవస్థాన కాలేజీలో పనిచేస్తున్నట్టు తెలియదనికాదు. విరసంలోని యితర మిత్రులకన్నా మీ ఉద్యోగంలోని యీ ప్రత్యేకతమాట నా మనసులో నాటుకొని వుండలేదు. ఇంకా నేననటమెలా ? నమ్మండి, నమ్మకపో. నిజమింతే.

చలసాని ప్రసాద్ మీ కార్యవర్గ నిర్ణయంగా తెలిపిన వుత్తరం చదివి మా యువ మిత్రులొకరు గవర్నమెంటు సెమినార్లలో పాల్గొనవచ్చనన్నమాట అని రిమార్కు చేశారు. అదేమాట నా మనసులోనూ వుంది. అదికూడా సభలో అనలేదు. అదే ఉత్తరం వచ్చినతర్వాత కృష్ణాబాయిగారితో అన్నాను. అదికూడా తప్పేమో తెలియదు. అది వేరేవిషయం.

అటువంటిదేదో విన్నతర్వాత నా పుస్తకాన్ని గూర్చి నీవలా వ్రాయడంలో ఆశ్చర్యమేముంది? ఆవరస యికఅంతే. ఆవేశం, ద్వేషం రంగస్థలం తీసుకొంటాయి. రంగులద్దుతాయి. అదేమంత పట్టించుకోదగింది కాదు. మనిషి నిలదొక్కుకోవలసింది అక్కడే, నిలదొక్కుకోలేకపోతే, ఏం విశేషం వుంటుంది? ఆ విషయం అవతల ఉంచుదాం.

(2) "విరసం సంస్థగా మీ సభల్ని బాయ్‌కాట్ చేయలేదు" అని మీరు ఇప్పుడు రాస్తున్నారు.

కాని చలసాని ప్రసాద్ (21-4-1981) పుత్తరంలో "వేమన సెమినార్‌లో పాల్గొనవద్దని మా విరసం కార్యవర్గం నిర్ణయించింది" అని వ్రాశాడు. దానికి ఏవివరణా యివ్వలేదు. అంతే అది బాయ్‌కట్ కాదని ఎలా అనుకోగలరు? మీరు చెప్పేది కోర్టులో లీగలిస్టిక్ భాష్యాలవంతునవుంది. ప్రసాద్ సూటిగా వున్నది వున్నట్టుగా వ్రాశాడు. కోర్టుబయట వ్యక్తులమధ్య సంస్థలమధ్య టెక్నికల్ ఆర్గుమెంటు, లీగలిస్టిక్ మెంటాలిటీ గౌరవప్రదం కాదు. సదవగాహనకు తోడ్పడదు.

ప్రసాద్‌కు వెంటనే అనగా 23-4-81 తేదీనే ఆ నిర్ణయం, మా సభావిషయాల పూర్వాపరాలు అన్నీ వ్రాశాను. అదే మా వైఖరిని, మా విమర్శను తార్కాణిస్తుంది. తెప్పించి చూడగలరు.

(3) వేమనను గూర్చి మీ సూత్రీకరణను విమర్శించిన తర్వాత నేను వచ్చి మీ స్టేజీమీద విమర్శించుకోవటం అర్థరహితం అని యిప్పుడూ, ఇంతకుముందు (16-4-81) రెండో ఉత్తరంలోనూ వ్రాశారు. కాని, తొలుత మిమ్మల్ని ఆహ్వానించి నప్పుడే వ్యాపారస్తులకవి అన్న సూత్రీకరణతో విభేదించి వ్రాశానని తెలిపాను. తెలిపి మరీ పిలిచాను. దానికి 21 2-81 తేదీన వ్రాసిన మీ వుత్తరంలో, అయినా వస్తున్నాను, మీరు చూపిన హేతువుల్ని పరిశీలించి నాకు సంతృప్తికరంగావుంటే నా అభిప్రాయాన్ని వదులుకుంటున్నట్టు సభలోనే ప్రకటించగలను. మీ హేతువులు సక్రమంగా లేవనుకుంటే, అదికూడా సభలోనే చెప్తానని వ్రాశారు కాని మార్చుకొన్నారు. మార్చుకోవటం సరికాదనే నా అభిప్రాయం.

సెమినార్ చివరివరకూ నా పుస్తకం, అందులో నా విమర్శలు చర్చావిషయమే గావు. సెమినార్లో వక్తల అభిప్రాయాలకు నా పుస్తకంలోని అభిప్రాయాలు భిన్నంగానే వున్నాయి. అందులో తెలిసి పాల్గొన్నవారున్నారు. మీకు చెప్పినట్టే ముందేచెప్పి మరీ పిల్చాను. వచ్చిపాల్గొన్నారు. నా Stand ఏమిటో అనే విషయం తెలుసుకోవాలనుకోకుండా, వచ్చి అడక్కుండా కూడా పాల్గొన్నారు, నేనేమీ వారిని కాదని ప్రశ్నించలేదు.

సెమినార్లో నేను పాల్గొనలేదు.– పృచ్ఛకుడుగా కూడా పాల్గొనలేదు. నేను దానికి సమావేశకర్తను మాత్రమే.

అంకితం అలావున్నతర్వాత రాకపోవటమే నయమనిపించిందంటున్నారు. దాన్ని కూడా విమర్శించడానికి అవకాశం యిచ్చాము. దానివల్ల ఏమీ ఇబ్బంది లేదు. అలాగే పుస్తకంమీద వక్తలైవుంటే విమర్శించ గలిగివుండేవారే, దానికి నేను సమాధానించుకోవలసినవాణ్నే. సమాధానం చెప్పాను. ఆ ప్రసంగం ప్రసురిస్తున్నాంకూడా.

మీరు ప్రతిపాదించిన మరొక విషయాన్ని అసలు నేను చర్చించలేదన్నారు. అదేదోకూడా ఇంగ్లీషులో వ్రాశారు. వ్రాత తెలియటంలేదు. గాని, మరో విషయం నాదృష్టికి బంగోరె తేలేదు. ఎందులో వుందో నేను చూడలేదు.

నేను మీతో ఎక్కడ విభేదిస్తున్నానో పుస్తకం చదివినతర్వాత కూడా అర్థం కాలేదన్నమాటే ఆశ్చర్యంగావుంది. ఈ విషయాలకేమిగాని, మీ ఉద్యోగం గూర్చి నేనింతవరకు ఎత్తుకొని మిమర్శించలేదన్నంతవరకు నమ్మకం కుదిరితేచాలు, ఈఉత్తరం ఉద్దేశం నెరవేరినట్లే భావిస్తాను.

ఇట్లు
త్రిపురనేని వెంకటేశ్వరరావు

## మధుసూదనరావు లేఖ - 2

తిరుపతి
24-6-81

డియర్ అన్నయ్యా!

మీ ఉత్తరం, దేవస్థానంలో వుద్యోగం విషయం ఎత్తి మీరు విమర్శించారని నాతో విజయవాడలో ఎవరో అంటేనే మీకు రాశాను. అనలేదు అని మీరు చెప్పారు. కనక ఆ విషయం నేను నా మనస్సులో నుంచీ వదిలేసుకుంటున్నాను. గవర్నమెంట్ సెమినార్లలో ఇంతవరకు విరసం పాల్గోలేదు. నాకు తెలిసినంతవరకు కావలిలో U. G. C. గ్రాంట్స్‌కింద పట్టాభిరామిరెడ్డి అనే వామపక్ష మేధావి నిర్వహించిన రైతాంగ పోరాటాల సదస్సులో వరవరరావు, కె. వి. ఆర్. పాల్గొన్నారు. అదికూడా సంస్థ తరపున కాదు. దానికి మంత్రులు ఎవరూరాలేదు. బిపిన్‌చంద్ర అనే ఆధునిక చరిత్రకారుడు ప్రారంభం చేశాడు. ఆయన కమ్యూనిస్టు. విమర్శించినంత మాత్రాన ద్వేషం అనవలసిన అవసరం లేదు. నాకు అసూయకానీ, ద్వేషంకానీ లేవు. వుండాల్సిన అవసరంలేదు. మీరు రాసింది

జనం చదవటానికే, చదివేవాళ్లు అనేకరకాల అభిప్రాయాలకి రావటం సహజం. ఎవరి విషయంలో అయినా జరిగేది ఇదే. విమర్శిస్తే నామీద ద్వేషం వుంది కాబట్టి విమర్శిం చాడు అంటే ఎలా ? ఇక విమర్శ ఎలా సాధ్యం? మీ పుస్తకంలో మీరు అనేకమంది అభిప్రాయాల్ని విమర్శించారు. వాళ్ళందరిమీద మీకు ద్వేషం వుండే ఆపని చేశారా ? విమర్శకు మనం స్వాగతం చెప్పాలి. దానివల్ల మంచి జరుగుతుందికానీ చెడ్డ ఏమీ జరగదు. విమర్శ వ్యక్తిగతంగా వుండకూడదనికూడా నా అభిప్రాయంకాదు. ఒక విరసం సభ్యుడు మత విశ్వాసాల్ని ప్రచారం చేస్తుంటే అది అతని ఉద్యోగంలే అని సరిపెట్టుకోవటానికి వీల్లేదు. ఆఫీసు దాటినతర్వాత అతడు తన వుద్యోగాన్ని మోసుకు తిరగాల్సిన అవసరం ఏమీలేదు. ఒకవ్యక్తి అభిప్రాయాల్ని ఆవ్యక్తి వ్యక్తిగతజీవితం నుంచీ పూర్తిగా విడదీయలేం బట్టతలవాడు, స్పోటకపు మచ్చలవాడు, వాడిపెళ్ళాం సంగతి అట్లా- వంటివి మాత్రమే వ్యక్తిగతవిషయాలు. వ్యక్తిసాంఘిక, రాజకీయ జీవితాన్ని, సంపాదనా పద్ధతినీ వ్యక్తిగత విషయాలుగా పరిగణించటానికి అవకాశం లేదు. కాబట్టి మిమ్మల్ని నేను విమర్శించినా ఆ విమర్శకి ద్వేషం అసూయవంటివి కారణాలుగా భావించవద్దనీ, సహేతుకంగా లేకపోతే మీరూ విమర్శరాయటం ఒక్కటే సరియైన పద్ధతి అనీ చెప్పదలచుకున్నాను. విమర్శకి పునాది ద్వేషం అని అంటూ మీరు విమర్శని అరికట్టాలని చూడటం సమంజసంకాదు. మీరు ఇతరులతో విభేదిస్తు న్నట్టే మీతో ఇతరులుకూడా విభేదించవచ్చుకదా ! కోర్టు లీగల్ భాష అని మీరంటే నేనేమీ చెప్పలేను. ప్రసాద్ రాశాడు అంటున్నారు కాబట్టి ఆయనరాతమీద మీ అభి ప్రాయం ఏర్పరచుకోండి. ఎందుకనంటే నేను మీకు వివరణకోసమే రాసానుతప్ప మరో ప్రయోజనం ఆశించికాదు. మళ్ళీ నేను చెప్పదలుచుకుంది మీరు విరసాన్ని ఆహ్వానించలేదు. విరసం మీ ఆహ్వానాన్ని నిరాకరించలేదు. మీరు విరసంలో నలుగురిని ఆహ్వానించారు. వాళ్ళురాలేదు.

ఇక నా విషయం. వేమన వ్యాపారస్తుల కవి అని నేను సమర్థించుకుంటూ రాసింది మీరు ప్రచురిస్తారు. దానికి ఉపోద్ఘాతం మీ చేతుల్లోనే వుంటుంది. దానిమీద మళ్ళీ రాయాలి. నాకు అంతగా ఆసక్తిలేని విషయంమీద నేను ఈ వాగ్వాదాన్ని ఎందుకు పెంచుకోవటం. ఏదో చర్చల సందర్భంలో నేను రాస్తున్న తెలుగుసాహిత్య చరిత్రలో వేమనమీద రాసిన పదివాక్యాల్ని ఉటంకించాను సృజనలో. సప్రమాణంగా కూడా చెప్పలేదు. నేను రాసిన ఇంగ్లీషుమాట మాక్రో – మైక్రో (Macro- Micro). వేమనమీద నా అభిప్రాయాన్ని మీరు ఖండించినదికూడా ఇప్పుడు నాకు పెద్దసమస్యగా కనపడటంలేదు. అంకితం విషయం మాత్రం నా దృష్టిలో పెద్దసమస్య. శ్రీకాకుళ పోరాట వీరులు దారి తప్పినవాళ్లు కారు. ఎవరు దారి తప్పిందీ ఆత్మ విమర్శ చేసు

కుంటే తెలుస్తుంది. నాలుగురోజులు మార్క్సిజంతో కాపరంచేసి రాయిస్టుగానో, బుద్ధిస్టుగానో వేషం మార్చినవాళ్ళకి త్రిపురనేని కుటుంబంలో కొదవలేదు. C. P. I. వాదంతో మీరు బృందగానం చేస్తున్నారు– మళ్ళీ మీకు చెపుతున్నాను. విమర్శకి ద్వేషం పునాది కాదు. అలా మీరు అనవద్దు. మీమీద ద్వేషం వుండవలసిన అవసరం నాకు ఏమీలేదు. అలా అనొద్దు.

మీ
మధుసూదనరావు

మ ధు సూ ద న రా వు గా రి లే ఖ – 2

విజయవాడ
26–6–81

వెంకటేశ్వరరావుగారికి,

వికాసకేంద్రం ప్రచురణ 1 రూ. పుస్తకం చూసి ఇది రాస్తున్నాను. నేను మీకు రాసిన ఉత్తరాలు కేవలం వ్యక్తిగతమైనవి. వాటిని ప్రచురించటం కానీ ప్రచారం చేయటంకానీ చెయ్యరాదు. మీరు నాకు రాసిన ఉత్తరాల విషయంలోకూడా నేను ఇదే నియమాన్ని పాటిస్తాను.

మీ
మధుసూదనరావు

మధుసూదనరావుగారికి వెంకటేశ్వరరావు లేఖ

2, జూలై, 1981
వి జ య వా డ

My Dear Brother,

వారంరోజులుగా వూళ్ళో లేను. తిరిగివచ్చి నిన్ననే టపాలో మీ రెండు ఉత్తరాలూ చూసుకొన్నాను. జూన్ 24, 26 తేదీల్తో రెండు ఉత్తరాలు వున్నాయి. ముదురు చేదులు మీరిన మొదటి వుత్తరంలో ఆలోచనాపరుని సమస్య ‘పెద్ద సమస్య’ గాకుండా పోయి, ఆయాసంలేని ఆవేశపరుని అలవాటైన ఏకైక మార్గమే మీకూ శరణ్యమైన

స్థితిజూశాను. రెండో వుత్తరం చూశాను. Anti climax నవ్వొచ్చింది. Most enjoyable గా వుంది కథంతా. నేను రాసిన వుత్తరాలు కేవలం వ్యక్తిగతమైనవి, వాటిని ప్రచురించటం కానీ, ప్రచారం చెయ్యటం కాని చెయ్యరాదు అనికదా కోరారు. విచిత్రంగానే వుంది. అయినా, అభ్యర్థనగదా అలాగే చేద్దామనుకొన్నాను.

సాయంకాలం ఒక మిత్రుడు వచ్చాడు-మన కరస్పాండెన్సు అంతా చూస్తున్న మిత్రుడతడు. మధుసూదనరావునుంచీ మళ్ళీ ఏమీరాలేదా అని అడిగాడు. రాలేదన్నాను. రాకుండటానికి వీల్లేదనుకొన్నానే అని అన్నాడు. You are correct. ఇవిగో రెండు ఉత్తరాలూ అని యిచ్చాను. చదివి రాలేదన్నారేమిటి? మధుసూదనరావు చెప్పినట్టే చేస్తారా ఏమిటి అన్నారు. ఏమి; అభ్యర్థించాడు గదా! అన్నాను.

పొరపాటు- అది అభ్యర్థనకాదు, ఆజ్ఞాపరిధిలో వుంది. అంతేగాదు, మీ ఉత్త రాలను అలాగే బైటపెట్టను- నియమంగా పాటిస్తాను అంటున్నాడు. మీ జాబుల్లోవున్న రండాగర్భాలేమిటో వాటిని దాయమని మీరేమన్నా వ్రాశారా, అసలు చెప్పండి, అన్నాడాయన. ఎంత దంభం వుందో యీ ఉత్తరంలో, ఎంత నిజాయితీ లేని ఉత్తరమో కానలేదా! అన్నాడాయన. కనువిప్పు అయింది. చాలా ఎనలైజు చేసి చెప్తూ ఆత్మ హత్య చేసుకోవద్దన్నాడు. అందుకే యీ ఉత్తరం వ్రాస్తున్నాను.

"నేను రాసిన ఉత్తరాలు కేవలం వ్యక్తిగతమైనవి. వాటిని ప్రచురించటంకానీ ప్రచారం చెయ్యటంకానీ చెయ్యరాదు. మీరు నాకు రాసిన ఉత్తరాల విషయంలోకూడా నేను ఇదే నియమాన్ని పాటిస్తాను" అని వ్రాశారు. ఆఖరువాక్యం నిజంగా అద్భుతంగా వుంది, నేనడగని అభయహస్తం అడిగినట్టుగా యిస్తున్నారు. నా లాభం ఏమిటో మీరే ఎరిగి, మీతో నాకొక deal మీరే ఏర్పరచి, నా సంతకానికి పంపినట్లుంది,నిజమే. నా ఉత్తరాలు దాయనక్కరలేదు. అవి వ్యక్తిగత రహస్యాలని నేను మీకు రాయలేదు, ప్రచురణార్థంకాదని అని వుండలేదు. అనటంలేదు. అనలేను. పైగా, ప్రచురించమని ఇప్పుడు మరీ మరీ కోరుతున్నాను. నాకు దాపరికం లేదు. నీకున్నట్టుంది, మీ వుత్తరాలు మీకే రోతవేసి వుంటాయి. అందుకే ప్రచురించరాదని అడిగావు. నా రూపాయిపుస్తకం చదివి, ఇది రాస్తున్నానన్నారు; దానివల్ల మార్పేమో! పెద్ద పుస్తకంవలన కానిపని ఈ చిన్ని పుస్తకంవలన అయిందేమో? తెలీదు. ఏదైతేనేమిలే సరే. ఏంపోయిందిలే అనుకొన్నానుగాని, మీ వుత్తరంలో అటువంటి బాధ, సంతాపం లేదు. పైగా Authoritarian ఆజ్ఞాపత్రం లాగుంది. మా మిత్రుడన్నదంతా వుంది.

ఈ వుత్తరప్రత్యుత్తరాలు మనమధ్య వేమన విషయంగా జరిగినై. అవి కేవలం వ్యక్తిగతమైనవని వ్రాయడం ఆశ్చర్యం. ఏది వ్యక్తిగతమో, ఏదికాదో

మొదటి వుత్తరంలో మీరే రాశారు : వ్యక్తి సాంఘిక రాజకీయ జీవితాన్ని, సంపాదనా పద్ధతినీ వ్యక్తిగతవిషయాలుగా పరిగణించటానికి వీల్లేదు : అన్న మీమాటతో నాకు ఏకీభావమే. మన ఉత్తరాల్లో అవన్నీఉన్నాయి. అవేవున్నై. దాచుకోవాల్సినవేమీలేవు.

మీరు విరసం కార్యదర్శులు. నేను వేమన వికాసకేంద్ర సంస్థవాణ్ణి. మనం జ్ఞాతులమన్నమాట incidental. మన వుత్తరప్రత్యుత్తరాలలో సాహిత్యవిషయాలు, రెండుసంస్థలకుమధ్య సంబంధాలు, ఆ సంస్థలోని వ్యక్తులతోగల సంబంధాలు వున్నాయి. ఇవి వ్యక్తిగతం కానేకావు. దీన్ని ప్రచురించవద్దని నిజమైన అభ్యర్థనగా వున్నాకూడా సహేతుకం, సమంజసంకాదు. మీకు రెండు పత్రికలు వున్నాయి. మన ఉత్తర ప్రత్యుత్తరాలను వాటిని మీరే విడుదలచేయకోరతాను. చలసాని ప్రసాద్‌కు నేనురాసినలేఖతోసహా మీకార్యవర్గ నిర్ణయంగా నాకు తెలుపుతూ ఆయననాకు ఆయనరాసినలేఖ కూడా అవశ్యం ప్రచురించగోరుతాను. మనచర్చ ఒక కొలికికి వచ్చేసింది. మనం దాచిపెట్టుకొనే లెవెల్లో వ్రాసుకోరాదు.

ప్రసాద్ మీ కార్యవర్గ సభ్యుడనుకొంటాను. మీరు కార్యదర్శులు. ఆయన అలా ఎందుకు నాకు తప్పుగా తెలిపాడో, అలాతెలిపి మీ కార్యవర్గాన్ని నేను తప్పు పట్టేందుకు అవకాశం ఎందుకిచ్చాడో నిగ్గదీయటం, తెలుసుకోవటం మీవంతు. మీ సభ్యుడు ఒకరు తప్పుగా తెలిపినందుకు విచారం తెలియజేయటం మీవంతు అనుకొంటాను. కార్యదర్శి స్థానంలోవున్న మీ విధి. అలా చెయ్యడానికిబదులు "ఆయన రాతమీద మీ అభిప్రాయం ఏర్పరచుకొండి" అని నాకు రాయటం నిజంగా శోచనీయం. ముందు మీ అభిప్రాయం ఏర్పరచుకొని తర్వాత మీరేమాకు ఏర్పరచటం కార్యదర్శిగా మీకనీస కర్తవ్యం. collective responsibility. సూత్రానికి సంస్థానిర్వహణానికి మీ వ్రాత తగినది కాదేమో అని అనుమానంగా వుంది.

మా వేమనసభలో పాల్గొనరాదని ప్రసాదేకాదు, మరొకరుకూడా వ్రాశారు. ఇదిగో చదవండి, పేరు తరువాత ఇస్తాను. అవసరమైతే Photo-stat copy పంపుతాను. "విరసం కార్యవర్గంచేసిన తీర్మానాన్ననుసరించి మేం మీరు జరుపుతున్న వేమన సదస్సులో ఏవిధంగానూ పాల్గొనకూడదు. వ్యాసం పంపడంకూడా పాల్గొనడమే కాబట్టి వ్యాసం నేను పంపకూడదు" అనివ్రాశారు పాపం ! అయితేవారు సభలకు వచ్చారు శ్రోతలుగా. ఎందుకు దాపరికము — ఎవరోకాదు, చెంచయ్యగారే. అందుకే సభావేదికనుంచీ అడిగాను. ఈ సభలకువచ్చి వినడంకాదా ? అంతవరకు అనుమతి వుందా ? అని ఈ సభ్యుని రాతమీదకూడా నేనే అభిప్రాయం ఏర్పరచుకోవాలంటారా, చెప్పండి. మీరు అధికారికంగా చెప్పినున్నారు. మీ ఉత్తరంలో, "మళ్ళీనేను చెప్పదలచు

కొంది మీరు విరసాన్ని ఆహ్వానించలేదు. విరసం మీ ఆహ్వానాన్ని నిరాకరించలేదు. మీరు విరసంలో నలుగురిని ఆహ్వానించారు, వాళ్ళురాలేదు."

మీరు వెళ్ళరాదని తీర్మానించినప్పటికీ, విరసం సంస్థను సంస్థగా నేను ఆహ్వానించలేదు కావున విరసం నా ఆహ్వానాన్ని నిరాకరించలేదు అంటున్నారు. మీ సభ్యుల్ని వెళ్ళరాదని శాసించారు. నా ఆహ్వానాన్ని నిరాకరించనిమాట యథార్థమే. కాని మీరు సభ్యుల్ని నిషేధించారనే మేమనేమాట ! ఇదంతా కోర్టు లిటిగేషన్ పరిధిలోని దుర్వాదం అవునో కాదో లోకానికి విడుద్దాం.

చెంచయ్యగారితో విరసంవారిని 8 మందిని పిలిచాను. పిలిపించుకొన్నారు. ప్రసాద్‌కు అదే వ్రాశాను. మీ మీ వుత్తరాలు వున్నాయి. అందులో కార్యవర్గంసభ్యులు 5, 6 అయినా వుండొచ్చుఅనుకొంటాను. మీరేమేమి వ్రాశారో ఆ కథంతా ప్రసాద్‌కు రాసినవుత్తరంలోవుంది. వ్రాసి నెల పైనయింది. తెప్పించి చదవండికొన్త.

మీరురాని చివరికారణం మాటకొస్తున్నాను. "వేమన వ్యాపారస్తులకవిఅని నేను సమర్థించుకొంటూ రాసింది మీరు ప్రచురిస్తారు. దానికి ఉపోద్ఘాతం మీచేతిలోనే వుంటుంది. మళ్లీరాయాలి – అదంతా ఆసక్తిలేని విషయంమిద వాగ్వాదాన్ని ఎందుకు పెంచుకోటం – ఏదో చర్చల సందర్భంలో నేను రాస్తున్న తెలుగు సాహిత్యచరిత్రలో వేమనమీద రాసిన పదివాక్యాల్ని వుటంకించాను సృజనలో. సప్రమాణంగాకూడా చెప్పలేదు. అదికూడా (దాని ఖండనం) నాకు పెద్దసమస్యగా కనపడలేదు." అనిగదా వ్రాశారు 24వ తేదీ లేఖలో.

మీరుగా మొదలుపెట్టి ఇంత దీర్ఘ దీర్ఘంగా టపాపెంచారు. వాగ్వాదాన్ని పెంచారు. అసలు సమస్యమీద – వ్యాపారస్తులకవి వేమన అనటంమీద – ఇంతపాటి శ్రద్ధ చేస్తే ఏంపోయింది ? నేను దానిమిద ఉపోద్ఘాతం రాస్తేమాత్రమేం ? దానికి ఎదురెత్తుగా మీకున్న రెండు పత్రికలలో రాయొచ్చుగదా ! గత ఆదివారం విశాలాంధ్రలో నా objections మీద సమీక్షక మహాశయుడు బలరామమూర్తి ముక్తాయింపు చేర్చిగదా వేశారు (29-6-81). వేస్తేమాత్రమేమి మునుచుకుపోయింది ? ఆముక్తాయింపులోని బేలతనం, చాలనిస్థితి గోచరంకాకుండాపున్నదా ? సత్తావున్నదీ లేనిదీ తెలిసిపోకుంటుందా ? నాచేతిలో ఉపోద్ఘాతపు ఘాతం తగులుతుందనుకొంటే అలాంటిపని చెయ్యరాదని షరతుపెట్టవచ్చుగదా ! మా పండితగోష్ఠిలో నేను మాట్లాడ రాదని అడిగిపాల్గొన్నవారు ఒకరుపున్నార కూడా ! అలాగే నేను మాట్లాడలేదు.

నా పుస్తకంలో నేను విమర్శించినవారు నాకే వ్రాసి పంపుతామంటున్నారు. కొందరు. రాయండి, వీలుంటే నేనే ఆ వ్రాతల్ని అచ్చుకెక్కిస్తానేమో. ప్రయత్నిస్తా

నంటున్నాను. ఒకరిమీద పాయింటు స్కోర్ చెయ్యటం, చెలిగి చివరిమాట నాది చేసుకోవటం అంతమంచిదృష్టికాదు. అలామన ముక్తాయింపు లేదేఅని విచారం అంత కంటే కూడదు. సత్యాన్వేణంలో ఎక్కడికిచేరాం అన్నదే ముఖ్యం. నేను మునిగినా, ఓడినా ఫరవాలేదు. నేకోరేది National Debate-National figure మీద మీరు మీరు కలిసి రాలేకపోయారు.

మీ మాటల్ని మీరే కానండి : సృజనలో – తెలుగుసాహిత్యచరిత్ర – అందులో వేమనమీద పదివాక్యాల వుటంకింపు – సప్రమాణంగా కూడాకాదు – అంతగా ఆసక్తిలేని విషయం మీద – అందులో వేమన వ్యాపారస్తులకవి అని సూత్రీకరించి – ఇదెలావుంది మీమట్టుకు మీకు ? నన్నేమనుకోమంటారు ? లోకాన్ని ఏమనుకోమంటారు ?

లోగడ వుత్తరాల్లో "వేమన మీద ప్రత్యేకకృషిచెయ్యలేదు ; ఆమాటకొస్తే ఎవరిమీదా చెయ్యలేదని – స్థూలంగా చారిత్రక భౌతిక వాదాన్ని ఆమోదించే వాళ్ళల్లో ఒకడిని" అని వ్రాశారు.

ఎంతగట్టి విషయాల్లో ఎంత తేలికగా అలవోకగా దాటుకుపోతున్నారో చూడండి. మీ పత్రికల్లో పాఠకులకు అధికారిక సమాధానాలిస్తూ వ్రాస్తూ యిలా తేల గొట్టుకునిపోతే ఏం ఫాయిదో? లోతైన విషయాన్ని లోతుగా చూడకా, చర్చించకా పోతే ఎట్లా ? రాష్ట్ర సంస్థకు కార్యదర్శులుగదా! తెలుగు సాహిత్య చరిత్ర అంటున్నారు. అదేమైనా వ్రాశారా ? ౪0, 35 ఏళ్లుగా మార్క్సిజం పరంగా ఆంధ్ర సాహిత్య చరిత్ర, చారిత్రక భౌతికవాదదృష్ట్యా ఎవరైనా వ్రాశారా ?

ఉత్తరాల్లో ఇంత రగడ పెంచారుగాని, మీ సూత్రీకరణమాట చర్చించకపోవట మేమిటీ ? దానికి బదులు మీకు చేతనైన పని యిలా వుంది.

(నన్ను) "మీరు ఖండించినది కూడా నాకు పెద్ద సమస్యకాదు. అంకితం మాత్రం నాకు పెద్దసమస్య. శ్రీకాకుళం పోరాటవీరులు దారి తప్పినవాళ్ళుకారు. ఎవరు దారితప్పిందీ ఆత్మ విమర్శ చేసుకొంటే తెలుస్తుంది. నాలుగు రోజులు మార్క్సిజంతో కాపరంచేసి రాయిస్టుగానో, బుద్ధిస్టుగానో వేషం మార్చినవాళ్ళకి త్రిపురనేని కుటుంబంలో కొదవలేదు. సి. పి. ఐ వాదంతో మీరు బృదగానం చేస్తున్నారు. మళ్లీ మీకు చెబుతున్నాను." నాయనా ! చర్చవిషయాన్ని తపించుకుండా చర్చించి మీ దండకంతో ముగించు, బాగుంటుంది. మీరు చదివామన్న నా చిన్న పుస్తకంలోనే మీ సూత్రీకరణ మీద సూటిగా సరిపడావుంది. పెద్దపుస్తకంలోనిదికూడా వుంది. న్యాయాలంటే ఇదేచాలు. ఓపికఉంటే చూడండి చార్వాక ప్రత్యేక సంచికలో

యీసమస్యనింకా నిశితంగా, విస్తృతంగా మార్క్సిజాన్ని Economic determismగా చేశేవారందరికీ సరిపడా Problem set చేశాను. త్వరలో వెలువడనుంది. విషయాన్ని విషయంగా చర్చించుదాంముందు. తర్వాత రాయిస్టు బుద్ధిస్టు. C. P, I వగైరా పేర్లకేం - దానికేమంత అధ్యయనం కావాలి ? అవీపెట్టుకొందాం. అవీ చర్చించు దాం. మానేయవద్దు. గోపీచందుగారినీ, నన్నూ అను, పర్వాలేదు. ఇదైతే ఆవిషయానికి వస్తాను. C. P. I రాయిస్టుబుద్ధిస్టు ... ఇంకేమనాలో పూర్తి చేస్తే ఆక్రిటీ అంతా తేల్చుకుందాం.

నాకు తెలియక అడుగుతాను, శ్రీకాకుళం వీరులు తొందరపడలేదని, త్రోవ తప్పలేదని ఇంకా మీ విరసం నిశ్చితాభిప్రాయమేనా ? మీ విరసం యింకా ఆ annihilation పాలసీలోనే వున్నదా ? అది ఒక పాలసీగా తీసుకోవటం లేదని, అక్కడే తీసుకొన్నారని మీవాళ్ళే చెప్పగా విన్నాను. కాని మీరు గదా కార్యదర్శులు మీ మాటలు అధికారికంగదా ! లేకపోతే, మళ్ళీ చెబుతున్నాను .... అని మతాధికారి శాసనసమమైన వాక్కులో హెచ్చరిస్తున్నట్టు భయపెట్టేట్టు వ్రాస్తారు. సరిగావివరించ గోరతాను. శ్రీకాకుళ వీరులు తప్పులోపడలేదని మీ అభిప్రాయంగా తెలిపారు. ఇది అధికారికమేగదా !

మీ పాలసీ ఏదైనా, శ్రీకాకుళం పోరాటం మీ సొత్తేఅనుకోవద్దు. ఇంకా రహస్యవాసంలోనే వుంటూ మీతోనూ, ఆనాటి ఆపోరాటంతోనూ విభేదిస్తున్నవాళ్ళే వున్నారు. బలంగా దండిగావున్నారు. అందులో పాల్గొనికూడా అదిపొరపాటని అంగీకరిస్తూ ఇంకాయిప్పటికీ యత్నించేవారున్నారు. వారు నా అంకితంతో ఏకీభవిస్తారు. ఆహ్వానిస్తారు నా అంకితాన్ని. నేనే పార్వతీపురం ఏజన్సీలో వున్నాను. గత ఏప్రిల్లో - జూన్ 10, 11 తేదీల్లో శ్రీకాకుళం విజయనగరసీమలో తిరిగొచ్చాను. మిత్రుల్ని కలిశాను. పుస్తకం యిచ్చివచ్చాను. మీరు విరసంలోవుండి చేసిందేమంత గొప్పగాలేదు. మేము మా తీరులోవుండి చేయకపోయిందిలేదు.

అయినా, ఆ అంకితం కథ అయిపోయింది. దాన్నిగూర్చి చేసేదేముంది ? చేయగలిగింది, చేయవలసింది వేమనకు వెలకట్టడంమాత్రమే. అదివదిలేయకండి.

ద్వేషబుద్ధి అంటగట్టి విమర్శనుంచి తప్పుకోవాలని, విమర్శపుట్టకుండా చెయ్యాలని చూస్తునట్టేదో ఉపన్యసిస్తున్నారు మీ ఉత్తరంలో. విచిత్రంగావుంది. మిమ్మల్ని పిలిచిందే విమర్శచేయమని - అది చెయ్యకుండా తప్పుకొంటూ సైడు ఇస్యూలకై ఉరవడిస్తూన్నది మీరేకదా ! ఇలా unpleasant గా వ్రాసి, నాచేత వ్రాయిస్తున్నవారు ఇంతమందిలో మీరొక్కరేసుమా ! ఆవిష్కార సుసమయంలోనే

నామీద దాడిచేసినవారితో సైతం నేను – నాతో వారు సైతం Pleasant గా కలుస్తున్నాం. వ్రాసుకొంటున్నాం. సూచనలు చేసుకొంటున్నాం – controversy చేసుకొనేది వేరే అచ్చులో చేస్తున్నాం. మీరూ మీవారే ఇలా దూరంగా వుండిపోయి ఇలాంటి రాతల్లో పడిపోవటం.

మిమ్మల్ని అనని మాటొకటి వేసుకొని, ఏమేమో వ్రాసి, కంటుపెట్టుకొని వ్రాసి నీపుస్తకంలో కొత్త విషయమేమీలేదు. "మొత్తం మీ పుస్తకంచదివి ముగించిన తర్వాత వేమనలోమీరు చూచిన కొత్తవిషయాలు ఏమీలేవనీ" వ్రాసి, వికాసకేంద్రం ప్రచురణ 1 రూ. పుస్తకం చూసి ఇది రాస్తున్నానని అంటున్నారు. అందులోనే, ఎవ్వరూ చెప్పని విషయంవుంది. (విశ్వదాభిరామ వినురవేమ మకుటం యొక్క Deciphler ment వుంది. ఎన్నో ఎవరూచెప్పని అర్థాలున్నై. ప్రతి అపపాఠం అర్థవంతమై పూరుకొందన్నాను. ఎవరైనా డీసైపర్ చేశారేమో చెప్పండి. అపపాఠాలన్నీ ఇలానో, మరొకలాగానో అర్థవంతాలని ఎవరైనా చెప్పారా ? ఆర్థిక సిద్ధాంతం ఇలా Rounded of view యిచ్చారా ? ఇలాగే యిచ్చారా ? పెద్దపుస్తకంలో ఇంకా చాలా విశేషాలున్నాయి. దానిమాట ఎరగనట్టు రాస్తున్నారుకదా ! రూపాయి పుస్తకం 18 పేజీల్లోనే యిన్ని కొత్త విషయాలున్నాయి.

ఇవికూడా మీరు కానలేకపోపటం నేనేదో అన్నాననే ఆవేశంలోపడి, అందుకని ద్వేషం పెంచుకొని. కానలేకపోతున్నారని వ్రాశాను. అదికాదంటే, లోకానికి విడుద్దాం తీర్పుని. అది వద్దంటున్నారేమిటి ? "మీరు నాతో ఎక్కడ విభేదిస్తున్నారో నాకు మీ పుస్తకం చదివిన తర్వాతకూడా అర్థంకాలేదని" నాకు వ్రాసిన మీ చిత్తదశ ఏమిటో కొంచెం విశ్లేషించుకోండి.

"అనలేదు అనిమీరు చెప్పారుకనక ఆ విషయం నేను నా మనస్సులో నుంచి వదిలేసుకుంటున్నాను" అని వ్రాస్తున్నారు. ఎంత సునాయాసంగావుంది మీకు ! విజయవాడలో ఎవరోఅంటే నేనుమీకు రాశాను అని అలవోకగారాసి తీసేస్తున్నారు! అంతే తేలికగా తీసుకొనే రాశారా మీరు? పైన పైనాలుగా ఎంతెంతో వ్రాశారు ? గింజుకులాడి ఆవేశంలోపడి 'నీరచనోత్సాహమునేమెచ్చుకొందు సిరిసిరిమువ్వా' అనిముగించారు. మరచిపోమంటారా ? ఇవతలి ఉత్తరంలో ఇంకా ఇంకా తెగబడిఅన్నారు. ఆఖరుకి ఇదంతా కేవలం వ్యక్తిగతంగా వ్రాశాను, ప్రచురించవద్దు. ప్రచారంచేయొద్దు,

"అనలేదుఅని మీరు చెప్పారుగనుక అవిషయం నామనస్సులోనుంచీ వదిలేసుకుంటున్నాను" అని వ్రాస్తున్నారు. ఎంతసునాయాసంగావుంది ? ఎంత ఉదారబుద్ధి

చూపుతున్నట్టు ? 'విజయవాడలో ఎవరోఅంటే నేను మీకు రాశాను అని అలవోకగా రాసి తీసేస్తున్నారు ! అంతతేలికగా తీసుకొనే రాశారా ? ఎవరావ్యక్తి విజయవాడలో నాతో కలిసి భాషించేవాడేనా ? సభలోవిన్నాననని చెప్పినవాడా ? గాలివార్తల మోతకాదా ? అతడెవ్వడైతేనేమిగానీ, ఏం చెప్పనీయండిగానీ, అసలు దేవాదాయంలో మీకు ఉద్యోగ మన్న స్పృహ నాలో లేకపోయిందని అంటోంటే, అన్నారో లేదో ఇప్పుడు మీరన లేదంటున్నారు – అంతమాత్రానికే నామనస్సులోనుండి మీరన్నారన్న మాటే మరచి పోతానని ఉదారబుద్ధి నాపట ప్రదర్శిస్తున్నట్లు రాస్తున్నారు. అటువంటిది అనవసరం. తేల్చుకోకుండా యిదెందుకు ?

ఎవరో చెప్పగా విజయవాడలో విన్నవారు, నేరుగా నాయింటికివచ్చి, కూర్చుండి మంచీచెడ్డ మాట్లాడుకొని, ఇలా ఒకమాటవిన్నాను ఇదేమిటీఅనిఅడిగి తెలుసుకోవచ్చుగదా ! మీరేమైనా పరాయివాళ్ళా ? పరాయివాళ్ళేవచ్చి, నాతోగడిపి వెళ్తారే ? మీకేమి అభ్యంతరం ? ఉందేఅనుకో రాకుండా ఫోన్లోఅడిగి తెలుసుకో వచ్చునే ? ఇంకా బాధవుంటే కృష్ణాబాయిగారివంటి, నాతోరాకపోక, మాటా మంతీ కలవాళ్ళతో ఇలా విన్నాను, మీరు విన్నారా, కాస్త కనుక్కోండిఅని అడగటం ఎంతో సున్నితమే ! ఆమెతో మీరనలేదటకూడా. దీనికిబదులు, మీరు తిరుపతివెళ్ళి పోస్టులో రాశారు. పైనపైనాలుగా గింజుకులాడిపోతూ నానారకాలుగా ఆవేశంతో కాగిపోతూ రాశారు. "నీరచనోత్సాహమునేమెచ్చుకొందు సిరిసిరిమువ్వా" అని మీ ఉత్తరం ముగించారు. ఎంతకు తెగబడ్డారు ! అంతామరచిపొమ్మంటారు ఇట్టే. మరచిపోగలను, ఎక్కడైనాయింత అనుచితం జరిగిందేఅన్న పశ్చాత్తాపరేఖ లేశం కనిపిస్తే మీరాతలో, అలాగే మరచిపోతాను. ఇదంతా వ్యక్తిగతంగా రాశాను. ప్రచురించరాదు. ప్రచారములో పెట్టరాదు మీఉత్తరాలను అలాగే కప్పిపెడతానని మాటఇస్తున్నాను అనేవరసలో రాస్తే నిజాయితీని, మనస్తాపాన్ని, ధ్వనిస్తున్నట్టా ? నిలువెల్లా దంభం నిండినట్టులేదా ? మళ్ళీ చెబుతున్నాను ఇదిగో .... అనేవరస శత్రువుతో హెచ్చరికగా మాట్లాడటం కాదా ? మీరు మా విరసానికి శత్రువులు కారన్నారుగదా నన్ను. ఒక పీఠాధిపతి గొంతుకొకటి అలవాటుచేసుకొని ఆర్ద్రత చంపుకొని మాట్లాడ్డానికి ఇలా అంకితమై పోయారులావుంది. కనీసం man to man relationship ఏర్పరచుకోవటంచేత గాక, కృత్రిమమైన గోడలుకట్టుకొని, భేదబుద్ధికి అలవడి ప్రవర్తించటంకాదా ? మనస్సు ఎదగక, వికసించక, పరిణతి చెందక ఇలా దూరదూరంగా జరిగి గీతలు గీసేసుకొని ఏమిటీ correspondence ? నిగ్రహించుకొని నెమ్మదించి ఇదంతా పునరాలోచించుకోండి, మీలోమీరే – మీకే తెలుస్తుంది దీని Hollowness.

మరచిపోయాను – కావలి సదస్సుమాట U. G. C గ్రాంటు గవర్నమెంటు నుంచి కాదా ? ఎవరొస్తే ఏమిటీ, ఎవరు జరిపిస్తే ఏమిటీ ? అగ్రాంట్సు ప్రభుత్వం

హస్తాలనుంచీ, మీరుమొకం చూడనిమంత్రుల సంతకంక్రింద మంజూరైనవికదా పండి తారాధ్యుడు భవులమొకం చూడనని తనమొకానికి గుడ్డకప్పుకొన్నాడు. విష్ణునామం విన రాదని చెవులకు గంటలుకట్టుకొన్నాడు ఘంటాకర్ణుడు. ఇప్పటికీవాళ్లు సజీవులేనా ?

అది రైతాంగ పోరాటమయితే వేమనసదస్సులో ధర్మకన్నాలు, మార్క్సిజం మాటలున్నాయి. అక్కడమార్క్సిస్టులుంటే ఇక్కడాకొల్లా, జ్వాలాముఖి యింకాయిత రులుపాల్గొంటున్నారు. గవర్నమెంటు సొమ్ముఏరూపంలోనూ గ్రాంటుగావుండలేదు. సరే విషయాలివీ:

బహుశానాపుస్తకంమీద అభిప్రాయంకొరకు సభఒకటి ఇక్కడఆలోచిస్తున్నారు. అదంటూ జరిపితే పిలుస్తారు-రండి.

కాని మన Correspondence మీ పత్రికల్లో ప్రచురించమని అభ్యర్థిస్తున్నాను మీకువనరుంది. ప్రచురించండి. తప్పకుండా. మనం దాచుకోకూడని విషయంఇది.

వేమన మీద నా రచన, మూల్యనిర్ణయం, పరమ ప్రమాణం తిరుగులేనిమాట అని అనటంల్లేదు. అందరం ఒక్కసారైనే కలసి చేద్దాం అనుకొన్నాను. National Debate కోరాను. ఇప్పటికీ ఇదే నాదృష్టి : మీ సంస్థమీద నాకు ద్వేషం లేదు. మీమీదాలేదు:అసలు మిమ్మల్ని కావాలనుకొన్నాను. అందుకే ఎవరిని పిలవమంటే వారిని పిలిచాను మీలో. ఎనిమిది మందిని పిలిచాను. కడకిలా చేశారు. మీసారధ్యంలో విరసం వేమన సదస్సుకు వెళ్ళరాదనుకొన్నది. ఎంత బేసబబు ? ప్రశాంతంగా ఆలోచించండి.

ఇంకా యిటువంటి వుత్తరాలు వ్రాయొద్దు, ఉపయోగంలేదు. ఇక అచ్చులోనే కలుద్దాం యిటువంటి విషయాలమీద.

ఇట్లు

సెలవు. త్రిపురనేని వెంకటేశ్వరరావు

విజయవాడ. 8-7-81

## మధుసూదనరావుగారి లేఖ - 4

తిరుపతి

7-7-81

వెంకటేశ్వరరావుగారికి,

మీ ఉత్తరం మీరు కోరిన విధంగానే ఇక నేను మీకు రాయను. మీరు రాస్తే నాకు అభ్యంతరం లేదు.

మీ

మధుసూదనరావు

ఆవిష్కరించబోయే పుస్తకాన్ని గురించినేను చెప్పడం సబబుగా ఉండదను కొంటాను. నేను క్లుప్తముగా చెప్పిన విషయాలను గురించీ, ఇంకావెన్నో సరికొత్త విషయాలనుగురించీ శ్రీ వెంకటేశ్వరరావుగారు తమ పుస్తకంలో విపులంగా విజ్ఞతతో చర్చించారు. చదివితే మీకే తెలుస్తుంది పుస్తకంయొక్క గొప్పతనం.

—జస్టిస్. ఓ. చిన్నపరెడ్డి
Supreme court of India

* * *

చిక్కడపల్లి, హైదరాబాద్,
17-5-81.

"మీ గ్రంథము పూర్తిగా చదివాను. మీ పీఠిక చాలా బాగున్నది. వేమన యోగిని గూర్చి మీరుచేసిన పరిశోధనలు అపూర్వములైనవి. మీరు చేసిన చర్చలు చాలా గొప్పవి. మీరు వేమనయొక్క విశ్వరూపమును చూపించగలిగినారు. చాలా విషయాలలో వేమన్నమీతో ఏకీభవిస్తున్నాడు. వేమన ఆంధ్రదేశవిజ్ఞాన వికాసానికి మూలపురుషుడు. మీరుచేసినకృషికి మనస్ఫూర్తిగా మిమ్ములను అభినందిస్తున్నాను."

—శ్రీ దిగవల్లి వెంకటశివరావు

♦ ♦ ♦

26 - 5 - 1981
Waltair

I have read your book. I was very much impressed by your deep Probing, searching analysis and wide scholarship. It is far superior to many of our doctoral theses. I congratulate you.

**K. Satchidanda Murty**
Professor Emeritus,
(Philosophy)
Ex-Vice-Chancllor, S. V. university

## ఉపసంహరణ – విశాలాంధ్ర లేఖలు etc

## 85

ఇంత అందమైన వుత్తరాల 'పర్వం అనవసరం, వద్దు అన్నతర్వాత, ఇక సభాపర్వమొకటి తలపెట్టారు. 'వేమన – విరసం' పేరున విజయవాడ టాగోర్ గ్రంథాలయం రీడింగ్ రూములో 9 ఆగస్టు, 81 న ఒక చిన్నసభపెట్టారు. దానికి నన్ను పిలవమని, పిలిచి విమర్శ వినిపించమని కొందరు వీరికి సూచిస్తూ,పిలుపువస్తుంది, పనులమీద మీ రెక్కడికీ పోవద్దు, ఇంటివద్దే వుండ మన్నారు. అలాగే వుండిపోయాను. పిలవలేకపోయారు. ఈ సభ చర్చకోసంకాదు – ఆయనమీద ప్రొసెస్తుకోసం, నిరసన కోసం, దానికి పిలవడం దేనికి అన్నారని ఆమధ్యాహ్నానికి వార్తముట్టింది. ఇకవీరి విమర్శవిని విశదంగా చెప్పేవారికై వెదికి, ఒక ప్రసిద్ధ పత్రికారచయితను కోరాను. ఈ సభ ఏర్పాట్లలో వున్న వాళ్ళు వూళ్ళో అంటున్న భయంకరమైన మాటల్ని చాల చెప్పి, I want to live for some time more ఈ సభకు వెళ్ళలేనన్నారు వారు. దానితో ఒకరిచేత టేపురికార్డరు పంపించి ప్రసంగాన్ని రికార్డుచేయించాను. సభకువెళ్ళి విన్నవారు చెప్పుకొంటున్న వింత సంగతులువిని కొందరీ టేపు తీసుకెళ్ళి విని Check - up చేసుకోసాగారు. కొన్నివారాలకు విశాలాంధ్రలో ఒకలేఖ వచ్చింది. దానిపై వారి వివరణ – అలా అనలేదు, ఇలా అనలేదు అంటూనూ వచ్చింది. సభలో నాభావాల గూర్చి చెప్పిన కొన్ని అబద్ధాలను ఈ లేఖలో వ్రాశారు. విశాలాంధ్రవారు దానిమీద నన్నువినదలచారు. విన్నారు. టేపులో ఏమున్నదో కూడా చూపించాను.

దానితో నామీద సాగించే ఆర్థికారోపణా పర్వం బరిలోకివచ్చింది. రమణారెడ్డి గారి కర్తృత్వం తేటతెల్లమయింది. నిరాధారపు నిందలు వ్రాశారు. కంగారుగా ఉప సంహరించుకోపోయారు. అది వెంటనే కుదరకపోయింది. నేనేదో ఆగ్నేయాస్త్రం సంధించి వున్నానని, ఆ అస్త్రం వదలొద్దని, రాబోయే అరుణతార సంచికలో ఉప సంహరణ పడుతుందని వ్రాశారు. బ్యాంకుఖాతా చూచుకొని, తప్పువ్రాతగా తెల్సుకొని నైతికాపరాధంగా తెల్సుకొని వుపసంహరించుకోగోరానుగాని, లీగల్ నేరంగా తెల్సు కొని జడిసి చేసే ఉపసంహరణ నాకవసరంలేదన్నాను. పైగా, లీగల్ చర్యలాలోచించ లేదని, ఆలోచించనని హామీ యిచ్చాను. ఏమైనా ఉపసంహరించుకొన్నారు. ఎలా వుప సంహరించుకొన్నారో పాఠకులే నిర్ణయించుకోవచ్చు.

విశాలాంధ్రలో లేఖకుడు టి. వెంకటేశ్వర్లు త్రిపురనేని వెంకటేశ్వర్రావే కాగూడదా అని ఒకరు, ఆయనే పేరుమార్చుకొని వ్రాశారని మరొకరు – డామేజస్ వేస్తారంటున్నారట నిజమేనా అని, వెయ్యకుండా చూడమనీ పలువురొద్ద వలుతెరగుత్తే

నిజంగా సభలో మాకార్యదర్శి అలాగేమాట్లాడారా అని విచారిస్తూ - నిజంగా అలాగే మాట్లాడారని వింటూ (నావద్దనున్న టేపు వినగోరకుండా) సాంస్కృతికేతర పోరాటం సాగిస్తాం అని అన్నాను, సాగిస్తానుకూడా అని కార్యదర్శి అచ్చులో వ్రాసినాకూడా-సాంస్కృతికేతరమైన పోరాటం విరసం చెయ్యదు, మాకార్యదర్శికి అసలటువంటి అభిప్రాయమేలేదు, అలావుందని విన్నా, చదివినా నమ్మకండి, నమ్మకండి అని వ్రాయడంతో గడచిన మరో వింత ఘట్టాన్ని ఇక చదువుకోండి.

విశాలాంధ్ర, 9—9—81

మహాశయా !

ఈ మధ్య వేమనగూర్చి విరసం వారు విజయవాడలో సభను ఏర్పాటు చేశారు. శ్రీ త్రిపురనేని మధుసూదనరావు మాట్లాడారు.

వేమన వికాస కేంద్రానికి ఆర్థిక సహాయం అమెరికా నుండి చేశారని చెప్తున్నారని అన్నారు. ఈ విషయమై లోతుగా వివరించాల్సిన బాధ్యత శ్రీ త్రిపురనేని మధుసూదనరావుమీదనూ, అలాగే ఈ కేంద్ర నిర్వాహకులైన శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు పైననూ వుంది.

మార్క్స్ కంటె వేమన ఎంతో ముందు వున్నాడని శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు సిద్ధాంతీకరించాడని ఇది సరికాదని శ్రీ మధుసూదనరావు చెప్పారు. 'శ్రమములోన బుట్టు సర్వంబు' అన్న వేమన పద్యపాదాన్ని విశ్లేషించినపుడు శ్రీవెంకటేశ్వరరావు చెప్పింది సబబేనేమోననిపిస్తోంది, శ్రీ మధుసూదనరావు చెప్పింది విన్నాక ఒక్క వేదికపై వీరిద్దరిని వుంచి వాద, ప్రతివాదనలు వింటే విజ్ఞానదాయకంగా వుంటుందనిపిస్తోంది. దీనికై ఎవరైనా ప్రయత్నిస్తే బాగుంటుంది.

శ్రీ మధుసూదనరావు ఉపన్యాసంలో ప్రధానంగా యిబ్బంది కల్గించిన విషయాలు రెండున్నాయి. ఒకటి శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు వ్రాసిన వేమనమీద గ్రంథం కేవలం వి. ర. సం. మీద దాడిచేయటమేననటం, రెండు భారతీయ జనతాపార్టీ వారి ఆర్థిక సిద్ధాంతాన్ని వేమనకు అంటగట్టాడనటం. ఇది చాలా అసంగతమే అని పుస్తకం చదివిన వారికి అనిపించక మానదు.

ఉపన్యాసం అంతా ఒక ఎత్తు. ముగింపులో శ్రీ మధుసూదనరావు కాస్త తొందరపడ్డారనిపించింది. లేకపోతే 'ఇలాంటి గ్రంథాలపై సాంస్కృతిక పోరాటం చాలకపోతే ఏ పోరాటమైనా చేపట్టాలి' అని అన్నారు. అది మర్యాదగాచెప్తే చాలదని అర్థమా ?

టి. వెంకటేశ్వర్లు, విజయవాడ.

# విరసం కార్యదర్శి వివరణ

విశాలాంధ్ర, 23—9—81

మహాశయా!

1. వేమన వికాస కేంద్రానికి అమెరికా ఆర్థిక సహాయం చేసిందని నేను అనలేదు. అమెరికాలో నివసిస్తున్న భారతీయ డాక్టర్లు ఇద్దరు వేమన వికాస కేంద్రానికి డబ్బు ఇచ్చినట్టు వెంకటేశ్వరరావు పత్రికాముఖంగానే చెప్పాడు. ఇందులో ఏమీ తప్పులేదు. వెంకటేశ్వరరావు మీద నేను ఏ రకమైన ఆర్థిక ఆరోపణా చెయ్యలేదు.

2. వెంకటేశ్వరరావు తన గ్రంథంలో విరసం సభ్యుల అభిప్రాయాల్ని ఖండించాడు. విరసం ఆవిర్భావానికి ప్రేరణ నిచ్చిన శ్రీకాకుళ పోరాటాన్ని దారితప్పిన పోరాటం అన్నాడు. విప్లవ కవిత్వంకంటే, ఆధునిక కవిత్వంకంటే వేమన కవిత్వం గొప్పది అన్నాడు. మార్క్సిజంలోని మౌలిక సూత్రాలు మార్క్సుకంటే ముందే వేమన చెప్పాడని రాశాడు.

3. సమాజంలో పేదరికాన్ని నిర్మూలించటానికి దానం పరిష్కార మార్గంగా వేమన చెప్పాడని వెంకటేశ్వరరావు సిద్ధాంతం చేశాడు. దీనికీ ధర్మకర్తృత్వ సిద్ధాంతానికీ. బి. జె. పి. ఆర్థికసిద్ధాంతానికీ పోలికల్ని గుర్తించటం పెద్దకష్టం ఏమీకాదు. అయితే వెంకటేశ్వరరావు బి. జె. పి. పార్టీలో ఉన్నాడని నేను అనలేదు. ఆయన ఏదో ఒక రాజకీయ పార్టీలో వున్నాడో లేదో నాకు తెలీదు.

4. సాంస్కృతిక పోరాటం చాలకపోతే ఏ పోరాటమైనా చేపట్టాలి అని నేను అన్నది అక్షరాలా నిజం. ప్రజావ్యతిరేక, విప్లవప్రతిఘాతుక రచయితల్ని ఖతంచేసే కార్యక్రమం కానీ, తన్నే కార్యక్రమం కానీ విరసానికి లేదు. తప్పుడు సిద్ధాంతాల మీద పోరాటం చెయ్యటానికి అనేక రూపాలు వుంటాయి. ఆ రూపాలలిస్టు ఇవ్వవలసిన అవసరం నాకులేదు.

వెంకటేశ్వర్లు సభకి వచ్చి నా ఉపన్యాసం విన్నాడని అనుకోవాలి. సభలో ఉండి ఈ వెంకటేశ్వర్లు ఏమి చేస్తున్నట్లు, నా ఉపన్యాసంలో ప్రధాన విషయాలు (1) వేమన తాత్వికదృష్టి, (2) వేమన ఆర్థిక సిద్ధాంతం. (3) వేమన నైతిక దృక్పథం, (4) వేమన చేసిన స్త్రీ నింద (5) వేమన కవిత్వం. ఈ విషయాల మీద వెంకటేశ్వరరావు చేసిన సిద్ధాంతాల్ని ఖండించి నా అభిప్రాయాలు చెప్పాను. వెంకట

శ్వరరావు తన గ్రంథంలో ప్రస్తావించని విషయాల్ని కూడా కొన్నింటిని చెప్పాను. వేమనని గురించి, నేను చెప్పిన ప్రధాన విషయాల్ని వెంకటేశ్వర్లు తన ఉత్తరంలో చాలా చాకచక్యంగా వదిలేశాడు. వెంకటేశ్వరరావు చెప్పింది సబబుగా ఉంది. మధుసూదనరావు చెప్పింది అసంగతంగా ఉంది అని చెపుతూ మా యిద్దరినీ ఒకే వేదిక మీద మాట్లాడమనటం ఎందుకు ? ఎందుకు, వినోద కాలక్షేపానికి నాకు సమయంలేదు.

త్రిపురనేని మధుసూదనరావు, తిరుపతి.

## వివరణపై అభిప్రాయం

విశాలాంధ్ర, 24—9—1981

మహాశయా !

భారతయుద్ధం మధ్య అశ్వత్థామఅనే ఏనుగుచావునొక పెద్ద వార్తచేసి ప్రకటించడం, ఆ ప్రకటించడంలో "అశ్వత్థామాహత:" అని అరచి, "కుంజర:" అనిమాత్రం గొణిగి, అప్రధానమైన టెక్నికల్ పదాల మాటున ప్రాణాలుతీసే తీరు చూశాం. అటువంటి 'టెక్నికల్ల సత్యాలనే' వెంకటేశ్వరరావు వేమన పరిశోధన మీద విరసం వారు సాగించే సాంస్కృతిక పోరాటంలో ప్రయోగించడం చూస్తున్నాం. "అమెరికా నుండి హైద్రాబాద్ దాకా" వేమన మీదే పరిశోధనమవి, అమెరికా నుండి ఆర్థిక సహాయం చేశారని చెప్తున్నారని, బి. జె. పి. ఆర్థికదృక్పథమని ప్రస్తావించిన తీరూ ప్రయోజనమూ అదేగాని, అన్యంగాదు. ఆ ప్రస్తావన తీరుకి అమెరికన్ ఆర్థిక సహాయమని, బి. జె. పి. సభ్యత్వమనే అర్థ విస్తృతికి ఆటంకం లేక పోయేసరికి అదేమిటో లోతుగా వివరించమని పత్రికలో లేఖకులడగవలసి వచ్చింది.

ఇప్పుడు వివరణలో రాసినట్టుగా "అమెరికాలో విహరిస్తున్న భారతీయ డాక్టర్లిద్దరు డబ్బు యిచ్చినట్లుగా" సభలో వీరు చెప్పారా ? చెప్పకపోగా, పైగా విజయవాడ వేమనసభలకు పిలిస్తే తాము వెళ్ళకపోవడానికి కారణాలంటూ చెప్తూ, మంత్రుల్ని పిలుస్తున్నారనే దానితోపాటుగా అదీ నిజంగాదు,"అమెరికాలో మిత్రులెవరో ఆర్థిక సహాయం చేస్తున్నారు. అన్నదాన్ని కూడా కలిపి కారణంగా చెప్పలేదా ? అది దురర్థ ధ్వని కాదా ? శంకాస్పదం చెయ్యటం కాదా ? (అమెరికానుంచి హైద్రాబాద్ దాకా వేమన ఆరాధన సాగుతున్నదని అధ్యక్షస్థానంలో వుండి ప్రసాద్ అన్నారు)

"వెంకటేశ్వరరావు మీద నేను ఏ రకమైన ఆర్థిక ఆరోపణాచెయ్యలేదు" అని వ్రాస్తున్నారు. వీరు కార్యదర్శిగా వున్న విరసం అధికార పత్రిక "అరుణతార" లో ఆర్థిక ఆరోపణ వీరు చెయ్యలేదా? వీరు చెయ్యకపోతే, దానికి వీరి సమ్మతి, ఉపేక్ష లేదంటారా? లేదన్నట్టయితే దాన్ని ఖండించమని కోరుతున్నాను. డాక్టరు దంపతులు ఎందుకో యిచ్చిన పాతికవేలకు తమ సొంత సొమ్ము కొంతచేర్చి శ్రమపడి వేమన సభలు జరిపారని రాశారు. ఆ పాతికవేలు ఖర్చు కావడం అబద్ధమే. ఆ నిధి మరెందుకో యిచ్చారనటమూ అబద్ధమే. బ్యాంకు ఖాతా వుంది. లిఖితాలున్నై. ఆనాటి పత్రికా ప్రకటనలున్నై. — చూచుకొని ఇవి తప్పని తేల్చుకొని, ఆ వ్రాత ఉపసంహరించమని కోరుతున్నాను. అది కనీసమైన చిత్తశుద్ధి.

ద్రోహబుద్ధినైన, దొంగరికమునైన, సాహసమునైన, నటనలనైన సంపదధికునుండి సాధించి ధనమును బడుగువారికి పంచిపెట్టుమన్న వేమన వుద్యమం విఫలమైన తర్వాత బంగారం చేసి తెచ్చిపేదలకు పంచుదామని రసవాదుల గుంపులో చేరి, ఆ విద్యా ఫలించకపోయి, దిగంబరయోగిగా పరిణమించి, ఎన్నో తత్వాలను లోతుగా విచారించి ఎన్నెన్నో సాధనలను చేసి చూసి, యోగుల్లోని కపటాల్ని, దంభాన్నీ తెగ నిరసించి, ఆ యోగవ్యాయామమే అసలక్కరలేదన్న వరకూవచ్చి, ఐహికాన్నీ, సమాజాన్నీ, అశ్రద్ధచెయ్యని తత్వాన్ని శూన్యవాదంలో అందుకొని, తిరిగి సంఘంవద్దకు వచ్చి, బోధకుడైన దశలో కూడా ఆర్థిక సమస్యను వదిలేయలేదని, ఆర్థిక వ్యత్యాసాలు తగ్గాలని, దారిద్ర్య నిర్మూలనం జరగాలని, బోధిస్తూ ఆ స్త్రీపరంపరా సంక్రమణ కూడదన్నాడని, పెళ్ళిళ్ళు కలవాళ్ళ లేనివాళ్ళ మధ్యనే జరగాలని చెప్పాడని, పూర్వ సాహస మార్గాలను చెప్పడం మాని కారుణ్య బోధకుడుగా పరిణమించి, దాన ప్రబోధాన్ని చాలా ఎక్కువగా, విశేషలక్షణాలెన్నింటినో చేర్చి నాటి విశ్వాసాలనే తనకు నమ్మకమున్నా, లేకపోయినా, దోపిడికెదురెత్తుగానూ, ఆనాడు నిస్సహాయమైన క్రింది వర్గాలకు అనుకూలంగానూ వాడిన వైనం కానవస్తున్నదని వ్రాశాను.

అంతేగాని వీరు లేఖలో రాసినట్టు "పేదరికాన్ని నిర్మూలించడానికి దానం "పరిష్కారమార్గం"గా వేమన చెప్పాడని," నమ్మాడని నేవ్రాయలేదు. ఇది వక్రీకరణమే. వేమన దాన సిద్ధాంతాన్నో, ప్రబోధాన్నో, నేటి దారిద్ర్యాన్ని పరిష్కారమార్గంగా నేను రికమెండు చెయ్యలేదు. అలా బోధించాలన్నది నా ఉద్దేశం అని చెప్పినా, ధ్వనించినా దారుణమే, దురుద్దేశ పూర్వకమే.

వేమన దాన సిద్ధాంతం గాంధీగారి ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని పోలిందనటం కూడా వివాదాస్పదమే. జ్వాలాముఖి ఇలాగే అంటే దాన్ని చార్వాక పత్రికలో చర్చించాను. బి. జె. పి. ఆర్థిక సిద్ధాంతమేమిటో నేనింకా చూడలేదు. ఒకవేళ వేమన దాన సిద్ధాంతానికి దానికి పోలికవుంటే అది నాతప్పుకాదు.(అయినా అదీ చూపితేబావుంటుంది)

"మార్క్సిజంలోని మౌలిక సూత్రాలు మార్క్సుకంటే ముందే వేమనచెప్పాడని" వ్రాశాననటం పెద్ద అభాండం. అభూతకల్పన. "శ్రమములోన బుట్టు సర్వంబు తానౌను" వంటి వేమన పంక్తులకు భౌతిక వాదపరమైన అర్థంతో, శ్రమే సంపదకూ సర్వానికి మూలం అనే అర్థంతో ఆరుద్రగారు చేసిన వ్యాఖ్యాన ధోరణి సరికాదని, నేటి భావవాతావరణాన్ని బట్టి "భూమి నాదటన్న భూమి ఫక్కున నవ్వు" ననే పంక్తితో వేమన వ్యసాయంలో వ్యక్తిగత ఆస్తి వుండరాదన్నాడనటం వంటి వ్యాఖ్యానాలకు (ఎవరూ చెయ్యలేదు) వుత్సహించరాదని కూడ వ్రాసినవాణ్ణి. ఆస్తి పరంపరా సంక్రమణనుకాదనటం కూడా దేశీయ భావ సంప్రదాయానికి చేసిన సవరణ అన్నవాణ్ణి అలాగంటూ అతనిది "సామాజిక వాదమో (సోషలిజం) సామ్యవాదమో (ఈక్వలిటేరియనిజమ్)సర్వోదయమో కాక అటువంటి దృష్టి యేఇంకొకటియోకాదని"స్పష్టంగా (47, 48, 49) పేజీల కొలదిగా వ్రాశాను. ఇలా నవీనదృష్టి భాష్యాల్ని వేమన కివ్వ రాదన్న నన్ను, "అన్నీవేదాల్లోనే వున్నాయిష"అన్నట్టుగా మార్క్సు మౌలిక సూత్రాలే వేమనలో వున్నాయంటున్నానని, ఇదేదో బి. జె. పి. కి తోడ్పాటని ఉపన్యసించారు.

అప్పట్లోనే కులవ్యత్యాసాలకన్నా కలిమిలేముల వ్యత్యాసాలే ప్రమాదకరమైన వని, వాటిని తగ్గించాలని, సంఘంలో ఆర్థిక (పునర్వ్యవస్థీకరణ) అవసరమని – పేదరికపు సమస్య ఆకలిసమస్య మాత్రమేకాదని, అన్నం మనిషిని జంతుస్థాయిలో ప్రాణాలతో నిలబెట్టడం వరకేనని, ప్రాణాలతో నిలిచిన ద్విపాద జంతువుని మానుష మానంతో, మానవత్వపు విలువలతో నింపినిలబెట్టే సమస్యే "పేదరిక నిర్మూలనా సమస్య అని, వేమనతప్ప అప్పట్లో మరెవ్వరూ మనదేశంలో ఇలా చెప్పలేదని, అదే వేమన గొప్పతనమని అనుకొన్నాను వ్రాశాను.

"వెంకటేశ్వరరావు వేమనమీద విరసం సభ్యుల అభిప్రాయాల్ని ఖండించా" డన్నారు నిజమే ప్రజాకవి కాదు, వ్యాపారస్తుల కవి అన్నందుకు ఖండించాడు. ఈ ఖండనకేగదా ప్రజావ్యతిరేక విప్లవ ప్రతీఘాతక రచయితగా ముద్రవేయటం. వీరింత దాకా తేగగ్గినవారనే, వ్రాయనన్న ఖండనాన్ని అలా జరగదని వ్రాయించింది కూడా విరసంమిత్రులే. అదే పీఠికలో చెప్పాను కూడా.

ఇక నా అంకితంలోని శ్రీకాకుళం పోరాటంమాట : ఈ పోరాటంలో పాల్గొని సజీవులై మిగిలి వున్నవారు భిన్నవర్గాలుగా విడిపోయి, యీ పోరాటానుభవాన్నిగూర్చి భిన్న భిన్నమైన అంచనాలకు వచ్చిన వస్తున్న సమయంలో "ఈ పోరాటం ప్రేరణగా" ఆ తర్వాత ఆవిర్భవించిన విరసం ఈ పోరాటం తన గుత్తసొమ్ము అయినట్లూ, వారే దానికి అధికార చరిత్రకారులూ,భాష్యకారులూ ఐనట్లుగా మాట్లాడటం విచిత్రంగావుంది. ఆసీమలోని అసలుపోరాట వీరులు అంకితాన్ని హర్షించుతున్నారు. అదేమాకు చాలు.

"విప్లవ కవిత్వంకంటే, ఆధునిక కవిత్వంకంటే వేమన కవిత్వం గొప్పదన్నాననే" మాట కూడా అబద్ధమే. వేమన కవిత్వాన్ని యాభై పేజీల్లో చర్చించాను గాని, విప్లవ, ఆధునిక కవిత్వాలతో పోలికపెట్టి పోటీపెట్టి చర్చించనేలేదు. చూడగోరుతాను.

అభిప్రాయ భేదాల విషయంలో సాంస్కృతిక పోరాటం చాలకపోవటమేమిటో, చాలదనే ప్రశ్న చర్చ సరిగ్గా ఆరంభంకాకముందే కలగటమేమిటో, చూడగా సభాముఖంగానూ పత్రికా ముఖంగానూ సాగాల్సిన వివాదాన్ని సాంస్కృతికేతర మార్గాలకు మళ్ళించాలని విరసం కార్యదర్శిగారు కోరుకొంటున్నట్లు, త్వరపడుతున్నట్లు కనిపిస్తున్నది. ఒకేవేదికనుంచి మాట్లాడడానికి ఇష్టపడటం లేదు. తాము సభ పెట్టి నన్ను ఖండించడం విజ్ఞానదాయకమై, ప్రత్యర్థితో ఒకే వేదిక నుండి వాదంలో పాల్గొంటే వినోద కాలక్షేపంగా మారిపోతుందా ? సమయం లేకపోతుందా ? లేఖకుల సభాప్రతిపాదనను త్రోసిపుచ్చి "ఏ పోరాటరూపమైనా చేపట్టాలన్నది అక్షరాలా నిజమని" ఘంటాఘోషం చెయ్యడమంటే ఆ సాంస్కృతిక పోరాట పద్ధతులను వెంటనే అవలంబించనున్నామని భయపెడుతున్నారన్నమాట. ("ఖతంకార్యక్రమం,తన్నేకార్యక్రమం" లేదంటూనే, అసాంస్కృతికపోరాటం ఇంకొకటున్నదనీ, అందులో అనేక రూపాలుంటవని ప్రత్యేకించి చెప్పి, ఆరూపాల్ని మాత్రం చెప్పనని ఒక రహస్యంచేసి, ఊహించుకొంటూ వుండండిసుమీ అన్నట్టుగా వదిలేయడం అంతా భయావహవాతావరణ సృష్టికేనని స్పష్టపడుతున్నది. అదేదో ఇప్పటికే కొంత చవిచూపించారనుకొంటాను. సాంస్కృతిక విషయాల్ని అసాంస్కృతిక పోరాటమార్గాల్లో పరిష్కరించడం విరసంవిధానంగా రూపొందుతున్నదనుకోవచ్చునా ? 'ఖతంకార్యక్రమం, తన్నేకార్యక్రమం' - సంస్కృతీ రంగంలో అభాషవాదకమే ఎటువంటి స్థాయిని చూపిస్తున్నదో తెలుస్తావుంది.)

కాని వేమనమీద వీరుచెప్పిన ప్రధాన విషయాలను అవేవో లేఖకులు వదిలేశారని బాధపడుతున్నట్లున్నారు. ('శ్రమములోన బుట్టు సర్వంబుతానౌను' అన్నపంక్తిని

పద్యాన్ని గూర్చి ఎత్తారుగదా! అది చర్చించకపోయారా లేఖలో(కాస్త) అయినా, మించుకుపోయిందేమీలేదు. అంత ప్రధానమైన వైతే సమయం చూచుకొని వ్రాస్తే పత్రికా ముఖంగానైనా తప్పకుండా విజ్ఞానదాయకంగానే చర్చించుదాం.

త్రిపురనేని వెంకటేశ్వరరావు, విజయవాడ.

కావలి, 5-10-81.

కె. వి. రమణారెడ్డి

శ్రీ వెంకటేశ్వరరావుగారికి,

ఈ జాబును చూసి మీరు ఆశ్చర్యం చెందవచ్చుగాని చెందవలసిన అవసరంలేదు. మధ్యలో వారి మాటలమూలంగా మీరు నామీద కినుక వహించినట్టుంది. పైగా; 'అరుణతార' (సంచిక 19-20) - వేమన మనవలు శీర్షికకింద రాసినదానిలో (పేజీ 38) మూడో పేరా మొదటి వాక్యం అగ్గిమీంపోసిన అజ్యమై వుంటుంది. విషయం తెలియక రాసిన వాక్యంగనక దాన్ని నేను వుపసంహరించుకొంటున్నాను. ఈ సంచిక లోనే అచ్చువేసేందుకు సవరణ పంపానుగాని అది మిస్‌అయినట్టు యిప్పుడే జాబు వచ్చింది. కనీసం స్లిప్‌మీదనైనా వేయిస్తాను, లేదా వచ్చే సంచికలో భాగంగానే వేయిస్తాను. నా మీద సంధించివున్న అగ్నేయాస్త్రాన్ని వుపసంహరించుకుంటారని నమ్ముతున్నాను. మన మధ్య నిజానికి ఏ వైరమూలేదు, వుండవలసినపని లేదు.

మీ

— కె. వి. ఆర్. రెడ్డి. —

కావలి, 15-10-1981.

శ్రీ త్రి. వెంకటేశ్వరరావుగారికి, మీ వుత్తరం అందింది.... ....

.... .... అగ్నేయాస్త్రం వగైరా మాటలు కేవలం Figurative. నా మీద మీకు కోపంవచ్చివుంటే దాన్ని తొలగించుకొమ్మని కోరేందుకే అలా రాశాను .... ఇలా సవరణ వేస్తున్నానని రాశాను. తర్వాత ఆయన యిష్టం అనేదే నా ధోరణి ....

సాంస్కృతికేతర పోరాటమా ? నమ్మకండి, నమ్మకండి. నమ్మకండి. మాలో ఎవ్వరికీ అలాంటి ఆలోచనేలేదు ముఖ్యంగా మా కార్యదర్శికి.... మీ

కె. వి. రమణారెడ్డి.

ఇక విరసం కార్యదర్శి ప్రసంగాన్ని టేపునుంచితీసి చార్వాకవారు ప్రచురిస్తామని ప్రకటించారు. ఇంతలోవారే అరుణతారలో తమ పద్ధతిలో తామే అచ్చువేశారు. ఈ సొంత పాఠాన్ని టేపు పాఠాన్నీ కలిపి విమర్శకు తీసుకొన్నాం — ఇదిగో....

# వేమన - విరసం విమర్శ - వినోదకాలక్షేపం

(విరసం కార్యదర్శి విజయవాడ ప్రసంగం)

విమర్శగా లెక్కజేయవలసింది కాదిది. మందితో కూడిన ఒక సంస్థ కార్యదర్శి మాటలుగాకపోతే దీన్ని పట్టించుకోవటం శుద్ధ దండుగ. పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షల్లో చిత్రాతిచిత్రమైన తప్పుడు సమాధానాలు అప్పుడప్పుడు మన పత్రికల్లో మంచి వినోద వార్తలుగానూ,చదువుల విషాదకరస్థితిసూచికలుగానూ వస్తుంటాయి. అంతకేమీ తీసిపోని వింత సంగతుల పుట్ట యీ ప్రసంగపాఠం.

ఆపైన, పదోతరగతి పరీక్షా పత్రంగా యిచ్చి "దీనింగల పూర్వాపర విరోధము లను చూపునది" అన్నట్లయితే పరీక్ష తప్పేవాడుండడని నిండా నమ్మొచ్చు. నవంబరు (1981) 'అరుణతార' సంచికలో 'వేమన' వ్యాసంలో విరసం కార్యదర్శిగారిని సొంత ఎడిటింగు చేసుకొన్న పాఠంలో ఇక చూడండి :

1]—"వేమన తాత్విక దృష్టి భూస్వామికానికి కవచం అయింది".

—"అప్పట్లో భూస్వాములొకవైపూ - వర్తకులకూ చేతివృత్తుల వారికి మరొకవైపూ ప్రధాన వైరుధ్యం వుండేది"

—"అందులో వర్తకులికీ, కార్ఖానా పనివారికీ, పల్లెలలోని శిష్టవర్గాలకు, అంటే మధ్య తరగతి రైతులకూ, యంత్రోత్పత్తితో సంబంధంలేని గృహపరిశ్రమలు సాగించే వారికీ వేమన భావప్రతినిధి...."—పేజీ 6.

—ఇందులో పరస్పర విరోధం వుందని మాత్రం పాఠకు లనుకోరాదని మా మనవి :

—ఇంగ్లండులోనే పారిశ్రామిక విప్లవం రాకముందు వేమననాడు దక్షిణ భారతంలో "కార్ఖానాలు" "కార్ఖానా పరిశ్రమలు" "యంత్రోత్పత్తి" నెలకొన్నవనిమాత్రం గ్రహించగోరుచున్నాము.

—"వేమన ప్రజాకవి కాడు.... వ్యవసాయంలో, కార్ఖానా పరిశ్రమల్లో.... చేతివృత్తి పరిశ్రమల్లో.... యజమానుల దగ్గర పనిజేసే శ్రమజీవులే ప్రజలు"

—సృజన 108వ సంచిక, పేజీ 72.

—మధ్యతరగతి రైతులూ చేతివృత్తిదార్లూ ప్రజలు కారని గుర్తుంచుకోవాలి. ప్రజలంటే కూలీలే. అప్పట్లో కూలిపనివాళ్ళు ఏ15% మాత్రమేగదా అంటే, అయితేనేమి, వాళ్ళే ప్రజలు. వేమననాడు దాదాపు 80% 85% భారతీయులు ప్రజలుకారు. అందుకే వేమన ప్రజాకవి కాడన్నారు.

—కాగా ఇప్పుడు ప్రసంగంలో కార్ఖానాపనివారికి కూడా భావప్రతినిధి అనడం చేత ప్రజాకవి అని అనదగునుగాని అవుననీ, కాదనీ అనకుండా అలా వదిలేసినట్టు గమనించాలి. వ్యాపారస్తులకవి అని కూడా ప్రసంగించలేదు. అలా అంటే వ్యాపారస్తుడైన వెంకటేశ్వర్రావు ఉలిక్కిపడుతున్నాడు అని ప్రసంగంలో చెప్పి, అచ్చులో తీసివేసినందుకు కృతజ్ఞత చెప్పుకొంటాడు.

## స్త్రీనిందకు కారణం స్త్రీల రతిపారవశ్యాశక్తి !!

—"యోగులు సన్యాసులు ఉపదేశకులుగా వున్నవారందరూ దేశదేశాంతరాల్లో స్త్రీ నింద చేసినవారే. దీనికి మతభేదం కూడా లేదు"— పేజీ 7.

—వీరశైవం మతం కాదేమోమరి, అది స్త్రీనింద చెయ్యలేదు సరిగదా, స్త్రీకి ఎంతో స్వేచ్ఛాగౌరవాలను యిచ్చింది. తంత్రం మతం కాదంటారేమో, అది దేశదేశాల్లో - వర్గసమాజంలో స్త్రీని పూజించమన్నది. అనాబాప్టిస్టులు స్వేచ్ఛాగౌరవాలిచ్చారుస్త్రీకి. ఇదంతా మరచిపోవాలిగావును. తాంత్రిక మతమూ, దాన్ని కంటగించుకొన్న వీరశైవమతమూ రెండూస్త్రీకి మన్నన జూపమన్నాయి. వర్గసమాజంలో ఉత్పత్తిలో పాత్రనుకోల్పోయినస్త్రీకి పరస్పరం విరుద్ధాలయిన ఈ రెండుమతాలూ స్త్రీపట్ల గౌరవాన్ని ఎందుకు చూపాయో ? చారిత్రిక, భౌతికవాదానికి విరుద్ధంగావర్తించాయేమిటో చెప్ప మన్నాను నండూరి ప్రసాదరావుగారిని ప్రజాశక్తిలో. ఆరోజుపొద్దున్నే ప్రజాశక్తి చదివి, ఆ సాయంకాలమే బెజవాడలో వీరు ప్రసంగింపారుగాని, వీరూ చెప్పారు కారు, అప్పటికీ, ఇప్పటికీ. పైగామతాలన్నీ స్త్రీనింద చేశాయంటూనే వున్నారు, ఎలాగబ్బా !

'స్త్రీనిందకు తంత్రశాస్త్రమే కారణమనడం ఏదోఒకపేరున వేమనను సమర్థించే యత్నం- వాస్తవానికి మాత్రం తంత్రంస్త్రీవ్యతిరేకంకాదు"— పేజీలు 7,8

—వాస్తవానికి తంత్రంస్త్రీవ్యతిరేకంఅన్నాడా, వెంకటేశ్వర్రావ్? అబద్ధంతోగాని వాదం నడవదా ? తంత్రవ్యతిరేకతగదా వేమన స్త్రీనిందకుకారణమన్నాడు టీ. వీ. ? తంత్రంస్త్రీని పూజ్యురాలినిజేసి మైధునాన్ని మతంగా మార్చిం దనిగదా టీ. వీ. మాట. వేశ్యలోప్రేమదొరకక, ఇల్లాలిలోదొరకక స్త్రీకి పెడమొగంబెట్టిన వేమనకు మోక్షందార్లోకూడా స్త్రీతగలటంతోగదా మరి మరీ నిందించాడన్నాడు. కాదా ?

—"స్త్రీలనీ శూద్రుల్నీ వ్యావసాయక అవసరాలకోసం సమాజంలోకి ప్రవేశపెట్టమని చేసిన పద్ధతి" తంత్రం అంటున్నారు— 8వ పేజీ.

తంత్రాచారం వచ్చేదాకా స్త్రీలూ శూద్రులూ అడవిలో గుహల్లో వుండిపోయారు. కాబోలు! తంత్రాచారులు బయల్దేరి వాళ్ళని పట్టితెచ్చి సమాజంలో చేర్చారని తెల్సుకోవాలికాబోలును. తంత్రం వచ్చేదాకా, శూద్రులు వ్యవసాయం ఎరగరన్నమాట !!

* * *

—"వేమన స్త్రీ నింద చెయ్యడానికి స్త్రీల వశీకరణశక్తే ఎక్కువగా కారణం" అట.
"యోగులకంటే యోగినులలోనే Ecstacy(పారవశ్యం) ఎక్కువ. అందుకుకూడా స్త్రీనింద చేశాడు" అట. —7వ పేజీ

"స్త్రీలోని హిప్నాటిక్ ఫినామినా యోగుల కెవరికీ తెలియను"....లజ్జ Sexual Selection మొదలైనవి స్త్రీలో వుండటానికి కారణం తెలుసుకోలేకపోవడమే స్త్రీ నిందకు కారణం" అట —7వ పేజీ

"వర్గ సమాజంలో స్త్రీ పురుష సంబంధాలలో పురుషాధిపత్యంనుంచే పురుషుడు గర్హించిన యీ గుణాలు స్త్రీలకొచ్చాయి. స్త్రీనింద కివన్నీ కారణాలే- అందమైన అబద్ధాలతో సహా- అయినా వశీకరణ శక్తే ఎక్కువ కారణం" అంటూ చాలా ఏకరువు పెట్టబడింది. —7వ పేజీ

"నల్గొండ. కరీంనగర్, చిత్తూరు ప్రాంతాలలో యోగినీ బృందాలున్నాయని శ్రీనివాస్ నిరూపించారు" —7వ పేజీ

—వర్గసమాజం నశిస్తే, పురుషాధిపత్యం పోతుంది. పోగానే స్త్రీలోని ఈ అందమైన అబద్ధాలు, ఆకర్షణ (Sexual Selection), Hypnotic Phenomina, Ecstacy వగైరాలు ఎగిరిపోవాల్సిందేనా అని ప్రశ్న కలుగుతోంది. కమ్యూనిజంలో స్త్రీ ఆకర్షణను కోల్పోతుందన్నమాట. రష్యా చైనాల్లో స్త్రీలలో ఆకర్షణ తగ్గిపోతున్నదా మరి?

—ఆజన్మ బ్రహ్మచారిగాని వేమన స్త్రీ వశీకరణశక్తి తెలియక నిందించాడా?

—యోగినుల్లోనే పారవశ్యం కాదు, స్త్రీలలోనే రతిలో పారవశ్యానుభవ విశేష దశ లున్నాయని పింగళి సూరన్న కళామయంగా ప్రకటించాడెప్పుడో_ తంత్రాచారులందరికీ యీ మాట అనుభవస్థం, అస్థిగతం, కంఠస్థం. అది తెలిసిన వారు స్త్రీని పూజించారుగాని వీరన్నట్టు నిందించలేదు. వేమన కిది తెలిస్తే నిందించేవాడు కాదనాలేమో వీరి విశ్లేషణ ప్రకారం?

—శ్రీనివాస్ ఆయా తావుల్ని గుర్తించి వుండొచ్చు. మంచిదే- ఇంకా పలు చోట్ల వున్నట్లు వీరు గుర్తించినా మంచిదే- టీ. వీ. వాదానికిది వ్యతిరేక సమాచారం కాదే.

—తంత్రం సామూహిక మైధున క్రియనుకూడా చెప్పేవుంది. పంచమకార చక్రపూజే అది. తాంత్రికాచార్యుడికి యీ సందర్భంలో చక్రేశ్వరుడంటారు. చక్రపూజకు కనీసం ఎనిమిది జంటలు కావాలంటారు. ఎనమండు గురు యోగినులన్నమాట. కల్లునీళ్ళు త్రాగి కడుపెద్దవారిలో చీరవిడిచి తిరిగే సిద్దురాళ్ళు, పగలు చీర విడిచి ప్రజలకు కనిపించే చేడెలు వేమనకు కానవచ్చినవాళ్లే. అదిచూచే మరింత ఏవగించుకొని స్త్రీనిందకు తెగబడ్డాడు. రానురాను సానుభూతి. ఉదారత,గణ్యత పెంచుకొన్నాడని పద్యాలిచ్చాను.

## అచలం X బౌద్ధం - వైదికుడై పోయిన నాగార్జునుడు

4] "అచల సంప్రదాయంలో స్త్రీ భ్రాంతి వుండనేకూడదు" అని వుందట- ఈ ఒక్క కారణం స్త్రీనింద కంతటికీ ఏకైక కారణం కాదు" అట —పేజీ 7

— అచలం సన్యాసాన్ని నిబంధించదు. సంసారంలోనే సంగరహితంగా వుండొచ్చంటుంది. అచల గురువులెందరో- అందరో సంసారులే. శ్రీధరుడు, శివరామ దీక్షితులు, ఆరుద్ర తాతల్లోవారు భాగవతుల కృష్ణ దేశికులు, బాలా రామపండితులు, ఇప్పటి పొన్నాల రాజయోగి సంసారులే. కాని యోగులమంటారు. రాజయోగులమంటారు. పాతంజల రాజయోగం కాదు- సంసార రాజయోగం, జనక మహారాజుల రాజయోగమంటారు. స్త్రీభ్రాంతీ కూడదంటారు. స్త్రీనింద అచలంలో భాగం కాదు. మరి వేమన చేశాడు. అదేగదా సమస్య.

'దక్షిణ దేశంలో వర్తకులూ చేతి వృత్తులవాళ్ళూ భూస్వామికాన్ని నిరసించిన శూద్రాచార్యుల నుంచి అచలం ప్రచారమయింది" —పేజీ 5

—శ్రీధర శివరామ దీక్షితుల్నీ బాలారామకృష్ణదేశికుల్నీ మనంఇకశూద్రాచార్యులనాలన్నమాట। సరే ఏం చేస్తాం మరి?

—అచల సంప్రదాయానికి చెందిన మకుటంగా అర్థం యిచ్చి, మహాయాన శూన్య వాదానికి గాక అచలానికి దగ్గరలో బయలు, సున్నం అన్నాడని చెప్పి, కాబట్టి వేమన తాత్విక దృష్టి భూస్వామికానికి కవచమాత్రమయింది అని సూత్రీకరించి ఆ వాక్యం తర్వాత వాక్యంలోనే భూస్వామికాన్ని

నిరసించిన శూద్రాచార్యుల నుంచీ అచలం ప్రచారమయిందనటం విరుద్ధం కాదా ? విపరీతంకాదా ? శూద్రాచార్యులు భూస్వామికాన్ని నిరసించిన పాటిగా - అదెటువంటి నిరసనోగాని - అంతపాటిగా శూద్రేతరాచార్యులు, బ్రాహ్మణాచార్యులు నిరసించలేదని చూపించగలరన్నమాట. అచలంలో కులభేదంవల్ల భూస్వామ్య వ్యతిరేకతా సమర్థనలు ఉపేక్షలూ ఉన్నవన్న మాట - ఇదంతా చక్కగా నిరూపించుతారని ఆశిద్దాం.

"శూన్యవాదానికిగాక, సున్నం, శూన్యం, బయలు, ఎరుకఅనే వేమన మాటలు అచల వాదానికే దగ్గర." —— పేజీ 5.

——ఎరుక కూడా అచలవాదంలోనిదే నన్నమాట. ఆ మాటే అచలంవారితో చె ప్ప మ ం టు న్నా ను. గుక్కలట్టిపోతారు. పైగా కందార్థదరువులో తాళంవేస్తూ,

'నిల్పకు మెరుక నచలాములోనన్'

'ఉళ్ళక్కిఎరుకాను మాను' మంటూ పాటపాడి చక్కాసాగనంపుతారు. ఎరుకతత్వం అద్వైతం - శంకరాద్వైతం. ఎరుక మరచు చోటు నెరుగుట అచలం-అచలపరిపూర్ణం చిద్రూపం కానేకాదు.వీరుగదామరి అచల శూన్యాన్ని, నాగార్జున శూన్యాన్నీ విశ్లేషించదగిన వారు—— ఇకవీరే "వేమన మకుటానికి అచలసంప్రదాయదృష్టిలో" అర్థం చెప్పుతారు చూడండి !

## మకుటంలో అచలార్థం :

అచలం

a) 'లోలోపల వుండేద'ట ! ——

కాని, 'లోవెలిబాయరో' అన్నది వేమనబోధ. బాహ్యాభ్యంతరాలు లేవు అచలానికి. వీరివల్ల అవీ వున్నవనుకోవాలేమో ! !

b) "ప్రపంచానికి కారణమైన"దట ! ! ——

అచల పరిపూర్ణం ప్రపంచానికి కారణమే కాదంటారు. కార్యకారణభావాన్నే అక్కడ తిరస్కరిస్తారు. నిమిత్తోపాదానాది కారణాలను, సత్కార్య, అసత్కార్య, వివర్తాది కార్యకారణ వాదాలను, సర్వమైన కార్యకారణ దృష్టాంతాలను అచలులు తిరస్కరిస్తారు. జగదుత్పత్తి నిరూపణ నిరసన శివరామ దీక్షితీయంలో ఒక ప్రకరణం. తీసెయ్యాలేమో !

c) 'తాను మాత్రమే చూచింది' అట ! ! !

—తానసేది మిగిలివుండగా అచలమెక్కడిది ? చూచుటుండగా అదెక్కడ ? దృక్ నిరసన - పరిపూర్ణ నిరసన ప్రకరణాలు చించెయ్యాలేమో!

—అదిసరేగాని, 'తాను మాత్రమే చూచింది' అని అంటే, ఇతరులు చూడ సాధ్యంగానిదనేనా, కాదా ? ఇతరులు చూడలేనిదాన్ని గూర్చి ఉపదేశమా ? చర్చా ! దేనికో !

—ఈ అర్థాలు 'విశ్వదాభిరామ వినురవేమ' అనే మకుటంలోని ఏ శబ్దానికి, ఏ అక్షరానికి, ఏ పదానికి అర్థాలో చెప్పి చూపినవారు గాకపోయారే ? ప్రతి పదార్థం యివ్వకుండా ఇన్ని మహార్థాలుచదివేశారే ? ఈ అర్థాలు పదకొండు అక్షరాల మకుటంలో ఏ అక్షరాల్లో దాగివున్నాయో చూపాలి. మందబుద్ధులం గదా. లేకపోతే మకుటార్థం వికటార్థపర్వం గదా!

## మకుటానికి అచలపాఠం - కొత్తపాఠం

d) 'విశ్వత్ అభిరామ' అట — విశ్వదాభిరామగాదుట —

—కొత్త అర్థాలు రాబట్టారుగదా, మకుటానికి కొత్తపాఠం తయారుచెయ్యకుండా వదిలారా ? మరచిపోయి యీ ప్రసంగపాఠంలో అచ్చువెయ్యలేదు గాని, ప్రసంగంలో సరికొత్తపాఠం పదచ్ఛేదంతోసహా చదివేవున్నారు. విశ్వత్ అభిరామ అనీ, విశ్వదభిరామ అనీ రెండు మార్లు అన్నారు. టేపులో భద్రంగావుంది - అనుమానం అక్కర్లేదు వినొచ్చు. ఇక అదెక్కడిభాషో తెలుసుకొనగోరటం బాగుండదా ?

—e) "అచలవాదంమీద బౌద్ధప్రభావంవున్నా అదేబౌద్ధంఅనేవీల్లేదు" అన్నారు- పేజీ 5

—వీల్లేకపోతేనేంగాని! (వీలుందని ఎవరన్నారుగాని) అచలంమీదబౌద్ధప్రభావం వుందనికమిట్ అయ్యారు అంతేచాలు, నాకు ఉపయోగపడ్డారు అనుకోకుండా. వేమనలో అచలమూ, నాగార్జున శూన్యవాదమూ రెండూ వున్నవని నేను చూచాను. దేని ప్రభావం దేనిమీదుంటే నాకేం ?

నాగార్జునబౌద్ధానికన్నా,నాగార్జునబౌద్ధప్రభావంలో వెలువడిన, లేకప్రభావంగల అచలానికి ఎక్కువదగ్గరగావుంటాడు వేమన అని అనదలచుకొన్నారు వీరు. ఇదేనాతోవిభేదమా ? ఇది విభేదమేనా అసలు ? అచలంప్రభావమే నాగార్జునుడి మీదవుందని వీరురేపనవచ్చుగాక. నావాదానికి దోఖాలేదు. అలాఅనేట్టు

కూడావున్నారు. శాతకర్ణిదానంలో అచలుణ్ణితెచ్చి (?) వాడికి అచలంతో సంబంధాన్ని అన్వేషిస్తామన్నారు గదా। అచలాన్ని ఆదరించి, నాగార్జున వాదాన్నితోసేసినవాడైనా శాతకర్ణి— ఆరెంటికీ పోలికలున్నాయని తిరుగు లేకుండా కమితైనట్టేగదా । భూస్వామికాన్ని నిరసించేఅచలాన్ని శాతకర్ణి ఆదరించిన మహారాజవుతాడు, దాంతోవిప్లవాత్మకుడౌరట. నాగార్జునచారిత్రక పాత్రకన్న అచలాచార్యులపాత్రమిన్న, మేలు। ఇదీ వీరివాదం పర్యవసానం॥ ఐనా మాకు బాధలేదు.

కాని, ఒక్కకోరిక, మన్నిస్తారని ఆశ :

ఎరుక విషయం మొదలేగురితప్పిందిగాని, మిగతామాటలైన సున్నం,బయలు నాగార్జునతత్వానికన్నా అచలతత్వానికేవిధంగా దగ్గరో వివరిస్తే విందామని కోరిక—మరి....

ఈలోగా, 'లోలోపలవుండేది' 'ప్రపంచానికి కారణమైనది' 'తానుమాత్రమే చూచింది' అన్నఅర్థాలేవో మకుటానివని చెప్పబోగా, అవి అచలానివి కాదన్నాను గదా, అవి నాగార్జునతత్వానికికూడా చెందవు, చెల్లవు—అవే కారణాలచేతనని తెల్సుకొనమని కోరుతున్నాము.

—"గౌతమీపుత్రశాతకర్ణే నాగార్జునుణ్ణివెళ్ళదరిమాడు. ఆతర్వాతనాగార్జునుడే వైదీకిగా మారాడు"— పేజీ 5.

—మరి అచలుడితో అచలంలోచేరిపోయాడన్నమాట. శాతకర్ణి వెళ్ళదరిమినట్టూ (నిరాదరించవచ్చు, వ్యతిరేకంగావుండొచ్చు), నాగార్జునుడు వైదీకిగా మారినట్టూ దాఖలాలేమున్నాయో ?

మారిపోయింతర్వాత రాజ్యంలోకి రానిచ్చాడా ? వచ్చాడా ? ప్రచ్ఛన్న అద్వైతిగామానేసి, ప్రత్యక్షద్వైతిగా బ్రతుకు వెళ్ళమార్చాడా ? అలాబ్రతుకుతూ అద్వైతపుస్తకాలనురాశాడా? చూశామా? శంకరులకు పూర్వాచార్యుడుగా గణనకురాలేదా ? ఇవికూడా చెప్తేవిందామని కుతూహలంగావుంది.

వేమననాగార్జునుల తత్వంలోపోలికవుందనిచూపితే, అదిలేదని నిరూపించాలిగాని అదేమీచెయ్యక, నాగార్జునుడే బౌద్ధంలేకుండాచేశాడు, అతడే ప్రచ్ఛన్నఅద్వైతి. అంటూ ఏమేమోచదవటం అసంగతం. నాగార్జున బౌద్ధులపాత్ర ఏదైనాకావచ్చు. ఇక్కడి విషయం తత్వంలో పోలికమాటేమాట. వారివల్లశూన్యవాదం పాత్ర ఒకరకంగావుండి, అదే వేమన చేతుల్లో వేరొకపాత్రవహించవచ్చు. హెగెల్‌చేతుల్లో డైలెక్టిక్సు ప్రష్యన్

రాజరికాన్ని చరిత్రావధిగా స్థాపించగా, అవేమార్క్సుచేతుల్లో కార్మికవిప్లవానికి ఆయుధం అయ్యాయి. అచలం శూద్రాచార్యులచేతుల్లో భూస్వామ్యవ్యతిరేకపాత్ర తీసుకొన్నదని పాత్రభేదాన్నివీరు చెప్పడంలేదా ? అచలానికి పాత్రవుందని అన్నందుకు వీరికి విప్లవాభినందనలు చెప్పొద్దా ? బౌద్ధం భూస్వామ్యవ్యవస్థకు సన్నిహితమైపోయి స్వయం సంపూర్ణగ్రామీణవ్యవస్థకు సరిపడక అదృశ్యమయిందన్న వాక్యానికి జేజేలు చెప్పొద్దా ? 'బౌద్ధాన్ని పీడక ప్రభువుల దగ్గరకు తీసుకెళ్ళివాడు నాగార్జునుడే '(పేపు) అన్నందుకు అశోకుణ్ణి, మీనాండర్నీ తర్వాత వాళ్ళని చేయొద్దా ? బుద్ధుణ్ణి బింబిసార, అజాతశత్రు రాజులు ఆదరించారన్నది అబద్ధమనొద్దా ? నాగార్జునుణ్ణి శాతకర్ణి వెళ్ళదరిమినా దన్నారని అడగవద్దు ! సామ్రాజ్యమే అతణ్ణి తిరస్కరించింది గదా !

## స్త్రీజనాభానుబట్టి వివాహసంస్కరణ !!

6)—"ధనవంతుడు భార్యలెందరైనా కొనుగోలు చేసుకునేవాడు. ఇలా ఆడపిల్లలను అమ్ముకొనేకంటే పేదయువకులకిచ్చి పెళ్ళిచేయడం మంచిదని సూచనగా వేమన చెప్పాడు- స్త్రీలజనసంఖ్య తక్కువకావడం దీనికొకకారణం కావచ్చు"

—అప్పటి జనాభాలెక్కలు చూచిచెప్తున్నట్టేవుంది. వేమనకాలాన ఆడపుటక తక్కువ - కన్యాక్రయం ఎక్కువయితే, వద్దన్నాడు వేమన.

సరే, ఇప్పుడు మగపుటక తక్కువకావడాన వరకట్నాలు వరవిక్రయాలు ఎక్కువయ్యాయి. వద్దంటున్నాం మనం ఏకపత్నీవ్రతాన్ని నిబంధించిన కాలం ఆడపుటకతక్కువైనకాలమని చెప్పుకొని అదేచారిత్రక భౌతికవాద మని అనుకొందామా ?

అప్పట్లో బహుభార్యాత్వం వుండేది గదా- అదిస్త్రీజనాభా ఎక్కువగాఉన్న కారణాన అని చెప్పుకోరాదా ? చెప్పుకొన్నారు. ఇండియాలో అరబ్ దేశాల్లో బహుభార్యాత్వాన్నిచూచి ఆడపుటక ఎక్కువకాబోలు ననుకొన్నారు యూరోపియన్లు. ఉష్ణదేశాల్లో ఆడపుటక ఎక్కువగా వుంటుందని వ్రాసుకొన్నారు. 18 వ శతాబ్దంలో వారిలో ఇదొక ప్రబలాభిప్రాయం. అబేదుబాయి దీన్నికాదన్నాడు. పాతికేళ్ల శాంపిల్ సర్వేచేసి కాదనితేల్చాడు. చరిత్రని వ్యూహసౌధం చెయ్యడంమంచిపనిగాదు. పెళ్ళిని ఆస్తిసంబంధాలసందర్భంనుంచీ దూరంచేసి చూచే ప్రయత్నంచారిత్రక భౌతికవాదికి ఎంగెల్సు కుటుంబం, పెళ్ళి, ఆస్తి- వాని పుట్టుపూర్వాలను కలిపిచూడమన్నాక ఎంతమాత్రమూ తగదు. వేమన పెళ్లిని ఆస్తిసందర్భంలో పెట్టిచూచినవాడు.

దాన్నికాదనటానికి ఇన్నిపాట్లుదేనికి ? వెర్రిమొర్రి ఊహలుదేనికి ?

## ఇంకా అందమైనమాటలు

—"బౌద్ధులు పక్వాహారం దానంకోరారు- హైందవులు స్వయంపాకంకోసం అపక్వాహారం దానంకోరారు"— అచ్చుప్రసంగం పేజీ 5

—అపక్వాహార దానాన్నిగాకుండా అన్నదానాన్ని చెప్పినవారూ, కోరేవారూ హిందువులుకారని తీర్మానించాలన్నమాట! పైగాఅట్టివారంతా బౌద్ధులేనని ప్రకటించాలిక! మనువు అన్నదానం చెప్పాడంటే అతణ్ణే బౌద్ధుడంటేపాయె!

—"వేమనవార్తాకవికాడు,మరిఉపదేశకవి. ఉపదేశమంటే? 'యత్రశిక్షార్థవచనముపదేశంస ఉచ్యతే'వార్తాశబ్దాన్ని సర్వజ్ఞసింగభూపాలుడు సంపూర్ణంగా వివరించాడు(1)"–పేజీ8

1) వార్తకువివరణ సింగభూపాలుడుచేశాడా ? ఏపుస్తకంలో ? రసార్ణవసుధాకరంలోనా ? చూపుతారా ? వీరిచ్చిన సంస్కృత వాక్యం సింగభూపతిదా?

2) వార్తఅంటే పథ్యవాక్కు- అనికూడాచెప్పొచ్చునే.క్రైస్తవుల సువార్తఏమిటి? ఉపదేశం దానికిందికి రాకపోతుందా? ఆమాట అలావుంచి, ఉపదేశమంటే అర్థం చెప్పడానికి సంస్కృతవాక్యాన్ని ఉదాహరించాలా? డాబుకాదూఅది ?

3) సంస్కృత అలంకారశాస్త్రాల్లో వార్తాకవిత్వమంటే నేను చెప్పేఅర్థం మొత్తంగావుందని నేను వ్రాశానా ? ఎందుకీ సర్వజ్ఞసింగని వార్తలు ? తమ సర్వజ్ఞపట్టంస్థాపించుకోడానికా ? సరే, అసలువిషయం ఇదిగో!

4) వార్తాకవిత తెలుగు ప్రత్యేకతగా పుస్తకంలో స్థాపించాను. సంస్కృత ఆలంకారికగ్రంథాల్లోఅందుకుఅనవాళ్ళూ ఆధారాలూ దొరుకుతవేమో అవి పీఠికలో చర్చించాను. దండి కావ్యాదర్శంలోనూ, వ్యాఖ్యలోనూ అందులోవార్తనుగూర్చిఉన్న భిన్నమతాలనుచూచి వార్తఅంటేలోకవృత్తం పథ్యవాక్కు, వాస్తవికచిత్రణం అనేఅర్థాలవరకూ దగ్గరగా ఉన్నవనిచెప్పి సామెత అనేట్టు, లోకోక్తిమయ కవితారీతి అనేట్టు అందులో ఇంకా ఏర్పడ లేదని, దండికావ్యాదర్శానికి కన్నడానువర్తనంఅయిన కవిరాజమార్గంకూడా చూడవలసి వుందనిచెప్పాను. "అందులోలేకపోతే వార్తాకవిత్వం తెలుగు ప్రత్యేకత అనాలి" అని కూడా ఆ పీఠికలోనే వ్రాశాను. ఇక సింగభూపాలుడు ఏం చెప్పి ఏం చెప్పకపోయినా వార్తాకవిత తెలుగు ప్రత్యేకత అన్నది నా భావంకాగా, సంస్కృతంలోలేనిది తెలుగులోవుంటానికి వీల్లే

దంటారేమో అనమంటున్నాను. అసలుతెలుగులోనే అలాఅనే అవకాశమే లేదంటే అనమంటున్నాను.

ఈయనకు తాత్విక పరిజ్ఞానం కంటె సాహితీ పరిజ్ఞానం మరీ తక్కువగా వుంది. డాక్టర్ గోపీ కంటే కూడా తక్కువ స్థాయిలో వున్నారు. రస, ధ్వని సిద్ధాంతాలు కూడా వేమనలో వున్నాయని అన్వయించ బూనుకొన్నారు. రస సిద్ధాంతాన్ని, ధ్వని సిద్ధాంతాన్ని, బౌద్ధమతమే అంగీకరించలేదు. బౌద్ధమతం కవిత్వాన్నే ఆమోదించలేదు. ఆ రెండు సిద్ధాంతాలు కూడా శంకరాద్వైతం, అభినవగుప్తుని ప్రత్యభిజ్ఞావాదానివే గాని, వేమనకు చెందినవి కావు" —అచ్చువేయని ప్రసంగ భాగం (పేపు)

—నేను వీరికన్నా, ఇంకా డా॥ గోపీకన్నా కూడా సాహిత్య పరిజ్ఞానంలో దిగువనెక్కడో వుండొచ్చు. దానికే ఏం చేస్తున్నానంటే, ఇలా ప్రశ్నలడిగి వీరినుండి, వారినుండి విజ్ఞాన భిక్ష పొంది బ్రతుకుదామనుకొంటున్నాను.

—అశ్వఘోషుణ్ణి, ఆర్యశూరుణ్ణి, కపిమాలుణ్ణి, హర్షుణ్ణి కావ్యాలు రాసినందుకు బౌద్ధం వెలివేసినట్లు సమాచారం ఏదో వీరిపద్ద వుండివుండాలి. అది కాస్త బైటపెట్టి పుణ్యం గట్టుకోమంటున్నాను. దయావీరం బౌద్ధులదే కాదనాలికాబోలు!

—రస, ధ్వని సిద్ధాంతాలు వేమనకు చెందినవికావు. అది నిజమేగాని అలాగని నేనన్నానా? వేమన్నను వానికి కర్తను చేశానా? వాటిని తెలుసుకోక పోయిన కవి రచనలో రసం, ధ్వని వుండవా? ఆ రెండు సిద్ధాంతాలూ వెలువడకముందున్న కవుల కావ్యాల్లో ధ్వనీ, రసమూలేవా? ధ్వనికారునికి ముందు పుట్టిన కావ్యాలు ధ్వనిహీనాలా? వేమన పద్యాల్లో రసమున్నవీ, ధ్వనివున్నవీకూడా వుండేవీలు లేనేలేవంటారా? చూపించినపద్యాల్లో అవి లేవంటారా? లేవని చూపండి. అయినప్పటికీ, "వేమన ధ్వనిమార్గము నందంతగా నడపలేద"ని నేను వ్రాయలేదా?

—శంకరుడు ధ్వని సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడా? ఏ గ్రంధరాజంలో జేశాడో చెప్తే చదువుకొంటాను. అభినవగుప్తుడూ ఆనందవర్ధనుడూ ధ్వని కర్తలుగా చెప్పుకొంటున్నాముగాని, ధర్మకీర్తిని అసలు కర్తగా చెప్పాల్సి వుంటుందని అనుకొంటున్నాం. కీ. శే. డా॥ జి. వి. కృష్ణరావు నేనూ అలా తేల్చుకొన్నాం. కృష్ణరావుగారు మాత్రం ధ్వని సిద్ధాంతాన్ని నాగార్జున మాధ్యమికానికి అన్వయించి వ్రాశారు.

—శంకరాద్వైతానికి ధ్వని సిద్ధాంతం "అవిరుద్ధం" అనడం కూడా ఇటీవలి కాలంమాట, కాదంటే చెప్పి సాయపడమంటాను.

—'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనేది ఎవరి నిషేధమో- బౌద్ధులదో, అద్వైతులదో కాస్త చెప్పమని మనవి.

—రసమూధ్వనీ ఫ్యూడల్ సాహిత్య సిద్ధాంతాలంటున్నారు (పేపు) బానిస వ్యవస్థలో మనకు మరే సిద్ధాంతమున్నదో? రసమతకర్త భరతుడే వ్యవస్థ వాడో? రామాయణం ఫ్యూడల్‌యుగరచనేనా? దానిదే సిద్ధాంతమో! రసమతం తర్వాత బహుమతాలు బహుశతాబ్దాలతర్వాత ఎప్పటికో ధ్వని మతం తలెత్తి, సంచలనం కలిగించి, స్థిరపడడం ఏ వ్యవస్థా భేదాన్నైనా సూచిస్తుందో సూచించదో? రసధ్వని మతాలకూ ఫ్యూడలిజానికీ ఈక్వేషన్ ఏమిటో, వాటి సజీవ సంబంధమేమిటో చెప్పి చూపరాదా? బూర్జువాయుగ సాహిత్య సిద్ధాంతమంటూ ఈదేశంలో ఇంతకన్నా యితరంగా వున్నాయా? వినాలని వుంది.

# వేమన కాలం

## విదేశీ పోటీ - దేశీ వర్తకులు - వడ్డీ వ్యాపారం

—అప్పుడేడచ్చివాళ్ళూ, పోర్చుగీసువాళ్ళూ, ఇంగ్లీషువాళ్లు ఇక్కడివర్తకులమీద దాడిచేశారు. భూస్వామ్యవర్గం వీళ్ళకొళ్ళుపట్టుకొని, వీళ్ళఅవసరాన్నితీర్చుతూ దేశంలోని వర్తకుల్ని తమవర్తకాన్ని కొనసాగించకుండాచేశారు. ఈ విదేశీయులపోటీ తట్టుకోలేక ఈ వర్తకులంతా వడ్డీవ్యాపారులుగా మారిపోయారు-అచ్చుగాని ప్రసంగం (పేపు)

—"భూస్వాములకూ-వర్తకులకు చేతివృత్తిదార్లకూ ప్రధానవైరుధ్యం- పాశ్చాత్య వర్తకకంపెనీలతో (కూ) బాహ్యావైరుధ్యం వుండేది"- అచ్చు పాఠం.

1]—"కాళ్ళుపట్టుకోవటంమాటెక్కడ? బాహ్యవైరుధ్యం మాటెక్కడ? ఎంతగా దిద్దుకొన్నారు? ఎందుకని? అధ్యయనంచేస్తేనేనా? చెయ్యకనా? సరే, లోలోపల లాలూచీపడి, పైకివిరోధం నటించడందేనికి? ఈ భూస్వాములెవరికి జడిసి నటించాలి? ప్రజకా? వర్తకులకా? బహిరంగంగా రాజులువూళ్ళస్థలాలు వాళ్ళకు కౌలుకివ్వగా, వ్యాపారస్వేచ్ఛనిస్తూ ఫర్మానాలివ్వగా దాపరికమేమిటి? బాహ్యావైరుధ్య మేమిటి?

2]—వేమనఆలోచనపై ప్రభావంకలిగించేందుకు 17వ శతాబ్దంలో తెల్లజాతివర్తక కంపెనీల పోటీలకి దేశవాళీవర్తకులు తట్టుకోలేక, తమరాజులు తమకు వ్యతిరేకంగా పనిచేసేవారుకాగా, దెబ్బతినిపోవటమనేమాట నిజమేనా? వర్తకంవదులుకొని వడ్డీవ్యాపారులుగామారి బ్రతికారా? ఎక్కడిదీసమాచారం? అప్పట్లోవడ్డీవ్యాపారంలో వరదవచ్చినట్లు భోగట్టా వున్నదా? చూపడం అవసరం. పైగా, గతశతాబ్దంలోనేవచ్చి, రాజ్యంచేస్తున్న పోర్చుగీసువారు వర్తకంలో వెనకబట్టి, హిందూవర్తకుల్ని పెద్దవాటాదార్లుగా కలుపుకొని, తమరక్షణలో హిందూవర్తకుల అర్జనకు పనిముట్టులమై బ్రతుకుతున్నామని ఏడ్చుకొన్న, పోర్చుగీసు కథనాలు కావలసినన్ని వున్నాయి. షాజహాన్ హుంగ్లీలో 4000 పోర్చుగీసువాళ్ళని ఇస్లాం తీసుకోనందుకు 1632లో నరికేశాడు.

ఆకంపెనీలంత పెద్దవాళ్ళుగాఎదిగి ప్రపంచకోటీశ్వరు లనిపించుకొన్న దేశీవర్తకులున్నారు. వాళ్ళదగ్గర ఇంగ్లీషుకంపెనీ అప్పుపుచ్చుకొనటముంది. సూరత్‌లో అటువంటివర్తకుడు విజీవోరామాట కోశాంబి వ్రాశారు. అతని గుత్తాధిపత్యాన్ని దెబ్బతియ్యజూచింది ఈస్టిండియా కంపెనీ. దానివల్లకాలేదు. తగ్గి అతడిదగ్గర అప్పులుపుచ్చుకుంది. వర్తకపోటీలోదెబ్బతిని వర్తకంమానేసుకొనో,తగ్గించుకొనో, ఉన్ననగదుకాస్తా వాడు తెల్లకంపెనీకి అప్పిచ్చి వడ్డీలాలనుకొన్నట్టు కోశాంబీరచనలోలేదు.వీరేమైనా అలాచెప్తారో ఏమిటో? 18వ శతాబ్దిలోకూడా జగత్‌సేట్ అనిపించుకొన్న ఫతేసింగు నాశ్రయించుకొనిగదా బెంగాల్లోఇంగ్లీషుకంపెనీ బ్రతికింది? ఫ్రెంచికంపెనీ నవాబుతో తగాదాపడి మకాంఎత్తెయ్యబోతే, వెళ్ళొద్దనివారికీ, వెళ్ళనీయొద్దని నవాబుకీ మహజర్లిచ్చి, రాయబారంచేసి, మధ్యవర్తులైన పెద్దవర్తకులు అందులో ఓడయజమానులులకథ తెలుగుదేశంలోనే వుంది. రాజులకన్నా వర్తకులే విదేశీయుల్ని ఆహ్వానిస్తున్నారు.

3]—అసలా పదిహేడోశతాబ్దమంతా దక్షిణభారతం అల్లకల్లోలంలో మునిగి వుంది. విజయనగరసామ్రాజ్యాన్ని చంద్రగిరికి తరిమిన అరవీటి వంశం అంతర్యుద్ధాలపాలై, దాన్నికబళించటానికి గోల్కొండ బీజపూరుసుల్తాన్లు పోటాపోటీగా చేసినదాడులకు గురై, అదికాస్తా కబళితమైపోయే సరికి మొగలుమరాటాల సంకుల సమరాలకు రంగస్థలమైపోయింది: నీటివనరులు మరమ్మతులు లేక కరువులెక్కువై పోయాయి. కరువులు యుద్ధదోపిడీలు

పెచ్చరిల్లినై. నేతగాళ్లుకూడా వూళ్ళొదిలి, వృత్తివొదిలి కాందిశీకులై వస్తూత్పత్తిలేక కొనసరుకులేక, కొన్నసరుకులనిల్వలకు, రవాణాకు భద్రతలేకుండా పోయి, వర్తకొన్ని దఫదఫాకూ నిలిపివేసుకుంటున్న రోజులవి. లేచిపోయిన నేతగాళ్ళకు ఇళ్ళుమగ్గాలు మూలు అడ్వాన్సులు ఇవ్వజూపి ఆకర్షించాల్సిన పస్థితిపాలైనది ఆంధ్రదేశమప్పట్లో. పులికాట్‌లో భద్రతకొదవై వ్యాపారం జరగక దక్షిణాదిన దేవనపట్నానికి ఇంగ్లీషు కంపెనీ దారిచూచుకుంటున్నరోజులు. దీన్ని తీసుకొని శాంథోమ్ నిమ్మని డచ్చివాళ్ళడుగుతున్న రోజులు. బందరులో నవాబు అధికారులబాధ పడలేకనే ఇంగ్లీషువాడు చెన్నపట్నం దామెరవారినుండి పొందారు. బందరులో నవాబు ప్రతినిధులు ముగ్గురు తెల్లవాళ్ళనీ ఏడ్పిస్తున్నారు; తెల్లవాళ్ళవద్ద ఉద్యోగంలోవున్న నల్లవాళ్ళని వాళ్లు కొట్టినరోజులవి; నల్లకూలీల తరపున నవాబు ప్రతినిధులు కదిలినరోజులు. సప్లైచేస్తామన్నబట్ట సప్లైచెయ్యలేకపోతే అదేపని ఒత్తిడిపెట్టిన ఇంగ్లీషుకంపెనీని సరకురవాణాలోపోతే నష్టంమీరేభరించే షరతుమీద అయితే ప్రయత్నిస్తామని రాయలసీమ వర్తకులు తెల్లకంపెనీల నడుగుతున్న రోజులవి. నాలుగుజాతుల తెల్లవాళ్ళూ తమలోతాము పోటీపడుతున్నకాలం. వాళ్లేమి జులుంచెయ్యగలుగుతారు? చేయించగలుగుతారు?

4]—యుద్ధంసరకుల సప్లయిలనుకోరుతుంది.యుద్ధఖర్చులకు అప్పులడుగుతుంది. వర్తకానికి, వడ్డీవ్యాపారానికి మంచిగిరాకీకల్పిస్తుంది. యుద్ధాలు ఔరంగజేబు ఖజానాను ఖాళీచేశాయి. అతడప్పులపాలయ్యాడు. ఇక్కడా రాజులంతే. అటువంటికాలంలో రాజసమితికెల్లరంపముల్ వైశ్యులు అన్నవేమనమాట మరింత నిజంగా తయారైన కాలమది. సెట్లు ప్రాభవం వహించసాగారు. విదేశీయులతోడి చెలిమి వారిని తుపాకులు పట్టించింది. తుపాకుల కృష్ణప్పచెట్టి మీర్జుమ్లా సేనాని – వాళ్ళ చుట్టం, డచ్చివాళ్ళ వ్యాపారములో పెరిగిన కోనార్ సెట్టి శ్రీరంగరాయలక్రింద ఉదయగిరి దుర్గాధిపతి. రాయల్ని మోసగించాడు. చెట్టియార్ల ప్రాభవం అంతగా పెరిగిన కాలమది.

వర్తకుల ఆర్థిక ప్రాధాన్యానికి తగ్గట్టుగా రాజ్యవ్యవస్థ కొన్ని ప్రత్యేక హక్కులను దక్షిణ భారతంలో కలిగించింది. బ్రాహ్మణులకువుండే కొన్ని హక్కులు వీరికీ వుండేవి. రాయలవారి సమక్షంలో సేనానులు సామంతులు ఆసీనులు కారాదుగాని బ్రాహ్మణులకు చెట్టియార్లకు కూర్చుండే హక్కు

వున్నది. పరస్పర యుద్ధంలో నిమగ్నమైవున్న రాజ్యాలలోకైనా సరే, వర్తకులు నిరాఘాటంగా ప్రవేశించి సరుకులుకొని రవాణా చేసుకొనే హక్కూ సంప్రదాయమూవుంది. మరింకొకరెవ్వరికీ లేనిహక్కూ, పల్లకి నెక్కి తిరిగేహక్కూ (ఆందోళిక నెక్కేహక్కే ఇతరులకున్నది) రాజుకు వలె వీరికీ వున్నది. ఇప్పటి Diplomatic Immunity లాగా సెట్ల మీద అపరాధ విచారణాదండన హక్కులు [Criminal Jurisdiction] రాజులకు, రాజాధికారులకు లేవు. అలాగని విదేశీయుల వ్రాతలున్నాయి. దక్షిణాదిలో, లేదా విజయనగర వ్యవస్థలోనైనాగాని ఫ్యూడలిజం వర్తకునికి వ్యాపారార్జనలకు సంపదకు రక్షణ కల్పించింది. అసలు హిందూరాజ్యాల్లో వుండేమో అనుకొంటాను. రెడ్ల రాజ్యంలో రాణించిన శ్రీనాధుని బాల్య సఖుడు అవచితిప్పయసెట్టిగారు ఇటు తండ్రి వేపునా, అటు తల్లి వేపునా తాతలనాటి నుంచీ ద్వీపాంతర వ్యాపారంలో కోట్లకు పడగలెత్తి ప్రసిద్ధులు కావడం వ్యాపార భద్రతని తెలుపుతున్నది. ఎటు తిరిగీ అదిలోపించడం ముస్లింపాలనలో హిందువర్తకులకేనేమో.

17వ శతాబ్దపు చారిత్రకయాథార్థ్యం ఇలావుండగా,సూడో మార్క్సిస్టువ్యూహా సౌధంగా చరిత్రను కల్పించడం తగనిపని. చరిత్ర నెంతో వోగుచేయాల్సి వుంది ఇక్కడ. సేకరణే సరిగా జరగనిదశలో – మార్క్సిస్టు పడికట్టు మాటలతో చరిత్ర పూరిస్తారా ? మార్క్స్ చెప్పిన Asiatic Mode of Production అనే మాటకీ దేశంలో అన్వయం లేదని, ఇక్కడి బానిస, భూస్వామ్య వ్యవస్థలెంతో యూరప్‌నుంచీ భేదిస్తున్నవని, "What Marx himself said about India cannot be taken as it stands" అని కోశాంబీవంటి మార్క్సిస్టులు ప్రకటించి, స్వతంత్ర పరిశీలనకు సమాలోచనకు పూనుకోగా, పాతమూసల్లోంచి బైటపడలేకపోతూ, 18 వ శతాబ్దాంతంలోనో, పందొమ్మిదో శతాబ్దంలోనో ఏర్పడ్డారన్న కాంప్రడోర్ బూర్జువజీ వర్గాలు పగైరాలను 17 వ శతాబ్దం తొలిసగంలోకి దిగుమతి చేస్తూ చరిత్రాభాస కారకులౌతున్నారు. పాత మూసలు అవతలబెట్టి, యధార్థాలు సేకరించి స్వతంత్ర సమాలోచకులు కావలసివుండగా, చారిత్రకాంశాల విషయంలో మచ్చరించి వేదికలమీద వీధిప్రసంగాలకు దిగటం దారుణం. ఇదేమైనా పాండిత్యపు కుస్తీ పట్లా? చరిత్ర సేకరణా ?

అచ్చులో మరో చిద్విలాసం చేశారు. "కుల విచక్షణవల్ల వర్తకులికీ_చేతివృత్తి దార్లకీ, కార్ఖానా పనివారికీ మధ్య ఏర్పాడాల్సిన సంబంధాలేర్పడలేదు. దానితో వర్తకులు వడ్డీ వ్యాపారులుగా మారిపోయారు." అని వ్రాశారు. కుల ప్రభావ ఫలితాలకు ఇదొక New Dimension కాబోలు ! వర్తకులు వర్తకం మానుకొని వడ్డీ వ్యాపారులుగా మారడం మాటకేమిగాని, వీరు మాత్రం వడ్డీ వ్యాపారాభివృద్ధి కారణోత్పత్తికోసం అదేపనిగా మారిపోతున్నారు. కుల విచక్షణేమిటి – వడ్డీ వ్యాపారి వర్గాభివృద్ధి ఏమిటి ? వర్తకంనుంచి ఉత్పత్తికి వెళ్ళనివ్వకపోవడమేమిటి ? ఎప్పణ్నుంచో వున్న కుల విచక్షణ క్వాంటిటీలో పెరిగిపెరిగి, వేమన నాటికి క్వాలిటీ మార్పుగా తయారై వర్తకుల్ని వడ్డీ వ్యాపారంలోకి నెట్టేసే శక్తిశాలి అయింది కాబోలు ! రుజువులులేని ప్రకటనలు గారడీగా తయారౌతాయి. ఇది వడ్డీ వ్యాపారంమీద చర్చకాదుగాని, హిందువులు దానిలో పాతుకు పోవడం యూరోపియన్ల రాకకుముందే జరిగింది. అదొక రిజర్వేషన్‌గా వుండేది. హిందూ కులవ్యవస్థ ఇస్లాంలోకికూడా వెళ్ళివుండగా, ఉత్తరభారతంలో పెద్దపెద్ద ప్రభుత్వ కార్ఖానాలేర్పడ్డాయి. మొగల్ ఇండియా అప్పట్లో ప్రపంచపుకర్మాగార మనిపించుకొంది. దక్షిణభారతంలో గోల్కొండ కాలంలో బందరు కలంకారీ పరిశ్రమలో కేపిటలిస్టుసంబంధాలు తలెత్తాయి. విదేశీగిరాకీ కలంకారీ బట్టకే. అయినా కార్ఖానాలేర్పడలేదు. Nascent decentralised capitalist manufacture గావుంది. వర్తకుల సరుకులరవాణాలో బ్రాహ్మణ వ్యవస్థ బాగావుపయోగపడింది. ఈ పరిస్థితుల్ని మార్క్సిస్టు ఆర్థికచరిత్ర పరిశోధకులు అజదీసుకొంటున్నారు. వీరికే అవి పట్టినట్టులేదు.

## సిగ్గేసి అచ్చులో తీసేసిన అబద్ధాలు

(1) "భూమిలోనబుట్టు భూసారమెల్లను, తనువులోనబుట్టు తత్వమెల్ల శ్రమములోనబుట్టు సర్వంబు తానౌను" అనే పద్యం చివరిపంక్తిలో శ్రమసర్వానికి మూలమని, Labour Theory of Value వుందని అర్థంనేను చెప్పానా ? ఆరుద్ర చెప్పారా ? ఏడెనిమిదేళ్ళ క్రితం ఇటువంటి అర్థం ఆరుద్ర చెప్పితే, సామాన్య పాఠకులు సాధారణ మేధావివర్గం అదేనమ్మి మాట్లాడుతున్నారు. ఆ ఒక్క అర్థం విషయమేగాక, సామ్యవాద, భౌతికవాద నవీన వాతావరణానుకూలంగా వేమన పద్యాల కర్థవ్యాఖ్యలు చెప్పే ఆ ధోరణినే నా పుస్తకంలో ఖండించాను. 'శ్రమములోన బుట్టి సర్వంబు తానౌను' అన్నదానిని ప్రత్యేకంగా ఖండించాను. పాఠభేదం చూపించీ, పద్యం మొత్తానికొక అర్థం చెప్పాలంటే ఇటువంటి అర్థాలుకుదరవు, పొసగవు అనీ

మరీ వ్రాశాను. అన్వయం కుదరని స్థితిలో, అసంగతస్థితిలో ఆరుద్రగారు చెప్పిన యీ తప్పుటర్థాన్ని, నాకు అంటగట్టి, నన్ను ఖండించడానికదొకవీలు చేసుకొని విజయవాడసభలో ఘంటాకంఠమెత్తి వున్నారు. ఆ ఘంటాకంఠాన్ని దించేసుకోక, దాన్ని కాస్త ఆరుద్రగారిమీదికి తిప్పమంటున్నాను. ఇకముందు ఈ పద్యార్థఖండన పర్వం, కడకునన్ను బలపరచేదవుతుందని కానలేని ఉన్మత్తతనిమాత్రం వినోదంగాతీసుకొంటాను

శ్రమము అంటే యోగసాధన అనే అర్థం చెప్పుకోవాలి. గతికల్పించడానికి చెప్పుకోవడంగాదు. సాక్షాత్తుగా సంస్కృత నిఘంటువులిచ్చే అర్థమేఅది. కాని ఆ అర్థంలో తెలుగులో ఎక్కడైనా ప్రయోగంవుందా అంటే వెదుక్కొని కని పెట్టాల్సిందే. తెలుగున ఆ అర్థంలో ఇదే అపురూపప్రయోగం. సంస్కృతం ఎరిగిన వాడుగాకపోతే, ఇలా ప్రయోగించలేడు. వేమన పండితుడు గాడనే యీ "పండితుల" వాదనకిది వ్యతిరేకసాక్ష్యం. సిద్ధాంతశక్తిలేనివాడనికూడా యీ"సిద్ధాంతకర్తల" అభిప్రాయంగదా! ఇటువంటి అర్థమయితే, అచలతత్వగతమైన అర్థమవుతుందని యీ"సిద్ధాంత శక్తిసంపన్నులు" సభలో మాట్లాడారు. అది తప్పు. ఆ అర్థం అచలానికే కాదు, అద్వైతానికి కూడా సుసంగతంగాదని ఎవ రనగలరు? అసలది అచలార్థం కాజాలదుకూడా. యోగసాధనలో అనుభూతమయ్యే పరమార్థం తానే - సోఽహం - అనే భావాన్ని అచలం ఖండిస్తుంది. చూచి వున్నారుగదా! మరి వీరు పండితులు, సైద్ధాంతికులు, వేమన సిద్ధాంతశక్తిలేనివాడూనట !!

(2) "పుణ్యమంతగూకి పురుషుడై జన్మించె, పాపమంతగూడి పడతియాయె, కష్టమూసతిదని కనువారులేరయా" అన్న పద్యం ఉండగా, అది సభరోజు ప్రొద్దున్నే 'ప్రజాశక్తి'లో నా వ్యాసంలో యిచ్చి వుండగా, అది చూడలేదంటేమాత్రం, మూడో పంక్తిని మాయంచేసి, పైరెండు బంతులే సభలో చదివి పుణ్యమంతా పురుషుడు - పాపమంతా స్త్రీ అయిందని వేమన ఘోరంగా చెప్పాడు, ఇదిగో చూడండి, ఇటువంటి వేమనను వెంకటేశ్వరరావు వెనకేసుకొస్తున్నాడని సభలో సింహనాదం చేసిన వీరి స్వభావశీలాలను తలచుకొని జాలిగొందామా? ఇట్టివారి చేతిలో సాంస్కృతికవిలువలిక నిలుస్తాయాయని భయంతో వొణికిపోదామా? ఒకరచయితనిలా కత్తిరించి దెబ్బ దీయడం మన పూర్వులు చెప్పని విద్య. ఛలం, జల్పం, వితండం, జాతి అనే అపమార్గాల్ని అవలంబించమని న్యాయదర్శనం ద్వారా వైదికులు, ఆస్తికులు చెప్పారు. ఈ అపమార్గం మాత్రం వారికికూడా తెలిసినవిద్య కాలేదను కొంటాను.

వీటినీ - విశ్వాత్ అభిరామ పాఠాన్నీ - అచ్చుకెక్కించకుండా కత్తిరించు కొన్నారు. సిగ్గేసివుండొచ్చు. అందుకూ అభినందించవలసిందే. అదే సిగ్గు, లేదా, అదే లోకభీతి అచ్చప్పుడేగాక, మాటలప్పుడుకూడా వుండ జూచుకోగలరని ఆశిద్దాం. ○

# వేమన దర్శనం - విరసం పేరిట వక్రభాష్యం

వేమన వ్యాపారస్తుల కవి: అహింస వ్యాపారస్తుల సిద్ధాంతం, అది వ్యాపారస్తుల అవసరం. బందిపోట్లనుంచీ, భూస్వాములనుంచీ, ఈస్టిండియా కంపెనీనుంచీ మన వర్తకులకు బాధ లెక్కువ - అందుకే వేమన అహింస అతిగా చెప్పాడు.

వేమన స్త్రీ నింద చెయ్యటానికి స్త్రీల వశీకరణకే ఎక్కువగా కారణం, స్త్రీయోని హిప్నాటిక్ ఫినామినాకు కారణం తెలీక పోవటమే కారణం.

స్త్రీ జనాభా తక్కువ కావటంవల్ల కన్యాశుల్కం అడగకుండా ఆడపిల్లల్ని పేద యువకులకు పెళ్ళి చేయమన్నాడు వేమన.

సంస్కరణవాదం, మానవతావాదం వేమన చెప్పలేదు, చెప్పలేడు. అవి 19వ శతాబ్దపు బూర్జువాజీ సిద్ధాంతాలు. అందువేత అంతకు ముందు వేమన వానిని బోధించే అవకాశమే లేదు.

అసలిన్ని తాత్విక సిద్ధాంతా లెవరు చెప్పగలరు. ఇన్ని సిద్ధాంతాలు తెల్సుకోవాల్సిన అవసరం వేమనకేమొచ్చింది:

బౌద్ధం సామ్రాజ్య తాత్విక భాష్యం. కనక సామ్రాజ్యాలు పోవటంతో అదీ పోయింది. బౌద్ధాన్ని రాజుకొద్దకీ, ఫ్యూడల్ ప్రభువులొద్దకి తీసుకెళ్ళినవాడే నాగార్జునుడు. ఫ్యూడల్ స్వయం సంపూర్ణ గ్రామ వ్యవస్థ నెలకొనటంతో బౌద్ధం చచ్చిపోయింది.

నాగార్జునుడి బోధంతా విని విని విసుగెత్తి శాతవాహనుడు వైదికమతంలో చేరిపోయాడు; నాగార్జునుణ్ణి దేశం నుంచి వెళ్ళదరిమాడు. తట్టుకోలేక నాగార్జునుడే వైదీకిగా మారిపోయాడు.

నాగార్జునునికి ప్రత్యర్థి అచలు ఉండేవాడు, అచల సిద్ధాంతకర్త. శాతవాహన రాజతనికి దానం యిచ్చి శాసనం వేశాడు.

ఎరుక శూన్యవాదానికి దగ్గర కాదు, అచలానికే దగ్గిర. అచల సంప్రదాయంలో చాలమంది వేమన లున్నారు. etc....

పాత కవులమీద రాసేదాన్ని విమర్శ అనరు. వేమనమీద ఇప్పుడు రాసే వాళ్ళమీద రాసేది మాత్రమే విమర్శ అవుతుంది.

   

ఇటువంటి మాటలు విరామం లేకుండా వింటోంటే వెనకటి నాటకంలో ఓ పాత్ర మాట లిట్టే జ్ఞాపకం వచ్చేయ సాగినై.

"గల్లుదని నగల్ మ్రోయగా వెళ్ళదేల? రామునకు జంకి పర్వెత్తు ద్రౌపదివలె"

"జమదగ్ని కొడుకు భీమసేనుడేతెంచి యాపునో, చాన, కుంతి కాత్మజుండగు వికకంటు దావగలదా...."

"దాధ కొడుకింద్రదత్తుడో రావణుండా...రామునకు కుంతిగనిన ధర్మరాజో"

"జిల్లడ పట్టుకొంటి యాజ్ఞసేనిని చాణక్యు డట్లునేను...." అన్నట్టి మాటల వరసంతా చెవుల్లో మార్మోగినట్లయింది. ఇలా ఇతిహాస పురాణ విజ్ఞానం వినోదంగా వెలిబుచ్చిన నాటక ప్రాణి మృచ్ఛకటికలో శకారుడు. చారిత్రక భౌతికవాదం పేర పై విధమైన పరిశోధనా విజ్ఞానం వెల్లువ గట్టిస్తున్నవారు నేటి విరసం కార్యదర్శులు. సిద్ధాంతించాలనే అభిలాష వీరిలో మిక్కుటంగా గోచరిస్తుంది. నే నెరిగిన మార్క్సిస్టు లెవరిలోనూ ఇంతలేదు. విరసంలో వీరే సిద్ధాంతకర్త లంటారు. మార్క్సిజానికి కొత్త అన్వయాలు చూపుతున్నారనగా వింటాము. అదేదో వేమన చూడొచ్చు. విచారణలో ఆవిష్కృతమైన మేర పట్టించుకోవాలి గదా!

భారతీయ సంస్కృతిలో సాటి మార్క్సిస్టు మిత్రులు పరిశోధనాపూర్వంగా చేసిన రచనలను సమంగా అర్థం చేసుకొనే దక్షతొకటి, చక్కగా వాడుకోగల తీరొకటి వుంటే అంతేచాలు, అదేగొప్ప. కాని అదే కొదవగాతోచింది, కాదంటే ఇదేచూడొచ్చు.

## పక్వాపక్వాహార దాన మీమాంస

వేమన దాన సిద్ధాంతంపై చర్చలో పక్వాపక్వాహారదాన ప్రసక్తి రామాయణంలో పిడ లవేట మాదిరిగా తెచ్చారు.

"దానాలలో అన్నదానం గొప్పదన్నాడు మనువు. బౌద్ధులు పక్వాహారం కోరారు. హైందవులు స్వయంపాకంకోసం అపక్వాహారం కోరార"ని ఒక వింత సంగతిని అవాంతరంగా వినజెప్పారు.

నేను వేమన అన్నదానాన్ని కొత్తగా కనిపెట్టి బోధించాడనలేదు. బౌద్ధుల నుంచి పుచ్చుకొన్నాడనలేదు. హైందవులు స్వయంపాకం కోరలేదనలేదు. ఇదేమిటీ గోల, తలా తోకా లేకుండా వుంది. అన్నదానం దగ్గర మనువుతో బౌద్ధుల ఏకీభావం, స్వయంపాకం కోరుతూ బ్రాహ్మణ గృహస్థూ, పురోహితుడూ మనువుతో విభేదించటం, పక్వాపక్వాహార దానం హైందవ బౌద్ధుల మధ్యగల తేడాల్లో ఒకటి, అందులో మనువు బౌద్ధులపక్షం- ఏమిటీ విపరీతం. ఇదేదో ఎరువుసొమ్ము, బరువు చేటయింది. అసలీ విశ్లేషణ వీరి కెక్కడిదా అని ప్రశ్న వేసుకొన్నాను.

సన్యాసం, కౌంటర్ కల్చర్ (?) అంటూ బ్రాకెట్లో ప్రశ్నార్థకంపెట్టి మరీ, రోమిలాథాపర్ వ్రాసిన వ్యాస పరిధిలో యిమడని వేమనను విరిచి బలవంతంగా ఇమిడించ యత్నిస్తున్న పి. మరకతం జ్ఞాపకంలో వుండి, దాన దక్షిణలనుగూర్చి ఆ యమ్మ వ్రాసిన వ్యాసంలో యీ పక్వాపక్వాహార దాన భేద ప్రసక్తి ఏమో వుండే వుంటుందని తట్టి, తిరగేశాను. ఉండకేం చేస్తుంది. ఉంది. వేమన చర్చలో అవసరం మాలిన యీ వింత సూత్రీకరణ పుట్టిల్లు ఆ వ్యాసమే. కాస్త వీలుంటే చదవ గోరుతాను పాఠకుల్ని.

జైన బౌద్ధాలలో అత్యంత ఆమోదమైన అన్నభిక్షతో పోల్చితే అపక్వాహారం పరిశుద్ధతలో నయమనిపించుతుంది. మనువు బ్రాహ్మణ (హిందూ కాదు, సన్యాసి కాదు) పరిగ్రహానికి యోగ్యమైన దానాలను జాబితావేస్తూ ప్రధానంగా అపక్వాహార వస్తువులనే ఎన్ని యిచ్చాడు అని వ్రాశారామె. అయితే మనుస్మృతి కూడా అన్న భిక్షను చెప్పక పోలేదని, కానిదాన్ని గృహస్థ బ్రాహ్మణునికి (పురోహితునికి) కాకుండా, హిందూ సన్యాసికి మాత్రమే చెప్పిందని వ్రాశారు. అన్నదానమే గొప్పదానమని మను వన్నాడని ఆ యమ్మ వ్రాయనేలేదు. పక్వాపక్వాహార దానాలు హిందూ బౌద్ధ భేదాల్లో ఒకటని ఆమె కమిట్ కాలేదు

వైదిక, జైన, బౌద్ధ, ఆజీవికాది మత భేదం లేకుండా సన్యాసులందరికీ అన్నభిక్ష, అన్నదానమే నిబంధనమనీ, గృహస్థులైన బ్రాహ్మణ పురోహితులకు మాత్రం అన్నదానం కాదని, స్వయంపాకం చేసుకొనేందుకు ఇల్లు ఇల్లాలు సంతానం అంతా వుండటాన ధాన్యం, బియ్యం, పిండి వరకే దాననిబంధనమని, గృహస్థ పురోహిత వ్యవస్థలేని జైన బౌద్ధాలలో స్వయంపాకం అపక్వాహార దానం మాటే కలిగే వీల్లేదని, పక్వాపక్వాహార దాన భేదం హిందూమతంలోనే సన్యాసి పురోహితులు ఉభయులనుబట్టి ఏర్పడిన భేదమని టీకా తాత్పర్యప్రాయంగా ఆ యమ్మ వివరించి వ్రాయలేదు. పక్వాపక్వ చిత్త స్థాయిభేదం ఇంత వుంటుందని తెలిసి వ్రాయకపోవటం ఆమె తప్పేనందాం కాపీ చెయ్యటానికి కూడా కొంత స్థాయి కావాలేమో !

అసలింతకూ వీరశైవంలో అన్నదానానికున్న ప్రాధాన్యం మరే మతం లోనూ లేదన్న నా మాటను కాదనటానికనుకొంటాను ఈ పాట్లు. మను వేనాడో పురోహితునికి సైతం అన్నదానం చెప్పాడని, అదే గొప్ప దానమన్నాడని, అలా అనగల్గితే కూడా నా మాటకు అది ఆక్షేపణ కాజాలదని గుర్తించక పోవటం శోచనీయం అన్ని దానాలకంటే అన్నదానమే గొప్పదనటంతో సరిపెట్టుకోలేదా మతం. అన్నదానం దాని థీయాలజీని మార్చింది; శివసతే అన్నపూర్ణ అయింది. దాని మఠాచార భావనలను ఆర్థిక దృష్టి సాత్మ్యీకరం చేసింది.

బాహిరమైన పూజా ధ్యానాచారాలకంటే ప్రశస్త మనిపించుకొన్నది. ఇదంతా చెప్పి చూపించినా తల కెక్కకపోతే ఎట్లా? వేమన దాన సిద్ధాంతం అన్నదాన సిద్ధాంతంతోనే ముగింపు గాకుండా, అది ఆస్తిదానందాకా సాగిందని, అదీ జంగాలకో బ్రాహ్మణులకో బైరాగులకో ధారపోయడం గాకుండా పేదలకు చేయమన్న ఆస్తి దానమని, కొడుకులకు మిగలకుండా కరిగించేసి మరీ చేయమన్నదాకా, ఆస్తి సంక్రమణ కూడదనేంత దాకా సాగినదని వివరిస్తే, అది విశేషమే కాదన్నట్టు, దాన్నికూడా పట్టించుకోకుండా, అన్నదానంలో పక్వాపక్వాహార చిత్రమీమాంసకు దిగటం వింతల వేటకు, పాండిత్య ప్రదర్శనకూ గదా! అయితే దానికి తగినంత సరుకు కావాలి. అనువుమీద, బదుళ్ళమీద, నిర్వహించే పనికాదది? అటువంటిదే ఇంకొకటి; మారుతున్న పరిస్థితుల్లో స్త్రీలు పని చేయవలసి వచ్చింది. శ్రమజీవు లెక్కువమంది కావలసి వచ్చారు. స్త్రీలను, శూద్రులను, గణ ప్రజలను అందరిని Mainstream లోకి తెచ్చి పని చేయించుకోవటంకోసం వారిని శ్రమజీవులుగా initiate చేయటానికి తాంత్రిక విధానం ప్రారంభమయింది అని సెలవిచ్చారు. దేవీప్రసాద్ చట్టోపాధ్యాయ లరగలేదు వీరికి. ఏమైనా వీరు వింతల పరిశ్రమ పెట్టారు. మరో వింత సంగతి చూడండి.

## మాక్రో - మైక్రో మిమిక్రీ :

వేమన మైక్రో కవి, మైక్రో కవి విశ్వకవి కాలేడు అని ఉపన్యసించారు.

నేను ప్రతిపాదించిన ఒక ముఖ్య విషయాన్ని అసలు మీరు చర్చకే తీసుకోలేదు. మైక్రోపోయట్ అనేది చర్చించలేదు అని నాకు లేఖలో వ్రాశారు. అన్నా, ఎంతమాట వుండిపోతోంది అనుకొన్నాను. ఇంత ముఖ్యమైన విషయం నే నెరగని ఏ సాహిత్యశాస్త్రంలోనిదో గదా అని చింతపడ్డాను కొంత. అంతలో వింతల వీరారెడ్డిగారు వచ్చి, ఆ చింత మానండి, ఈ మైక్రోకవి, మాక్రోకవి అన్న పదాలు మా సగోత్రీకులు సొంతంగా ముద్రించి సరికొత్తగా విడుదల చేసిన నాణాలు సుమీ, చెల్లుతవో చెల్లవో చూచి చెప్పమన్నాము, అదేదో చెయ్యండి అని చెప్పి వెళ్ళారు.

రష్యన్లు భారతదేశ ఆర్థిక వ్యవస్థలో పరిణామాభివృద్ధులను వివేచిస్తున్న రచనలలో మైక్రో, మాక్రో పదాల ప్రయోగం చేస్తున్నారు. రాజకీయార్థిక వ్యవస్థల అధ్యయనంలో ప్రయుక్తమైన ఈ కొత్త పరిభాషలో కులం, కుటుంబం, శాఖ, తెగ, గోత్రంవంటి అంశాలు మైక్రో ఎలిమెంట్సు; జాతీయత రాజ్యస్వరూపం, ఆర్థిక వ్యవస్థవంటి విషయాలు మాక్రో ఎలిమెంట్సు. సమాజాన్ని వారు ఇలా చిన్న, పెద్ద వ్యవస్థలుగా విభజించారు. పెద్దవి వ్యవస్థలైతే, చిన్నవి ఉపవ్యవస్థలు. ఈ ఉపవ్యవస్థల్ని, అంటే కులం కుటుంబంశాఖలను కవితావస్తువుగా తీసుకొన్నవాడు మైక్రోకవి;

జాతీయతనీ, రాజ్య స్వభావాన్ని, ఆర్థిక వ్యవస్థనీ వస్తువుజేసి రాసినవాడు మాక్రో కవి యనీ వీరి ఉద్దేశ మనుకొంటాను. మహా వ్యవస్థల సంగతి పట్టించుకు రాసిన వాడల్లా విశ్వకవియై, ఉపవ్యవస్థలమీద రాసిన వాడెవ్వడూ విశ్వకవి కాకపోతాడంటా నంటున్నారు వీరు. ఇదీ విరసం కార్యదర్శి సాహిత్య మార్క్సిజం. వర్గ కవితా భావ వర్గీకరణం ఎలాగూ ఒకటుండగా, ఈ మహా వ్యవస్థ, ఉపవ్యవస్థ కవులన్న అదనపు వర్గీకరణం అవసర మేమిటి, ప్రయోజన మేమిటి అని అడిగితే, అవసరమయితే లేదని, వికటంగానే చెప్పాల్సొస్తే, వికటత్వమే ప్రయోజనమని, విరసం కవులంతా మాక్రో కవులవుతారుగాన, వారంతా అనుకోకుండా,అడక్కుండా వీరివల విశ్వకవులుగా ప్రమోటవుతారని, కులమనే ఉపవ్యవస్థను నిర్మూలించడానికే ప్రాకాడనిపించుకొని వేమన విశ్వకవి కాజాలడని అడ్డుపుల్లలు వేయడ మవుతుందని మాత్రం చెప్పాల్సి వస్తుంది.

విరసం కార్యదర్శి మరమనస్సు మార్క్సిజాన్ని ఇలా మూర్ఖిజం చేస్తున్నది. కూట కొలమానా ను, తప్పు తూనికలను చొరబెట్టుతున్నది. గతితార్కిక సాహిత్య భౌతికవాదంగా నామకరణంచేసి, ఏదో ఒక సిద్ధాంతం ఎప్పుడో చేశారట, ఆ తానులో ముక్కైనా యీ మైక్రో, మాక్రో కవుల మిమిక్రీ? అందులో భాగంగా అప్పుడే చెప్పారో, అనంతరం వేమనమీద ప్రయోగించడానికే తెచ్చారో తెలియదు గాని, దీన్ని తమ వర్గం వారైనా చర్చించలేదనుకొంటాను; నన్ను చర్చించమని మరి మరీ కోరారు.

వేమన కుల వ్యవస్థనుగూర్చే కాకుండా, ఆర్థిక వ్యవస్థ మార్పులను గూర్చి కూడా ప్రాకాడని చూపించి విశ్వకవిని చేయడానికి యీ వాదంలో కూడా దారి చేయొచ్చు. కానిఇది వేమన సమస్యేకాదు. దీనివల్ల మార్క్స్,ఎంగెల్సుల మెప్పుకు కంఠ పాతాలకు ఎక్కిన కవులకే ముప్పు వాటిల్లుతున్నది వారికి మహాకవులో విశ్వకవులో షేక్సుపియర్,గెథే, హినేలు డీగ్రేడై పోతారు. కుటుంబానుబంధాల్ని ఇతి వృత్తం చేసిన రామాయణ కావ్యకర్త విశ్వకవి కాకపోతాడు హోమర్ కాడు. మనుష్యుని రాగద్వేషాలనీ, పురుషార్థాలనీ, వ్యక్తి గుణశీల వర్తనాలనీ, కుటుంబ జీవితానుబంధాలనీ వస్తువు గావించుకొని కుల మత జాతి దేశావధులను చెరిపేసి, విశ్వ మానవత్వాన్ని పాడినవాడు విశ్వకవికాడు. రవీంద్రుడు కాడు అనే ప్రమాదం.

వ్యక్తి మ ం మార్మికానుభవం యీ మాక్రో-మైక్రో వ్యవస్థల్లో లేవు. వాటిలోకి రావు. అవే వస్తువుగా రాసే కవి మైక్రోయా, మాక్రోయా, ఉభయమా? అనుభయమా? ఈ నిర్వచనం వాటిని వదిలేసినట్టా?

జాతీయతకీ, ఆర్థిక రాజ్య వ్యవస్థా భావాలకేతప్ప విశ్వజనీనత అన్నది మానవ జీవితంలో మరి దేనికీ లేనేలేదని ఈ మైక్రో-మాక్రో కవి విభజన నిర్హేతు

రిస్తుంది. కాని మార్క్సిజం నిరాకరించదు. వర్గ ప్రయోజన ప్రేరితంగా వుంటుంది కళ, కవిత అని చెప్పే మార్క్సిజం, ఆ వర్గ ప్రయోజనం, వర్గ వ్యక్తిత్వం ఒక్కటే మొత్తం మానవత్వాన్నీ, మానవుని కవితనీ కళనీ exhaust చెయ్యవనీ, వర్గ ప్రయోజనాల కవతలగా మానుషాంశం కొంత కామన్ డినామినేటర్‌గా వుందని మార్క్స్, మార్క్సిజం గుర్తించిన విషయమని మార్క్స్ వర్గ సిద్ధాంతానికే జన్మతలం మానవత అనీ మార్క్సిజం చెప్పుకొంటుంది. వానంతటికీ ఇది సున్న చుట్టేస్తుంది

## మానవతాదృష్టికి వయసు కడతారా?

ఈ thought mechanics ఇలా మెలిదిరిగి పోవడంతో 19 వ శతాబ్దానికి ముందు పెట్టుబడిదారీ విధానానికి ముందు హ్యూమనిజం లేదు, రిఫార్మిజంలేదు, ఆ మాటలు ఆ భావన అంతా బూర్జువాజీతో వచ్చినట్టివే. (చార్వాక 10.1.82) అంతకుముందున్న వేమనలో అవి ఉండటానికే వీల్లేదని ఉపన్యాసం చెప్పారు. ఈ స్థాయిలో వేది(వీధి) కెక్కుతున్నారు, పాఠశాలలుపెట్టి బో(బా)ధిస్తు న్నారు. ఏం చెప్పేది ?

ఆ పరిభాష లేకపోవచ్చుగాని ఆ భావనలేని కాలమున్నదా? నవీనయుగంలో హ్యూమనిజాన్ని 14 వ శతాబ్దపు ఇటాలియన్ రినైజాన్సు కన్నబిడ్డ అంటారని, హ్యూమనిస్టులమని తమ్ముతాను పిల్చుకొన్నవారే దానిలో ముఖ్యులన్న మాటైనా తెలియకుండా మార్క్సియన్ మేధావులమంటున్నారు. వారుకూడా ప్రాచీన గ్రీకు సంప్రదాయాన్ని పునరుజ్జీవింప జేస్తున్నాము, గాని తామే ఆరంభకులమనలేదు. రినైజాన్సు ఇంకాముందే, ప్రారంభమైందని కొందరు చూపుతారు. మానవునిలో మానవత్వం ఔదార్యం సంఘచేతన పరిణామ స్వభావం ఎప్పణ్ణుంచి వున్నయ్యో మానవతా సంస్కరణా అప్పణ్ణుంచీ ఉన్నాయి. మానవజాతి వయస్సే వాని వయస్సు. సిద్ధాంతరూపంలోకూడా రెండున్నర వేలేండ్లుగా వున్నవే.

మానవతకు సంస్కరణ వాదానికి ముహూర్తాలుపెట్టి ఏ వొక్కవర్గానికో ముడిబెట్టేపని కల్లసని, కానిపని. చదవేస్తే వున్నమతి పోవడమంటే ఇదే కదా ! వేమనను వ్యాపారస్తుల కవిగా తీర్మానించి, అంటే మెర్కంటైల్ బూర్జువాకవిగా చెప్తూ, ఆ వర్గంతో ముడిబెట్టిన హ్యూమనిస్టు దృష్టిని వేమనకు నిరాకరించడం స్వవచన వ్యాఘాతమనైనా తెలియడంలేదు. అదే బాధకలిగిస్తున్నది.

## అహింసే, వ్యాపారస్తుల సిద్ధాంతమా

హ్యూమనిజం పెట్టుబడిదారీ సిద్ధాంతపు దినుసన్నవారు, అహింస వ్యాపారస్తుల అంగడి సరుకని, అవసరమని, సిద్ధాంతమని అనకేం జేస్తారు. కాని అదీ అసంగతం. అసంబద్ధ ప్రసంగం కాక ఏం జేస్తుంది; ఇవన్నీకలిసి ఒక ప్రత్యేకచిత్త వ్యవస్థను తార్కాణించకపోయేదేమున్నది.

"వేమన అతివాద అహింసావాదం చేశాడు. అహింసను బుద్ధుడు, జైనులు, గాంధీకూడా చెప్పారు. వీరంతా ఒకే అర్థంలో చెప్పారా? శాతవాహనులనాడు, మధ్య యుగాలనాడు, ఆధునిక యుగంలో ఒకరకంగా ఎలా చెప్పగలరు. చెప్పరు. పశుపోషక దశనుంచి సమాజం వ్యవసాయ దశకు మారుతోండగా వ్యవసాయానికవసరమైన పశువుల్ని చంపొద్దన్నది గౌతమ బుద్ధుని అహింస. వర్తకులు దూరప్రాంతాలకు సరకుల రవాణా చేయాలిగదా, దారి దోపిడీ బందిపోటు బాధలు వుండటాన, అవి జరగకుండాలని బోధించినట్టిది జైనుల అహింస. దేశంలో భూస్వాములకు బూర్జువాలకు తెల్లవాని నుంచి అధికారం సంక్రమించాలని బోధించింది గాంధీగారి అహింస. బందిపోట్లనుంచీ, భూస్వాములనుంచీ, ఈస్టిండియా కంపెనీల వాళ్ళనుంచీ వచ్చిన బాధలనుంచి వర్తకుల్ని రక్షించడానికి వచ్చింది వేమన అహింస — ఇదీ ఉపన్యాసం. (అదే చార్వాక)

జైన బౌద్ధాల అహింస వెనకనున్న ప్రయోజనాల్లో తేడా ఇలా చెప్పడానికి కారణం అరగని వనువు వీరికి కోశాంబీ అరగక తికమకపెట్టుతున్నాడు. జైన బౌద్ధాలు ఒకేకాలంలో ఒకే ప్రదేశంలో ఒకే వర్గంనుంచి వచ్చినవాళ్ళు బోధించినవి: వైదిక వ్యవస్థ కెదురు చెప్పినవి. రెండింటిలోనూ వ్యాపారవర్గాలు ప్రాముఖ్యం వహించినవి ఒకటి వ్యవసాయానికి కావలసిన అహింసను, మరొకటి వర్తకులకు కావలసిన అహింసను వేర్వేరుగా బోధించినవని చెప్పడంమాత్రం వీరిప్రయోజకత్వం, రెండూ కూడా పశుపోషణ దశదాటి వ్యవసాయార్థిక వ్యవస్థ ఏర్పడి వర్తకాభివృద్ధి జరుగుతున్న రోజుల్లో వ్యవసాయ పశునాశం జరగకుండటానికి, చిల్లర రాజ్యాల హద్దుల నతిక్రమించి పెద్ద అంగడి ఏర్పడి, అంగడి మార్గాలు నిర్భ్రమాదం కావడానికి అహింసను బోధించాయని భారతీయ చారిత్రక భౌతికవాద ప్రముఖుడు కోశాంబి ప్రతిపాదించాడు. అదే ఈ వికృతాకారం తీసుకొన్నది. జైనంలో ఇప్పటికీ వర్తకులు మిగిలి వుండటం చూచి, బౌద్ధులలో వారేదోలేకపోయారనో, తక్కువగా వుండేవారనో అనుకొని, ఒకర్ని వర్తకానికి, మరొకర్ని వ్యవసాయానికి పంచిపెట్టారు. కాని రెండింటిలోనూ వర్తకులు ప్రాముఖ్యం వహించారు. కాగా ఇప్పుడు వీరు చెప్పే లెక్కన బుద్ధుడు మహావీరుడు, వేమన, గాంధీ–ఈ నలుగురి అహింసా

వర్తక వర్గాలకు ఉపయోగపడుతున్నదనే అనిపిస్తుంది; అహింసవ్యాపారస్తుల సిద్ధాంత మనే అనిపిస్తుంది గదా

కాని ఈ నలుగురిలో వేమన వెనకమాత్రం వర్తకులున్న దాఖలాలు లేవు. వేమన నాడు వర్తకులకు వీరు చెప్పినట్టుగా ప్రత్యేకమైన బాధలు కొత్తగాఏర్పడలేదు. వేమన వర్తకుల పక్షంగా ఒక్కముక్క చెప్పలేదు. వ్యతిరేకంగా తగినంత చెప్పాడు.

అదంతా గుర్రంవెంకటరెడ్డిగారు పోగుచేసి ఆంధ్ర పత్రికలో (25 ఏప్రిల్, 1982) వీరిని ఖండిస్తూ ఇచ్చారు. "కోమటిని ఆశకొండయు ఆశకు మితిలేదు. ....కోమటిలోని నిష్ఠ గురికిరాదెన్నడు, లోభగుణము చూడరూఢియగును .... వైశ్యవరుని సొమ్ము వసుధనీచులకబ్బు — రాజసమితికల్ల రంపముల్ వైశ్యులు, జూదగాండ్లకాది జూదగాండ్లు, యోచననుదెలియరు ఉరకస్వార్థాపేక్ష ... కోమటి మది గోరు క్షేమమేఎల్లెడ— అంటూ వ్యాపారస్తుల దుమ్ముదులిపిన వేమన్న పాపం వారి రక్షణకోసం అహింసబోధించాడనడం అర్థంపర్థంలేని అఘోరింపుమాత్రమేనని అనక తప్పదు"అనివ్రాశారు. వీరి సిద్ధాంతపుబారినుండి ఇలా వేమనను కాపాడడం ఏమంత కష్టంకాదు. కనుకవీరి సిద్ధాంతం యొక్క మంచిచెడ్డల్నే వివేచించవలసి వుంటుంది. ఎందుకంటే అటువంటి సిద్ధాంతం ఒకదాన్ని ఏర్పరచుకొని దాన్నితెచ్చి వేమనమీద ప్రయోగించారుగాని, వేమనలోని యథార్థాలను బట్టిదాన్ని ఏర్పరచుకోలేదు

జైన బౌద్ధాల వెనక వ్యాపారు లొక్కరేకాదు వున్నవారు. ఇద్దరి వెనకా క్షత్రియులున్నారు. రాజులున్నారు. చేతి వృత్తులవారున్నారు. కర్నాటకంలో యిప్ప టికీ జైనంలో వైతాంగమున్నది. హింసను గీతాబోధలో పెట్టిన హిందూ మతంలో వర్తకులు ఎక్కువగా వున్నారుగాని జైనం వెనుక లేరుగదా! హింసా నిషేధకంగాని హైందవం వర్తకులను కాపాడేది కాకపోతున్నదా ? వర్తల్ని కాపాడ వెడలిన జైన బౌద్ధాలు క్షీణించిన తర్వాత వర్తకవర్గాలకు హైందవంవల్ల భద్రతకొరవడిందా? అర్థశాస్త్రంకన్న మనుస్మృతి వర్తకులపట్ల చాలా ఉదారంగా వున్నది గదా !

మాంసాహారాన్ని రాక్షసుల బోధగాను, యజ్ఞయాగాదుల్లోని పశుహింస నిష్ఫలమైందిగాను ఖండించిన చార్వాకం అహింసా బోధకమే, అయితే అందులో వర్తకవర్గం చేరినజాడ వున్నదా ?

హింసా హింసలు :— వర్తకుల వర్తకాభివృద్ధీ ప్రత్యేకించి భారతీయమైన సమస్యలేమీ గావు. ప్రపంచమంతటా వర్తకం వుంది, వర్తకులున్నారు. ప్రపంచ మంతటా అనేక జాతులు పశుపాలనా దశనుంచి వ్యవసాయం దశకు వెళ్ళినై. వర్త కాభివృద్ధిప్రారంభదశను గడచినై. ఆ సందర్భాలన్నిటాఅహింసతలెత్తిందా?అహింస

తలెత్తినప్పుడెల్లయీవర్గాలే వెనకనున్నాయి. ప్రపంచమంతటా మతాలున్నై. ప్రపంచ రంగంమీద హింసాహింసలు-వర్తకవర్గాలు పరస్పరం ఎలా నడిపాయో కాస్త కన్నుగలిగి తీర్మానించుకోవాలి.

యూదులున్నారు, వారిది వర్తకజాతి, వడ్డీవ్యాపారులజాతి. మరి వారిమతం అహింసా బోధకంకాదు. క్రీస్తునీ, ఆయన అహింసాబోధనీ తిరస్కరించిన తర్వాత వడ్డీవ్యాపారుల జాతిగా రూపొందింది. అహింసను బోధించిన క్రీస్తు మతం ఆరంభంలో కొన్ని శతాబ్దాలుగా బానిసల మతంగానే ఉంది. బానిసల్లోనే వ్యాప్తి చెందింది. అసలా అహింసామతం వర్తకుల మతంగా గాని, మరోపాలకవర్గమతంగా గాని తలెత్తలేదు.

ఇదంతా దేనికి? ప్రపంచంలో వర్తకుడే స్వయంగా స్థాపించిన మతమే ఒకటుంది. అదే ఇస్లాం. మహమ్మద్ ప్రవక్త స్వయంగావర్తకుడు. మక్కా-యాత్రికులు త్రోవలో ఎంతైనా వ్యాపారంచేసి తిరిగివస్తే పుణ్యమని సూత్రించిన మతంఅది. వడ్డీవ్యాపారాన్నెంత నిషేధించిందో, ఇస్లాం వర్తకానికి అంత గౌరవ హోదాను ఇచ్చింది. వర్తకం గౌరవార్హమని చాటిన ఏకైకమతం అదొక్కటేనేమో! మధ్యధరాసముద్రంమీద ఓడవ్యాపారమంతావెంటనే ముస్లింవర్తకులచేతిలోకిపోయింది. గజనీ మహమ్మద్ కంటేముందు ఇస్లాం అరబ్బు ఓడవర్తకులతో ఇండియా చేరి వుంది. మన పడమరకోస్తా ఓడవ్యాపారంలో అరబ్బులు త్వరలో పైచేయి తీసు కొన్నారు. మత రాజవ్యవస్థను చెప్పి ఖడ్గ బోధ చేసినమతం ఇస్లాంకన్న మరొకటే ముస్నగి? వర్తకుని మతమే ఒక్కటి, అదే హింసోద్బోధకంగా వున్నది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యాపారమే రాజ్యం చేయబట్టి, వ్యాపార యుద్ధాలు జరుగుతున్నాయని మార్క్సిస్టు అవగాహన వుండనే వున్నది. మధ్యయుగాల్లో మధ్య యుగాంతంలోనూ యుద్ధాలు వర్తకవర్గాల ప్రేరణవల్లకాదు గాని గిరిదుర్గాలు పెచ్చు పెరిగి బలపడి, ముట్టళ్ళు నెలల తరబడిగా పెరిగి దీర్ఘకాలికమైపోయి, సరుకుల సప్లయ్‌లు భారీ ప్రమాణాలకు పెరిగి, సరుకులకు గిరాకీలు సృష్టించేవై యుద్ధాలు వర్తకులకు లాభార్జకమయ్యేవి. యుద్ధాలు తరచులైతే రాజులు అప్పులపాలయ్యేవారు. వర్తకులే అప్పులిచ్చేవారు. సొంతసేనా సొంతరక్షణ సిబ్బందీలేని బిడారు వర్తకం గానీ, ఓడ వర్తకం గానీ చరిత్రలోలేదు. బలింజ సమయంవారూ, పెరికెలూ, నకరాలనే వర్తక సంఘాలూ తమ సొంత సైన్యాలను రాజులకు అద్దెకిచ్చినవైనాలే వున్నై. గుత్తగొల్లలు భేరులు గౌరలు పెరికల కుల చరిత్రలు కాస్త అంతు పట్టించుకోవటం మంచి ఫలితాల నిస్తుందను కొంటాను.

శాంతి అహింసలు ఆర్థికాభ్యుదయానికి కారణాలై వర్తకాభి వర్ధకం కావటం నిజమే- అలాగే యుద్ధాలు సరుకుస్సప్లయిలను అత్యావశ్యకం జేసి అధిక లాభార్జనావకాశం కలిగించే మాటకూడా నిజమే. రెండు పరిస్థితులను వర్తక వర్గాలు వాడుకోగల్గే ఉంటాయి గాని వర్తకులకు అహింసలోనే వెస్టెడ్ ఇంటరెస్ట్ వుంటుందనటం సరికాదనుకొంటాను.

వేమననాడు విదేశీ కంపెనీలు వచ్చి మన వ్యాదల్సుతో కలిసి మనవర్తకుల్ని కొల్లగొట్టారనే మాట నిజంకాదు. డచ్చి, ఇంగ్లీషు, పోర్చుగీసు- తర్వాత ఆలస్యంగా ఫ్రెంచివాళ్ళు పదిహేడోశతాబ్దంలో పోటీలుపడి మన వస్తువులకు పెచ్చురెట్లుచెల్లించిన చరిత్రే ప్రధానంగానడిచింది. ముగ్గురు విదేశీయులు అంతఃకలహాలతో తలపడుతూ, వ్యాపారంలో పోటీపడుతూ మన వర్తకులను ఇరుకునబెట్టి వర్తకం చెయ్యడమన్నది వేమన నాటి మాటగాదు. అది పద్దెనిమిదోశతాబ్దం కొంత గడిచిన తర్వాత మాట. పైగా ఆ పరిస్థితుల్లో మన వర్తకాభివృద్ధికి అవే మంచి రోజులు. ఆ విశేషాలు కొన్ని యీ పుస్తకంలో ఇంతకుముందే యిచ్చాను.

విజయనగర పతనానంతరం చంద్రగిరినుంచి ఏలుతున్న ఆరవీటి రాజ్యాన్ని ఎవరెంత ఆక్రమించుకోవాలా, ఎవరెంత కొల్లగొట్టాలా అని గోల్కొండ బీజపూరులు చేసిన దండయాత్రా పరంపరల వలన, ఆరవీటి రాజ్యంలో అంతర్యుద్ధాల వలన, గోల్కొండ బీజపూర్లపై మొగలు ముట్టడుల వరకూ, యుద్ధ సప్లయిల గిరాకీ తగిలి వర్తకులు బాగుపడ్డారు. రాజులకు అప్పులుపెట్టి బలపడ్డారు. తెల్లకంపెనీలతో సంబంధాలవల్ల తుపాకులు పట్టనేర్చి చెట్టియార్లు హిందూసేనలకే గాక, మహమ్మదీయ సేనలకు కూడా అధిపతులు కాగల్గుతున్నారు. ఆ వివరాలు కొన్ని యిందాకే యిచ్చాను.

హింసాహింసలలో ఒకటి ఆర్థికదోపిడీకి, ముఖ్యంగా వర్తకానికి ఆటంకమైనట్టిది, మరొకటి అనుకూలమైనట్టిదని చేసే విభజన చరిత్రలో నిజం కాదు; ప్రపంచ మతాల నడవళ్ళలో నిజంకాదు. ఇదే నిజమైతే మార్క్సు ఆలోచన కెక్కక పోయేంత స్వల్ప విషయమేమీకాదిది. హింసాహింసల చర్చలో మార్క్సుగాని మరొకరుగాని ఇటువంటి సూత్రీకరణ చెయ్యలేదనుకొంటాను. ఈ విభజన మార్క్సిజంకాదు; మార్క్సిజంయొక్క ఆభాస, మార్క్సిజాన్ని అభాసుపాల్జేసేది.

ఇటువంటి అవగాహన నింపుకొన్న మనస్సు ఇంకా చిత్రవిచిత్రాలకు దారి తీస్తున్నది. అంగీకరిస్తూకూడా అంగీకరింపనివాని గీకరింపులు చేయిస్తున్నది. ఒళ్ళుదెలియకుండా చేస్తున్నది.

వేమన తత్త్వదృష్టి విషయంలో వీరు నన్ను అంగీకరించారు. అది వారికి [తెలిసో తెలియదో] తెలియకుండా వుంది. వారిని విన్నవారికీ ఆ విషయం తెలియకుండా మాట్లాడారు. వేమనలో అచల సిద్ధాంతం వుందని అఖండంగా ఉపన్యసించారు. ఆ అచలంమీద బౌద్ధ ప్రభావం ఉందని నొక్కివక్కాణించారు. ఆ అచలంలో శూన్యవాదం ఉందని బల్లగుద్దారు, అలాగ ఇలాగకాదు, నాలుగు సున్నాల దాకా మరీ ఉందని ఘాటిగా చాటారు. అచలంలోనూ, వేమనలోనూ శూన్యతవున్నదన్నదే నాథీసిస్ అని చెప్పకుండా నన్ను ఇంత బహిరంగంగా ఇంత బేషరతుగా బలపరుస్తూ వేదికెక్కినవారు (అంగీకరించిన వారున్నారుగాని) ఇంత వరకు వీరే. ప్రామాణికులు ఎందులో అయినా కాకపోయినా, యీ అచలం ఒక్కదాన్లోనయినా వీరు ప్రామాణిక పరిజ్ఞానం కలిగిన వారయితేమట్టుకు పండితాభిప్రాయంగా అట్టమీదే అచ్చేసుకొని నిమ్మకునీరెత్తినట్టు నిశ్చింతగా కూర్చుండేవాణ్ణి. కాని అచలంలోకూడా వీరిది చుంబకుని చదువై పోయింది, బలవంతపు బ్రాహ్మణార్థంలాగా నాకోసం చదివిన కక్కుర్తి చదువై పోయింది. తప్పులతడికె ఉపన్యాసం చేశారు. అదంతా ఇంతకుముందే విశదమయివుంది. కాని తమాషా ఏమంటే ఇంతగా నన్ను ధ్రువపరుస్తూ కూడా నామీద పిడికిలి బిగించటం గాని, గాండ్రించటంగాని మానలేదు. నాతో ఏకీభవిస్తున్నానన్న స్మారకంలేదు. Negation of the Negation తప్పనే వారికీ, గతి తర్కంలో అది సర్వసాధారణ సూత్రంకాదని అందుకు సంజాయిషీ యిచ్చే తనకూ ఏకీభావం వున్నదనే స్మారకం లేకుండానే చర్చకు తలపడినట్టే వుంటుంది.

నిన్న మొన్నటి వేమన్నని నాగార్జునగురుగుహలోకి 15, 16 వందలేళ్ళ వెనకకి విసిరిపారేస్తున్నానని నామీద ఉరిమి, వారు చేసిందేమిటంటే, ఆ నాగార్జునుని నాడే అచలుడనే గురువొకడుండేవాడని,నాగార్జునుణ్ణికగిలేసి ఆ అచలుడికే శాతవాహన రాజు దాన మిచ్చి శాసనం చేశాడని, ఆ అచలుడి గుహలోకి విసిరేస్తున్నాను చూసుకోండన్నారు. శాతవాహన సమ్రాట్టు దానం పొందిన ఆ అచలుడేదో విప్లవమూర్తి అయినట్టు, సమ్రాట్టువేత నిజంగా బాధించబడిన నాగార్జునుడు ఫ్యూడలిస్టు, ఇంపీరియలిస్టు అంటూ ఎలుగెత్తారు. —నాలుగు సున్నాల అచలం నాగార్జున శూన్యవాదంకన్నా అభ్యుదయకరమన్నట్టు, అది ఆనాటి నుంచి వేమననాటివరకూ బౌద్ధ ప్రభావంలోనే

బ్రతికివుంటూ వున్నట్టు [ఈ అచలుడూ, ఈ అచలమూ నిజంగా వుంటే నాథీసిస్‌కు అనుకూలమేగాని, వ్యతిరేకంకాదు.] "బౌద్ధం మాత్రం ఎప్పుడో ఆంధ్ర ప్రదేశ్ ఒదిలి పారిపోయింది, వేమనకు అసలు నాగార్జునుడే తెలిసే వీలులేదు, నాగార్జునుని అడ్రసు ఆ రోజుల్లో ఒక్క గ్రామంలో కూడాలేదు. అటువంటప్పుడు అతని శూన్య వాదం వేమనకు తెలిసే వీలులేదు" అచలుని అచలం మాత్రంతెలిసే వీ న్నదని,అందుకనే అచలం వేమనలోఉందని ఘంటాకంఠమెత్తారు. ఏం చెప్పను? అచలుడనేవాడూలేడు-శాతవాహన దానశాసనమూలేదు-పోనీ, అచలం వాళ్ళయినా తమ సిద్ధాంతం 18 వ శతాబ్దిలోవున్న శివరామదీక్షితులతో అచల పీఠం ఆరంభమయిందంటారు, వారికో గురువు శ్రీధరుణ్ని చెప్తారు, తప్పితే చారిత్రక వ్యక్తి వేమనను చెప్తారుగాని, వేమనకు ముందు పౌరాణికేతర వ్యక్తి నామం మరెవరిదీ చెప్పరు. గుడ్డి ద్వేషంతో సుళ్ళుతిరుగుతూ హల్లూసినేషన్లపాలై ఏమేమో ప్రలపించుతున్నారు. తెలుగుదేశంలో ఏ సాహిత్య తగాదాలోనూ ఇంతవొళ్ళు తెలియని తనం, ఇంత గడ్డగట్టిన అజ్ఞత బైటపడలేదు. ఇప్పటికిది రికార్డు-విప్లవ రచయితల సంఘం కార్యదర్శి పేర స్థాపించిన రికార్డు

చరిత్ర నుంచి తమ పాలసీకి ఉపయోగపడే నాలుగు నిజాల్ని ఏరుకొని,ఎదురు చెప్పే మరో నాలుగు నిజాల్నివదిలేసి, వాటిని కలుపుకొని చెప్పే దక్షతలేక వదిలేసి, పాక్షిక సమాచారంతో కొ౦త కల్పనను ఇలా జోడించుకొని సులభ సూత్రీకరణలకు అలవాటుపడి, ఎదగటం మానేసి "ఇన్ని తాత్విక సిద్ధాంతాలు తెల్సుకోవాల్సిన అవసరం వేమనకేమొచ్చింది" అని అడిగారు. అదీ ఆయన సత్యాన్వేషణా నిరతి అంటేనూ, ఆలోచనకు సొంత నడక౦టూ వుంటుందంటేనూ నమ్మరాని విషయ౦గా చూస్తారు. బౌద్ధం శూన్యవాదం దేశంనుంచి ఎప్పుడో పోతే, వేమనలోనో మరొకరిలోనో శూన్యవాదమెలావుంటుంది,ఉంటానికే వీల్లేదంటున్నారు. అది నాగార్జునునికో, బుద్ధునికో, ప్రజ్ఞాపారమితాకర్తకో ఎలా తట్టిందో, అలాగే ఇంకొకరికి తట్టటానికి వీల్లేదంటున్నామని కానటంలేదు. ఉందా లేదా అన్నదే ప్రశ్నగాని, వుంటానికి వీల్లేదనేవారు భావ ప్రపంచానికి ఎంతోకొంత స్వాతంత్ర్యమైనా లేదనేవారమవుతున్నామని, శుద్ధ ఆర్థిక నియతిగా మార్క్సిజాన్ని మార్చుతున్నామని తెలుసుక్కోవాల్సి వుంటుంది.

అదీగాక, అన్ని శతాబ్దాలుగా యీ నేలలో పాతుకొని, విస్తరించిన బౌద్ధ విచారధార ఆనవాలు మిగులని చావు చావడమంటే ఎంత అసంభావ్యమైన సంగతి అవుతుందో అనే ప్రశ్న కలగకపోయినా, దాని జాడకై చూడకపోయినా మన

తెలివినీ, మన అనుభవాన్ని అనుమానించుకోకతప్పదు. వీరశైవంలో, నాథసిద్ధులలో, కబీరులో, ఉత్తరాదిలో యింకెందరిలోనో, ఇక్కడి అచలంలోనూ ఆ ముద్ర వున్నదనీ, తెలుగు సాహిత్యమూర్తుల్లోనే ఆ ఛాయవుందనీ, శ్రీనాథునిలో (15 వ శతాబ్దంలో) వున్నదని, 16 వ శతాబ్దిమధ్య తెనాలి రామలింగడిలో - దశావతార సంగ్రహ వర్ణనం చేసిన సీసంలో, నిగమశర్మ మరణదశలను దశావతారాలుగా చెప్పిన సీసంలో మరోకందంలో ఆ శూన్యవాద ప్రసక్తి కానవస్తోందనీ తెలిసి మాట్లాడాలి. 16 వ శతాబ్ది కవులకు తెలియవీలున్న విషయమైతే, తత్వశాఖల్లో మరింతగా తెలియ నవకాశమున్న విషయం కాకపోతుందా? కుమారిల శంకరులతో బౌద్ధం రూపుమాసి పోయిందనేమాట నిజంకాదని రాహుల్ సాంకృత్యాయన్ సోదాహరణంగా చూపిం చారు. శంకరుని కేరళలోనే బౌద్ధుల మంజుశ్రీ మూలకల్పం మొన్న మొన్న దొరికింది. నాగార్జునుడి వ్రాత ప్రతులున్నాయని వార్త వేళారీమధ్య. ఎందుకీ వెర్రి మొర్రి సంశయాలు. ఆలోచనా గాదు, అనుభవమూ గాదు యీ సంశయాత్మ.

వీరితో అవగాహనలో భేదించిన వారేమి చేసినా అది విరసం మీద దాడి, విప్లవం మీద కుట్ర. అంతకు తక్కువగా మాట్లాడే వవిలేదు. వీరు స్మరించే పేర్లు గాకుండా ఇంకొక పేరెవరయినా పైకితెస్తే, వారిలో యేమైనా తిరుగుబాటు దినుసు వుండో లేకో ..షన్నదంటే చాలు. అదంతా విప్లవాన్ని కొట్టడానికే కావాలని పైకి తెస్తున్నారంటారు. అదొక వర్గకుట్ర అంటారు. వీరేకాదు, వీరి మిత్రులు మరికొందరు కూడాఅంతే. పోతన జయంతివీరికొక వర్గ ట్ర.వేమన పరి శోధన, వేమన భావవ్యాప్తి విప్లవంమీదా, విరసం మీదా దాడే. వీరికిదొక పెర నోయా (Paranoia), రజ్జు సర్పభ్రాంతి అయింది. వేమనమీద వెంకటేశ్వర్రావు గ్రంథం వ్రాయడం విరసం మీద దాడికే నంటారు. ఉపన్యాసం యెత్తుగడే అది.

"విరసాన్ని యెదుర్కోవటానికి అనేకమంది రచయితలు, ఆస్థానకవులు, ముఖ్యమంత్రుల నుంచీ అభ్యుదయ కవులదాకా అనేక పద్ధతుల్లో ప్రయత్నిస్తూ వచ్చారు. ఆందులో భాగంగానే త్రి. వెం. రావు విశ్వదాభిరామ వినురవేమ అనే గ్రంథం వ్రాశారు" అని ఆరంభించారు

కాని వెంకటేశ్వర్రావు వేమనపరిశోధన, తదవగాహనలో ప్రధానభాగం, వీరి కిష్టం కాని భాగం, విరసం పుట్టకముందే రూపొందింది. 19? లోనే రూపొందిం దని పుస్తకం పీఠికలోనే వుంది. 1970 చివర విరసం పుట్టింది. అప్పటికే వేమనలో శూన్యతాభావం, ఆర్థిక మాధ్యమికం వెంకటేశ్వర్రావుకు కనిపించినాయని ఆ పీఠికే చెప్పింది కాని యిలా చెప్పడమంటే విరసం యిక పుట్టనున్నదని అతీంద్రియ శక్తితో ..నుగొని, దాన్ని దెబ్బతీయడం తన వంతని, వేమన అనే ఆయుధాన్ని పూని దెబ్బతియ్యదగునని వ్యూహం వేసుకొని, విరసం పుటకలకై వేచి,

అది పెరిగి పెద్దయ్యేదాకా ఆగి, గ్రంథంరాసి వెలువరించాడని భగవదవతారం, రాక్షసుల యత్నాలవంటి పురాణగాథల ఒరవడిలో పెట్టి చెప్పడమవుతుంది. మంచి మిథికల్ థీమ్. నిజానికి వీరి ఆలోచనలో మిథికల్ ఎలిమెంటు చాలా వుంటుంది.

ఈ వేమన అవగాహన విరసం పుట్టి పెరగకముందే ఏర్పడటమంటే, అప్పటికి వెంకటేశ్వర్రావు యింకా సొంతయింటికప్పుక్రింద లేడని, ఆర్థికంగా నిల దొక్కుకోలేదని. అప్పట్లోనే యీ రచన పూర్తి చేసేసివుంటే అతని ఆస్థిపాస్తులూ యిల్లూ వాకిళ్ళ అంచనాలు, అతని ఆదాయపు మదింపులు తయారుచేయాల్సిన బాధ వీరికో, మరొకరికో కలిగించేవాడు కాడని, అదంతా వేమన సభలో వెళ్ళబోసుకొనే పనిబెట్టేవాడు కాడనీ అర్థం. కాని ఆలస్యంగా రాసి వీరికిటువంటి బాధ తెచ్చి పెట్టాడు. వేమన వేదికమీద నివేదికగా చదవాల్సిన అవసరం కలిగించాడు.

త్యాగ జీవితంనుంచి విరమించు కొన్నందుకు వ్యాపారంలో వున్నందుకు సెటైరుతో పైరేడ్ సాగించి, వెంకటేశ్వర్రావు ఆస్తి లెక్కలెత్తుకోబట్టగా, ఆ వేమన–విరసం సభ కాస్తా, వెంకటేశ్వర్రావు-విరసం కాదు.... మధుసూదనరావు సభగా మారిపోయి, వేదికమీదా, వెనకా వెదికితే వేమనా విరసమూ కనిపించకుండా పోయి సభ తికమక పడుతోండగా, వెంకటేశ్వర్రావు మీద యీ సాంస్కృతిక పోరాటం చాలకపోతే ఏ పోరాటమయినా చేపట్టుతామని పిడికిలి బిగించి బిగ్గరగా బెద రించి కూర్చునేసరికి సభ అదిరిపోయింది. ప్రశ్న అడగమంటే కొంచెం తేరుకొని అసలా వేమన విరసం—ఇద్దరూ యేమయ్యారో, ఎక్కడ వెళ్ళిపోయారో తెలీడం లేదనే ఒకే ఒక ప్రశ్న వినిపించింది. వారిద్దరూ యేమీగాలేదు, ఎక్కడికీ పోలేదు నా పూర్వ పక్షంలోనే వున్నారు, కలిసిపోయి వున్నారు, కనపడటం లేదనుకోలేదు, అయితే యిదిగో, యిలా తెచ్చి చూపిస్తానంటూ మళ్ళీ మొదలుపెట్టి ముక్కుబడి ముక్కలు నాలుగుచెప్పి ముగించాల్సి వచ్చిందంటే ప్రసంగమెంత దారితప్పి నడి చిందో సభ ఎంత నిష్ఫలమయిందో తెలుస్తున్నది గదా!

ఎందుకిలాగయిందనే ప్రశ్నకు మధుసూదనరావు బాధ విరసం బాధ కావడాన అనీ, వారికెందుకంత బాధోనంటే వేమనను వ్యాపారస్తుల కవిని చేసిన విపరీతపు థీసిస్ డిబంకై దెబ్బతిన్న అహం లెమ్మంటే అంతేనా, ఇంకేమైనా వుందా, ఆస్తులదాకావెళ్ళారు,అయినవాళ్ళు అవి అనేకులు జిజ్ఞాసువులయ్యారు. ఆస్తులఅంచనాలు అచ్చులో చూడకుండానే గుర్రం వెంకటరెడ్డి గారికి వీరిలో జ్ఞాతిబాధ కనిపిస్తున్న దన్నారు ఆంధ్రపత్రికలో (26, ఏప్రిల్ 1982).

"పశ్వదాభిరామ వినురవేమ" అన్న ఉద్గ్రంథం వ్రాసిన శ్రీ వెంకటేశ్వర్రావు పైన వీరి కువిమర్శ ధోరణి....జ్ఞాతి వైరంవలె కనపడుతోంది. అత్తమీద కోపం దుత్తమీద చూపించినట్లుగా వుంది" అవునో కాదో పాఠకులే నిర్ణయించుకుంటారు.

శ్రీశ్రీమీద అయిష్టం శ్రీశ్రీ కవిత్రయం మీద, అనగా తిక్కన వేమన గుర జాడల మీద అయిష్టంగా పర్యవసించిందని విరసంలోవారే వీరిమీద వెనక వ్రాసే వున్నారట వీరి స్వభావం అంతమాత్రపుదేనని అందులోవున్న మాటయింది. దురుసుగా మాట్లాడటం నాకు అలవాటు; మన్నించాలని మొదలే విన్నవించి ప్రసంగించిన విచిత్రం కూడా వీరి మధ్యనే చేశారు. మాట దురుసు మనసు దురుసు చేతదురుసు కాదనుకోమంటారుగాని సాహిత్యరంగంలో బెదరింపులు ప్రవేశపెట్టినవారు మాత్రం వీరే. Intellectual Dialogue వీరివల్ల కానిపని. వీరి సభవల్ల, వీరి ప్రసంగ వైఖరివల్ల, వీరి మొద్దు సూత్రీకరణల వల్ల వేమన విషయంలో విరసం ఒక రొంపిలో పడింది. బయట పడుతుందో పడదో.... వేమన వ్యాపారస్తుల కవి అనేమాట విరసంమాట అయింది.

My dear T. V. విశాఖ 3-6-1981

.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

Inspite of us మీ మీటింగులు బాగా జరిగినందుకు సంతృప్తిగావుంది. వ్యక్తులను వదిలెయ్. మా సంస్థపరంగా చూడు. ఒకవేళ మావల్ల పొరపాట్లు జరిగితే దిద్దుకొంటాం ముందుముందు. మానిజాయితీని శంకించవని ఆశ.

Sb. (చలసాని) ప్రసాద్.

కాని యీ సభ ఇందుకు విరుద్ధంగా జరిగింది. ఈ ప్రసాదే సభకు అధ్యక్షులు. అదే ట్రాజెడీ. కార్యదర్శి కారుమాటలకీ, బెదరింపులకీ, రజ్జు సర్పభ్రాంతులకీ, వ్యాపారస్తుల కవి సూత్రీకరణకీ వీరూ పార్టీ అయిపోయారు. అమెరికానుంచి హైదరాబాద్‌దాకా జరిగే వేమనారాధనా నిరసనకూడా వీరి వంతయింది. అంకితం నిరసన మరొకరివంతు. వ్యక్తిగతంగా వ్రాశాను, ప్రచురించవద్దని నాకు రాసుకో బట్టిన కార్యదర్శి అంకితం వంక జూపి సంస్థను సమీకరించుకొని ఏం చేశారో అన్నది సంస్థల దుస్థితిని తెలుపుతుంది. చార్లిటన్లూ, ద్వేషక్రౌర్యాలతో ప్రచలితమైన వాళ్లూ సంస్థలనిలా పట్టుకొని, తప్పుదారి పట్టిస్తుంటారు. మంచిచెడ్డల విచక్షణతో విలువలతో వూగేవాళ్ళని క్రమశిక్షణా పాశాలువేసి. సంస్థ సమిష్టి ప్రయోజనాలు చూపి యిలాగే లాక్కుపోతుంటారు.

అంకితాన్ని గూర్చి వేరే యిలా ఒకసభ పెట్టవలసిన అవసరాన్ని మిగల్చకుండా మా వేదికమీదే వేలాదిమంది ముందరే పుస్తకావిష్కరణ సమయంలోనే జ్వాలాముఖిగారు యీ పాత్ర నిర్వహించేశారు. వంద వందన్నర మందితో, నేను లేకుండా సభ పెట్టడంకన్నా జ్వాలాముఖిగారు చేసినదే Dramaticగా వుంది. Directగా Face చేసిందిగా వుంది. ముఖాముఖి సమాధానం తీసుకోగలిగివుంది.

నన్ను ఖండించినందుకిప్పుడు అంత బాధగాలేదు, అంకితమే అసలు పెద్ద బాధగా వుందని రాయడం సాగిస్తే, ఆభాగం అయిపోయింది, చేసేదేమీలేదు, మిగిలిందేమైనా వుంటే వేమన అవగాహన మీద చర్చేనని, అదేదో చేయమని రాస్తే గదా, అదీచేసి చూపగలనని అంకితం వంకమీదుగా సంస్థను నిలబెట్టి, ఆపైన మతం తత్వం కవిత్వం భాష చరిత్ర మార్క్సిస్టు అనుశీలన ఆర్థికసంబంధాల పరిశోధన వాటన్నింటికీ మించి వక్రీకరణలోనూ అపారమైన పాండిత్యాన్ని విజ్ఞులకు వినోద దాయకంగానూ, సాధారణులకు ప్రవక్త వచో ధారగానూ ప్రదర్శించారు. సభకు నన్ను పిలవమని యెందరు సూచించినా పిలవలేకపోడానికి యీ ప్రసంగస్థాయికీ సంబంధం కనబడుతున్నదిగదా సాంస్కృతిక పోరాటం చాలకపోతే యే పోరాటమైనా చేస్తామన్న దానివెనక అందుకు తమ స్థాయిని గూర్చి అపనమ్మకం అప్పుడే వుందిగదా!

అంకితం మాట కొంచెం చెప్పాలి. ఎర్రజెండాలను మూడురంగుల జెండాలతో కలిపి ఎమర్జెన్సీ గడియల్లో రైతు సమస్యల మీద హైదరాబాదులో జరిపిన ఊరేగింపుల డాక్యుమెంటరీ షాటులను ముగింపు సందేశం చేసిన ఒక సినిమాను ఒక ఉగ్రవాద మృతవీరునికి అంకితం చేసినందుకు ఆంధ్రదేశం గోడ గోడమీదా విప్లవ సినిమా చూడండని రాయడమొకటి చూశాం. రచయిత అంకితంమీద ఆక్రోశం పెంచుకొని పుస్తకంలోపలున్న భావ వ్యవస్థమీద వక్రదృష్టి ప్రసరింపజేసి వీధి ఉపన్యాస విన్యాసం చెయ్యడం యిప్పుడు చూస్తున్నాం.

ఈ అంకితం విరసంవారి ప్రత్యేక రాజకీయ పంథాకు విరుద్ధమవుతేగావచ్చు. అలాగని అప్పట్లో నాకు తెలియదు నిజానికి. పుస్తకం పూర్తయ్యే గడియల్లో, సభకు ముందుగా ఏప్రిల్ 4, 5, 6 (1981) తేదీల్లో శ్రీకాకుళంసీమకు వెళ్ళాను. పోరాటపు పురిటిగడ్డ గుమ్మ లక్ష్మీపురం వెళ్ళాను. మేరంగి వెళ్ళాను. మృతుల కుటుంబాలను కలిశాను. మిత్రులను చూచుకొన్నాను విశాఖలో దిగి చలసాన్ని తీసుకొని జెయిలుకు వెళ్ళాను. తేజేశ్వర్రావు, పట్నాయక్, నారాయణపురం వగైరా గ్రామమిత్రులెందరితోనో అపరిచితులింకొందరితోనూ ఆప్యాయంగా 2,3 గంటలు మాట్లాడుకొని వచ్చాను. ఇంకేముంది, నాలో శ్రీకాకుళం మెదిలింది. వేమన ఆర్థికచింతన, పరుని సొమ్ము పట్టిపరుని కిమ్మనమనే బోధ, అది కార్యరూపం కూడా అప్పుడేదో తీసుకొందన్న స్ఫురణ మెరిసి యిలా అంకితం ఇద్దామనుకొన్నాను, ఇచ్చాను. అంతే. అవతల ఎవరేమనుకొన్నప్పటికీ, ఉన్న యథార్థం యిది.

# చారిత్రక భౌతికవాదం - స్త్రీ-వేమన

త్రిపురనేని వెంకటేశ్వరరావు

వేమన విషయంలో అంతస్సాక్ష్యమేగాని బహిరంగమైన ఇతరసాక్ష్యంలేదు. అదే అతని విషయంలో వచ్చిన కష్టం. అసలుమన దేశంలోచరిత్రసామగ్రిఎంతోలేదు. అందులో సామాజిక చరిత్ర, ఆర్థిక చరిత్ర ఇంకెంత తక్కువో చెప్పపని లేదు. ఆ వున్న కాస్తనూ చారిత్రక భౌతికవాద దృష్టితో ఎంత వ్రాశారో నేను చెప్పనక్కర లేదనుకొంటాను. అందులో ఆంధ్రసంస్కృతిచరిత్ర-ఆంధ్రకవితా పరిణామ చరిత్ర, చారిత్రక భౌతికవాద దృష్టితో ఎవరేమి తయారు చేశారో తెలియని దేమున్నది-భావాలేమిటో తేల్చే సరికే ఇంత పరిశోధన కావాల్సి వచ్చింది. వాని పుట్టుక, పరిణామాలకు భౌతిక జీవితంలో కారణాలు చూపించాలంటున్నారు. చూపించగలిగితే మంచిదే. అన్ని భావాలకు భౌతిక కారణాలుంటేమంచిదేగానివున్నవా అన్నదే ప్రశ్న. స్త్రీలపట్ల వేమన దృష్టిమాటే తీసుకొందాం!

"సమాజ ఉత్పత్తి విధానంలో స్త్రీ పాత్ర ఎప్పుడు తగ్గిందో, పురుషుడు ఆధిక్యత నెప్పుడు సంపాదించాడో అప్పటినుంచే స్త్రీ పతనం ప్రారంభమయిందని చారిత్రక భౌతికవాదం చెప్పింది, ఎంగెల్సు చెప్పాడు. స్త్రీలందు వేమన చూపిన ఈ హీనభావం రుషులకూ, మునులకూ, యోగులకూ, జోగులకూ వుండేదే. వేమన యీ పరిధి దాటలేకపోయాడు, అంతే." అంటే చారిత్రక భౌతికవాదం అవుతున్నదా? ఎన్నో రంగాలలో యెంతో సంస్కరణ చూపిన వేమన స్త్రీ విషయంలో యిలా వెనకబడటానికి కారణాలేమిటి అని ప్రశ్నించుకుంటే, వేమన జీవితాన్ని బట్టి కొన్ని ప్రత్యేకమైన కారణాలు వున్నాయని చెప్పితే అది కాకపోతుందా? ఇతరుల జాడలో పోగూడని వేమన యెందుకు పోయాడో చెప్పుకోజూడటం వాద దౌర్బల్యమా? అది వేమనను యెట్లాగో 'బురదనుంచి లాగుదామని' ప్రయత్నం చేయటమా? చారిత్రక భౌతికవాది చేపట్టవలసిన సమస్య కాదా యిది. ఒకానొకని భౌతిక జీవిత

పరిస్థితులు అతని భావాలకు యెంతవరకు కారణం అన్న పరిశీలనలో యీ వివేచన ఒకభాగం అనుకొంటున్నాను.? కాదామరిపరిశోధనకావున వేమనభావాలతోనాఏకీభావమూ సమర్ధనా ప్రశ్న కారాదు.

జీవితంలో వేమన స్త్రీ వద్ద దెబ్బ తిన్నాడనీ. మొదట వేశ్యా వాటిలో కూడా ప్రేమను ఆశించి అనిపొందలేకపోయి తర్వాత పెండ్లాడిన ఆమనుంచి ఆశించినా ఆమె గయ్యాళి గావటాననో. ఆర్థిక బాధలకు తటుకోలేకనో, ఆమెవద్ద అది దొరకనిదై స్త్రీపట్ల కఠినభావం యేర్పడిపోయి వుండొచ్చు. ఆమీద సంసారాన్ని రోసి, ఇంద్రియాలు కట్టేసుకొని పరాన్ని అన్వేషించబోతే మళ్ళీ అక్కడ మోక్షసాధనకు కూడా స్త్రీయే సాధనమని చెప్పే తంత్రాచారం అన్ని మతాలను ముంచెత్తుతుండటం చూచి, వామమతమూ కివీరూచేసినస్త్రీనిందనాన్ని జీర్ణం చేసుకొన్నాడు. ఇందులో స్వానుభవం పట్టువుంది. సొంతంగా ఆలోచించుకొన్నదుంది. తప్పైనా - ఆ తప్పులో కూడా ఒట్టి అనుకరణం కాదు - స్త్రీ స్వాతంత్ర్యాన్ని చెప్పిన వీరశైవ సంప్రదాయాన్ని ఉల్లంఘించి యిలా తయారవడానికి అతని స్వతంత్రబుద్ధి కారణమని చెప్పాను.దీనికి ఏమేమో వ్రాయడం సరేనా?

రాళ్ళపల్లి వారన్నట్టు వేమనకు స్త్రీపట్ల అయ్యోపాపం అనజాలిన జాలికూడా లేదనటం సరికాదని - స్త్రీ విషయంలో జాలితో వ్రాసిన పద్యాలు, "తరుణి పుణ్యవతిగ వరుని బట్టియె యౌను, పాపినియగు వరుని బట్టియె యిల" అని స్త్రీ పక్షాన అన్నదీ, "ఆలసగా ఆత్మ సుమీ" అన్నదీ "పాపమంత గూడి పడతిగా పుట్టిన కష్ట మాసతిదని కనువారు లేరయా" అన్నదీ కూడా వున్నదని, అది అతనిలో పరిణామమని, అది పూర్ణరూపం తీసుకోకుండా మధ్యలోనే ఆగిపోయిందనీ వ్రాశాను. ఈ పద్యాలు లేవా? వేమనవి కావా? ఈ వ్యాఖ్యానం పొసగదా? ఇదేమీ నండూరి వారు చర్చించలేదు. ఈ భాగాన్ని చెప్పలేదు.

స్త్రీపట్లఔదార్య గౌరవాలు చూపిన పద్యాలంటూ పది పన్నెండు వుండగా, స్త్రీ గర్హణ తగ్గిన దశను నిరాకరించడం ఎలా పొసగుతుంది? ఇలా పద్యాలిచ్చి వున్నా బలరామ్మూర్తిగారు వేమన స్త్రీ పట్ల గౌరవభావం చూపిన పద్యం ఒకటీ లేదన్నారు. ఏంచెప్పను! ఇంకెన్నోవున్నాయి. కొన్ని యిచ్చాను. ఇంకా ఇవ్వాల్సినవున్నాయి. *

---

*1) ఒడలు శిథలమైన ఓరుపు గలసతి గుణము మేల్మిబట్టి కోటిసేయు
ప్రాత చెనుముపాడు రోతనవచ్చునా.......

